# ఆంధ్రప్రదేశ్



రామచంద్రాపురం విద్యుత్పరికరాల కర్మాగారంలో

మే 1967

50 పైసలు

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి: 11 ] మే 1967 [ సంచిక : 7.

చైత్ర—వైశాఖ 1889 శా. శ.

ప్రధాన సంపాదకులు

బి. ఆర్. కె. శాస్త్రి,
ఎం.ఎ., ఐ.ఎ.ఎస్.

సంపాదకులు

వడ్డుల రంగనాథం

## ఈ సంచికలో



ముఖ చిత్రం : రామచంద్రాపురం
భారీ విద్యుత్పరికరాల కర్మాగారం
ఫోటో : జగదీశ్వరరావు

రెండవ చిత్రం : గ్రామసీమ

మూడవ చిత్రం : రంగులరాట్నం
ఫోటోలు : సీతు

నాలుగవ చిత్రం : ఆంధ్రప్రదేశ్ ద్రాక్షపంట

ఫోటో : ఎస్. సయిదుద్దీన్

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి: 11 ]	మే 1967	[ సంచిక : 7.

చైత్ర—వైశాఖ 1889 శా. శ.

ప్రధాన సంపాదకులు
బి. ఆర్. కె. శాస్త్రి,
ఎం.ఎ., ఐ.ఎ.ఎస్.

సంపాదకులు
వదువుల రంగనాథం

## ఈ సంచికలో



ముఖ చిత్రం : రామచంద్రాపురం
భారీ విద్యుత్పరికరాల కర్మాగారం
ఫోటో : జగదీశ్వరరావు

రెండవ చిత్రం : గ్రామసీమ

మూడవ చిత్రం : రంగులరాట్నం
ఫోటోలు : సీతు

నాలుగవ చిత్రం : ఆంధ్రప్రదేశ్ ద్రాక్షపంట

ఫోటో : ఎస్. సయిదుద్దీన్

ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.

*గవర్నరు ప్రసంగంనుండి కొన్ని భాగాలు*

# ప్రజాస్వామ్యంలో

*నాలుగవ సార్వత్రిక ఎన్నికల తర్వాత తొలిసారి ఉభయ శాసనసభల సంయుక్త సమావేశం మార్చి 20న జరిగింది.*

## మన అచంచల విశ్వాసాన్ని మరొకసారి నిరూపించిన ఎన్నికలు

రాష్ట్రమంతటా సాధారణ ఎన్నికలు శాంతియుతంగాను, సమర్థవంతంగాను నిర్వహించబడినాయి. 1962 లో జరిగిన సాధారణ ఎన్నికలతో పోల్చి చూసినప్పుడు ఇటీవల జరిగిన సాధారణ ఎన్నికలలో 13 లక్షలకు పైగా ఎక్కువమంది ఓటర్లు తమ వోటు హక్కు వినియోగించుకున్నారు. అక్కడక్కడ ఏవో స్వల్ప సంఘటనలు ఓనహా ఎన్నికల కాలంలో శాంతి భద్రతల పరిస్థితి చాలా సంతృప్తికరంగా వున్నది. ఎన్నికల బాధ్యత వహించి వాటిని సాఫీగాను, సమర్థవంతంగాను నిర్వహించిన అసంఖ్యాకులైన ఉద్యోగులు ప్రశంసనీయులు. ఈ ఎన్నికలు ప్రజాస్వామిక విధానంలో ప్రజలకు గల విశ్వాసాన్ని, వారి రాజకీయ చైతన్యాన్ని, పరిణితిచెందిన వివేకాన్ని మరొకసారి నిరూపించాయి.

*నాలుగవ ప్రణాళిక:*

రాష్ట్ర నాలుగవ ప్రణాళికావ్యయం 522 కోట్ల రూపాయలుగా వుండాలని ప్రణాళికా సంఘం అంతిమంగా అంగీకరించింది. ఈ మొత్తంలో రూ. 280 కోట్లవరకు కేంద్రం సహాయం చేస్తుంది మిగతా రూ 242 కోట్లు రాష్ట్రంస్వయంగా సమకూర్చుకోవలసివుంటుంది 522 కోట్ల ప్రణాళికకు రంగంవారీ కేటాయింపులు నిర్ణయించబడినాయి. ఆ కేటాయింపుల ననుసరించి శాఖలవారిగా వివరమైన ప్రణాళికలు రూపొందించ బడుతున్నవి. ప్రణాళికలో నీటిపారుదల, వ్యవసాయాలకు అత్యధిక ప్రాధాన్యమివ్వబడింది. ఈ రెంటికి కలిపి రూ. 207 కోట్ల మొత్తం కేటాయించబడింది.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నాలుగవ ప్రణాళిక కాలంలో పెద్ద ఎత్తున ఫలితాల నివ్వడం ప్రారంభిస్తుంది. ఈ ప్రాజెక్టుకు నాలుగవ ప్రణాళికలో రూ. 65 కోట్ల మొత్తం కేటాయించబడింది. దీనితో ప్రాజెక్టు పై మొత్తం వ్యయం దాదాపు రూ. 160 కోట్లు అవుతుంది. రాష్ట్ర పారిశ్రామిక, వ్యవసాయ అభివృద్ధికి విద్యుచ్ఛక్తి కొరత ఒక ఆటంకంగా వున్నది. రాష్ట్ర అవసరాల దృష్ట్యాను, ఇప్పటకే సాధించిన కార్యక్రమ గతి దృష్ట్యాను విద్యుదభివృద్ధిపై రూ. 170 కోట్లు ఖర్చు చేయాలని సంకల్పించబడింది. రాష్ట్రంలో ఇప్పుడున్న బకాయి పథకాలే అదనంగా 420 మె. వా. స్థాపిత శక్తిని సమకూర్చుతాయి. సాంఘిక సేవలకు చేసిన కేటాయింపు మూడవ ప్రణాళికలో జరిగిన వాస్తవ వ్యయం కంటె 70 శాతం ఎక్కువ. ఆవిధంగా ఈ రంగంలో కూడా కనీసావసరాలను తీర్చడం సాధ్యం అవుతుంది.

1966_67 వార్షిక ప్రణాళిక రూ. 79.25 కోట్లుగా మొదట అంచనా వేయబడింది. ఇప్పుడిది రూ. 94.98 కోట్లు కాగలదని భావించబడుతున్నది. ఈ మొత్తంలో కేంద్ర ప్రభుత్వ అదనపు సహాయం నాగార్జునసాగరు ప్రాజెక్టుకు రూ. 8 కోట్లు చిన్న తరహా నీటి పారుదలకు రూ. 1.75 కోట్లు. గొట్టపు బావులను, పంపు సెట్లను శక్తివంతం చేయడానికి రూ. 1.60 కోట్లు. ఇతర సర్దుబాట్లు చేరివున్నాయి.

కేవలం ఆహారోత్పత్తి అధికమైనంత మాత్రాన సమస్య తీరిపోదు. ఈ అదనపు ఉత్పత్తిని సక్రమంగా సేకరించి పంపిణీ చేయడానికి తగు యంత్రాంగంకూడా వుండాలి. ఈ విషయంలో మన రాష్ట్రం గణనీయమైన కృషి జరిపింది. ఆహారధాన్యాలు అవసరమైన ఇతర రాష్ట్రాలకు మన రాష్ట్రం ఎప్పుడూ తోడ్పడుతూనేవుంది. 1964_65 వంటి బాగా పండిన సంవత్సరంలో మనం 6 4 లక్షల టన్నులు సేకరించి 5 45 లక్షల టన్నులు ఎగుమతి చేశాం 1965_66 వంటి బాగాపండని సంవత్సరంలో సైతం 6 54 లక్షల టన్నులు సేకరించాం. కాని అనావృష్టి కారణంగా ఆహార ధాన్యాలు మనకే అవసరమైనందున 2 77 లక్షల టన్నులు మాత్రమే ఎగుమతి చేయగలిగాం. ఈ సంవత్సరం ఇప్పటికే 3.07 లక్షల టన్నులు సేకరించాం అందులో 2 లక్షల టన్నులు యితర రాష్ట్రాలకు ఎగుమతి చేశాం. బీహారులో తీవ్ర అనావృష్టి పరిస్థితులు ఏర్పడిన కారణంగా వారికి ఇరవై వేల టన్నుల వరి విత్తనాలు సరఫరా చేయడానికి అంగీకరించాం. ఈ విధంగా ఆహార ధాన్యాలను సేకరించి రాష్ట్రంలోని కొరత ప్రాంతాలకు, యితర రాష్ట్రాలకు కూడా పంపిణీ చేయడానికి అవసరమైన యంత్రాంగం ఏర్పాటు చేయబడింది. ఇప్పుడున్న వ్యవస్థను హేతుబద్ధం చేయడానికి, ముఖ్యంగా ప్రస్తుతం ధాన్య సేకరణ పనిని నిర్వహించే సంస్థల సంఖ్యను తగ్గించడానికి ఇంకా అవకాశం ఉన్నదని ప్రభుత్వం భావిస్తున్నది. సేకరణ, నాణ్యతా నియంత్రణ, నిల్వ, సరఫరా వ్యవహారాలు చూడడానికి ఒకే సంస్థ వుండాలని ప్రభుత్వం అభిప్రాయ పడుతున్నది. ఆ కారణం చేత ఈ విషయాన్నంతటినీ పరిశీలించి రాష్ట్ర ప్రభుత్వం తరఫున ఈ బాధ్యతలన్నిటినీ ఒకే సంస్థ నిర్వహించ గలదేమో చూడడానికి ప్రభుత్వం సంకల్పిస్తున్నది. ఆహార ధాన్యాలకు సంబంధించినంతవరకు మన రాష్ట్రం, కేంద్ర ప్రభుత్వ అంగీకారంతో ఒక మండలంగా చేయబడింది. రాష్ట్రం అంతా ఒక మండలంగా ఉండే ప్రస్తుత పరిస్థితి, సమగ్ర ఆహార విధానాన్ని అమలు పరచడానికి ఎంతో అవసరమని ప్రభుత్వం భావిస్తున్నది. రాష్ట్ర

సరిహద్దుల గుండా ఆహార ధాన్యాల దొంగ రవాణాను అరికట్టేటందుకు ప్రభుత్వం స్థాపిం తనిఖీ కేంద్రాలను, సంచారి తనిఖీ కేంద్రాలను నెలకొల్పడం, ప్రత్యేక రహస్య సమాచార విభాగం నెలకొల్పడం వంటి చర్యలను ఇదివరకే తీసికొన్నది. ఇతర రాష్ట్రాలతో ఉండే సరిహద్దులను మూసివేసి ఆహార ధాన్యాల దొంగ రవాణాను ఇంకా కట్టుదిట్టంగా అరికట్టడం కోసం ప్రభుత్వం మరికొన్ని చర్యలు తీసుకొంటుంది.

పరిశ్రమలు :

సుమారు 17 కోట్ల రూపాయలు ఖర్చుకాగలదని అంచనా వేయబడ్డ విశాఖపట్నంలోని భారత భారీ ప్లేటు, వెసల్సు పరిశ్రమకు, రూ. 8 కోట్లు ఖర్చు కాగలవని అంచనా వేయబడిన చెర్లపల్లిలోని రెండవ కేబులు ఫ్యాక్టరీకి సంబంధించినపని త్వరలోనే ప్రారంభమవుతుందని ఆశించబడుతున్నది. ఇవిగాక చెర్లపల్లి దగ్గర సుమారు రూ. 8 కోట్ల వ్యయంతో జిర్కోనియం ప్లాంటు, సిరమిక్ ఫ్యూయల్ ఫాబ్రికేషన్ ప్లాంటు, యురేనియమ్ ఆక్సైడుప్లాంటుతో కూడివున్న అటామిక్ ఎనర్జీ కాంప్లెక్సు స్థాపించడానికి కూడా కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది తూర్పు పాకిస్థాన్ నుంచి వలస వచ్చినట్టి, బర్మా—సిలోన్‌ల నుండి స్వదేశానికి వచ్చినట్టి వెయ్యి కుటుంబాల పునరావాసం కోసం రామగుండం వద్ద జవుళి పట్టణవాడను నెలకొల్పడానికి కూడా కేంద్రప్రభుత్వం మంజూరు నిచ్చింది.

ఆ విధంగా పబ్లిక్ రంగంలోని పరిశ్రమలు కొన్ని మన రాష్ట్రంలో నెలకొల్పబడుతున్నాయి. అయితే, మన రాష్ట్రంలో అటువంటి పెట్టుబడులు గతంలో మనకు రావలసిన వాటికంటే తక్కువగా ఉండటంవల్ల ప్రభుత్వం మన రాష్ట్రంలో కేంద్ర రంగానికి చెందిన చెప్పుకోదగినన్ని పరిశ్రమలను, ప్రత్యేకించి ఉక్కు కర్మాగారంవంటి భారీపరిశ్రమలను నెలకొల్పేటట్లు చూడడానికి సర్వవిధాలా కృషిజరుపుతుంది.

ప్రైవేటు రంగంలోకూడా రాష్ట్రంలో కొన్ని పెట్టుబడులు పెట్టబడుతున్నప్పటికీ ఇంకా అవి గణనీయమైనంతగాలేవు. ఇవి కూడా పెరిగితేనే తప్ప రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధిలోని అసమానతను సరుబాటుచేయడానికి వీలులేదు. అందుచేత ప్రభుత్వం, ప్రైవేటు రంగంలో మన రాష్ట్రంలో పెట్టుబడి పెట్టడాన్ని ప్రోత్సహించేందుకు అవసరమయ్యే చర్యలన్నింటినీ తీసుకొంటూనే ఉంటుంది.

సాంఘిక సంక్షేమం :

షెడ్యూలు తెగల, షెడ్యూలు కులాల, సమాజంలోని ఇతర బడుగు వర్గాలవారి సంక్షేమం కోసం అనేక అభివృద్ధి పథకాలను ప్రభుత్వం చేపట్టుతున్నది. వీటిక్రింద అనేక కార్యక్రమాలు చేరిఉన్నాయి. కాని ఇది ఎడతెగకుండా సాగేపని. ఎప్పటికప్పుడు అనేక క్రొత్త సమస్యలు ఉద్భవిస్తుంటాయన్న సంగతి గౌరవ సభ్యులకు తెలిసిందే. క్లిష్టమైన ఆర్థిక పరిమితులకు లోబడి ఈ తరగతుల ప్రజలకు వీలైనంత ఎక్కువగా సంక్షేమాన్ని చేకూర్చేటందుకు ప్రభుత్వం సర్వ విధాల కృషి చేస్తున్నది. సాంఘిక సంక్షేమ, ఆదివాసీ సంక్షేమ శాఖలకు కలిపి 1966-67 సంవత్సరానికిగాను బడ్జెటులో రూ. 4.80 కోట్లు కేటాయించడం జరిగింది. నాలుగవ ప్రణాళికా కాలంలో రాష్ట్ర ప్రణాళిక క్రింద గ్రామ ప్రాంతాలలో గొట్టపు నీటి సరఫరా పథకాలు చేపట్టబడుతున్నాయి.

పేదరికం, తక్కువ విద్యా ప్రమాణం, నివాసస్థలంవంటి కొన్ని అంశాలు ఆధారంగా వెనుకబడిన తరగతులవారి జాబితాను తయారుచేసి, ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది. అయితే హైకోర్టు ఈ ఉత్తరువును కొట్టివేసింది. ఆ తీర్పుపై ప్రభుత్వం సుప్రీంకోర్టుకు అప్పీలు చేయడానికి ఉద్దేశిస్తున్నది.

షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలవారికి తగు విద్యా సౌకర్యాలు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం రూ. 17.88 లక్షల ఖర్చుతో 540 సాంఘిక సంక్షేమ పాఠశాలలను స్థాపించింది. రూ. 8.90 లక్షల ఖర్చుతో పాఠశాలల్లో సుమారు 10 లక్షల మంది పిల్లలకు మధ్యాహ్న భోజనాలు పెట్టబడుతున్నాయి. రూ. 139.40 లక్షల వ్యయంతో భోజన నివాస వసతులు కల్పించడమే కాకుండా ఉపకార వేతనములపై రూ. 142.03 లక్షల మొత్తం ఖర్చుచేయ బడుతున్నది. షెడ్యూలు కులాల, వెనుకబడిన తరగతుల విద్యార్థుల సౌకర్యార్థం 1,400 హాస్టళ్లు షెడ్యూలు కులాలవారికి వృత్తి శిక్షణ నిచ్చేందుకు 16 దుస్తుల తయారీ కేంద్రాలు, 7 తోళ్ల పదును పెట్టే, చర్మ వస్తువులు తయారుచేసే కేంద్రాలుకూడా రూ. 1.31 లక్షల వ్యయంతో ప్రారంభించబడినాయి. హరిజనుల ఇళ్ళ స్థలాలకై భూమిని సేకరించేందుకు రూ. 30 లక్షలు ప్రత్యేకించబడింది. కేటాయించిన స్థలాలపై ఇళ్ళు నిర్మించుకునేందుకు వారికి ఒక్కొక్క కుటుంబానికి రూ 50 లు మంజూరు చేయడం జరుగుతుంది. హరిజన వాడలలో పంచాయతీరాజ్ శాఖచే మామూలుగా చేపట్టబడే బావుల నిర్మాణానికి తోడు, ఇందుకుగాను ప్రత్యేకంగా రూ. 5.05 లక్షల మొత్తం ప్రత్యేకించ బడింది.

భూముల కేటాయింపు :

భూమి లేని పేద ప్రజలకు శీఘ్రగతిని భూములను కేటాయించేందుకు ప్రభుత్వం చర్యలు తీసికొంటున్న విషయం గౌరవ సభ్యులకు తెలిసినదే. కేటాయింపు పనిని శీఘ్రతరం చేయడం కోసం, ఖమ్మం, నల్గొండ జిల్లాలలో ఇదివరకే అదనపు సిబ్బందిని మంజూరు చేయడం జరిగింది. ఇట్టి ప్రత్యేక సిబ్బందిని ఇతర జిల్లాల్లోకూడ మంజూరు చేయడానికి సంబంధించిన ప్రతిపాదనలు పరిశీలనలో ఉన్నాయి. కేటాయింపులను ఒక ఏడాదిలోగా పూర్తి చేయాలని సంకల్పించబడింది.

ఆదివాసులపట్ల ప్రత్యేక శ్రద్ధ తీసికొనేందుకుగాను 1966 డిసెంబరు లగాయతు ఒక ప్రత్యేక ఆదివాసీ సంక్షేమ డైరెక్టరుని కార్యాలయం ప్రారంభించ బడింది. దీనివల్ల అటు తరువాత ఆదివాసులకు సంబంధించిన సమస్యలు శీఘ్రగతిని పరిష్కరింప బడగలవని ఆశింపబడుతున్నది. విద్యార్థులకు పాఠశాలలు, హాస్టళ్ళు, విద్యా పరికరాల సరఫరా వంటి విద్యా పథకాలకు రూ. 31.56 లక్షలు, ప్రీ మెట్రిక్కు, పోస్టు మెట్రిక్కు విద్యార్థులకు ఉపకార వేతనాల క్రింద రూ. 3.80 లక్షల మొత్తాన్ని ఆదివాసీ సంక్షేమ శాఖ ఇదివరకె సమకూర్చింది.

రాష్ట్రమందలి అన్ని జిల్లాల్లోనూ ప్రస్తుతం విద్యుదీకరించిన గ్రామాల్లోని హరిజన వాడలకు విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తరింప జేయవలసిందిగా ప్రభుత్వం ఆంధ్రప్రదేశ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డును ఆదేశించింది. 1967 జనవరి ఆఖరు వరకు విద్యుచ్ఛక్తి సరఫరా 2,612 హరిజన వాడలకు విస్తరింప జేయబడింది. ఆంధ్ర ప్రదేశ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు నాల్గవ ప్రణాళికా కాలంలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తరింప చేయడానికి సంబంధించిన పథకాలను రూపొందించేటప్పుడు హరిజన వాడలను చేర్చడం విధానంగా పెట్టుకొన్నది. *

---

# ఆంధ్రప్రదేశ్ మంత్రి మండలి సభ్యులు, వారి శాఖలు

1. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి—సాధారణ పరిపాలన, సర్వీసులు, ఎన్నికలు, భారీ పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, మధ్య తరహా, చిన్న తరహా నీటి పారుదల మినహా యితర నీటి పారుదల, రవాణా, ఆర్థిక, గిరిజన సంక్షేమం.

2. శ్రీ పి. తిమ్మారెడ్డి—వ్యవసాయం, ఆహారోత్పత్తి, మార్కెటింగ్, గ్రామీణ ఋణాలు, ఋణ విముక్తి సహాయం, ఋణాలు, ఋణ దాతలు, పశుపోషణ, సమీకృత పాల ప్రాజెక్టు, పాడి పరిశ్రమాభివృద్ధి, రాష్ట్ర గిడ్డంగుల కార్పొరేషన్.

3. శ్రీ వి. బి. రాజు:—భూమిశిస్తు, భూసంస్కరణలు, రిజిస్ట్రేషన్, స్టాంపులు, కాందిశీకుల ఆస్తులు, ఇతియత్ జాగీర్ వ్యవహారాలు, ఋణ పరిష్కారాల బోర్డు, పౌర సరఫరాలు, రేషనింగ్.

4. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి—హోం, పోలీసు, ఆయుధాల చట్టం, సినిమాటోగ్రఫీ, పాస్‌పోర్టు, వాణిజ్య పన్నులు.

5. శ్రీ తోట రామస్వామి—పంచాయతీ రాజ్యం, పంచాయతీలు, మత్స్య పరిశ్రమ, చిన్న మొత్తాల పొదుపు.

6. శ్రీ జె. వి. నరసింగరావు—భవనాలు, రోడ్లు, రహదార్లు, రేవులు, పురోద్యానవనాలు, నగర నీటి సరఫరా, పబ్లిక్ వర్క్స్, వర్కుషాపులు, టెలిగ్రాఫ్‌కు సంబంధించిన విషయాలు.

7. శ్రీ టి. వి. రాఘవులు—విద్య.

8. శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ—సమాచార, పౌరసంబంధ, యాత్రిక, కార్మిక, సహాయక, పునరావాసం.

9. శ్రీ పి. వి. నరసింహారావు—ఆరోగ్య, వైద్య, అధికార భాష, శాసనసభ.

10. శ్రీ బి. వి. గురుమూర్తి—పరిశ్రమలు (భారీ పరిశ్రమలు మినహా) పారిశ్రామిక సహకార సంఘాలు, స్టేషనరీ, ముద్రణ, లఘుపరిశ్రమల కార్పొరేషన్, గనులు, గనుల కార్పొరేషన్, కంట్రోలు వస్తువులు.

11. శ్రీ ఎన్. చెంచురామా నాయుడు—పురపాలక సంఘాల నిర్వహణ, టౌన్‌ప్లానింగ్, గృహ నిర్మాణం, గృహ వసతి, అడవులు.

12. శ్రీ కె. విజయభాస్కరరెడ్డి—సహకారం, సహకార చక్కెర ఫ్యాక్టరీలు, తుంగభద్ర, నాగార్జునసాగర్ ఆనకట్టలక్రింద ఆయకట్టుల అభివృద్ధి.

13. శ్రీ ఆర్. రామలింగరాజు—దేవాదాయ, ధర్మాదాయాలు.

14. శ్రీ ఎస్. సిద్ధారెడ్డి—మధ్యతరహా, చిన్నతరహా నీటి పారుదల.

15. శ్రీ కె. వి. నారాయణరెడ్డి — ప్లానింగ్, అర్థగణాంక, వాణిజ్య, ఎగుమతుల అభివృద్ధి, న్యాయ, న్యాయ స్థానాలు, న్యాయాధికార్లు.

16. శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారి—జైళ్లు, వక్ఫ్, వక్ఫ్‌బోర్డు, సాలార్ జంగ్ ఎస్టేటు.

17. శ్రీ అరిగె రామస్వామి—సాంఘిక సంక్షేమం (స్త్రీ జనాభ్యుదయంతో సహా).

18. శ్రీ వి. సత్యనారాయణరావు—ఎక్సైజ్, మద్యనిషేధం.

# రాష్ట్రవ్యయంలో పొదుపు

## రాష్ట్ర మధ్యంతర బడ్జెటును ప్రవేశపెడుతూ ముఖ్యమంత్రి ఉద్బోధ



[ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి 1967 మార్చి 23వ తేదీన ఉభయసభల సంయుక్త సమావేశంలో 1967_68 సంవత్సరం బడ్జెటును సమర్పించారు. వారి ప్రసంగాన్ని ఈ క్రింద పొందుపరుస్తున్నాము.]

ఇది కేవలం తాత్కాలిక బడ్జెటుమాత్రమే. నాలుగు నెలల కాలానికి, అంటే 1967 ఏప్రిల్ 1వ తేదీనుండి 1967 జూలై ఆఖరు వరకు 'ఓట్ ఆన్ ఎకౌంటు' పొందడంకోసం ఇది ఉద్దేశించబడినది. ఈ సభ సమక్షంలో ఉంచిన వార్షిక ఆర్థిక వివరణలో చూపిన ఆదాయవ్యయ అంచనాలు ప్రస్తుత పన్నురేట్లపైన, ఇతర ఆదాయ వనరులపైన, ఇప్పుడున్న సిబ్బంది వగైరాలను నిర్వహించేందుకు, అమలులోవున్న పథకాలను కొనసాగించేందుకు అవసరమైననిధులపైన ఆధారపడినట్టివి. ప్రస్తుత బడ్జెటులో క్రొత్త పన్నులకుగాని ఖర్చులకుగాని ప్రతిపాదన లేపిలేవు. అవి ఈ సభ మళ్ళీ సమావేశమైనపుడు మామూలు బడ్జెటుతోపాటు సమర్పించబడతాయి.

మొదట 1965_66 లెక్కలలోను, 1966_67 సవరించిన అంచనాలలోను ద్యోతకమయ్యే రాష్ట్ర ఆర్థిక పరిస్థితికి స్థూలంగా సూచించి ఆటుతరువాత 1967_68 బడ్జెటు అంచనాలను వివరిస్తాను.

### 1965_66 లెక్కలు

ఈ సంవత్సరం రెవిన్యూ వసూళ్లు రూ. 151 79 కోట్లు కాగా రెవిన్యూ ఖాతాపై వ్యయం రూ. 159.67 కోట్లు. ఈ విధంగా రూ.7.78 కోట్లలోటు కనిపిస్తుంది. పెట్టుబడి వినియోగం క్రింద రూ 68 67 కోట్లుకాగా ప్రజాఋణం, డిపాజిట్లు అప్పులు, అడ్వాన్సులు మొదలైనవాటి లావాదేవీల మూలంగా రూ. 71.93 కోట్ల నికర రాబడులు లభించినై. ఆ విధంగా రూ 6.13 కోట్ల నగదు నిల్వతో ప్రారంభమైన సంవత్సరం రూ.1.61 కోట్ల నగదు నిల్వతో అంతమైంది. ఈ రూ 1 61 కోట్లు, భారత ప్రభుత్వం నుండి పొందిన 10 కోట రూపాయల తాత్కాలిక ఋణాన్ని, రిజర్వు బ్యాంకు ఖాతాలో వున్న రూ.41 48 కోట్ల నిల్వ బాకీని లెక్కలోకి తీసుకొన్నాక వచ్చినట్టివి. ఈ మొత్తాలు 'ఫ్లోటింగ్ ఋణం' శీర్షిక క్రింద చేర్చబడినై.

### 1966-67 సవరించిన అంచనాలు

రెవిన్యూ వసూళ్లు మొదట రూ. 174.21 కోట్లుగా అంచనా వేయబడగా ఇప్పుడవి రూ.177.43 కోట్లు కాగలవని భావించబడుతున్నది. రెవిన్యూ వ్యయం బడ్జెటులో రూ. 173 93 కోట్లుగా చూపగా సవరించిన అంచనాలలో అది రూ.185.84 కోట్లకు పెరిగింది. దీనివల్ల రూ.8.41 కోట్లలోటు ఏర్పడుతుంది. దీనికి ప్రధానంగా సంవత్సరారంభంలోను, 1967 జనవరి 1 నుండి మరొకసారి కరువుభత్యం పెంచడం, నాగార్జునసాగరు ప్రాజెక్టుకు కేంద్రం ఇచ్చిన ఋణాలపై వడ్డీ బకాయి చెల్లించడం, వర్షాభావంవల్ల గత సంవత్సరం తీసుకొన్న సహాయ చర్యలకైన వ్యయం కారణాలు. రాష్ట్ర ఆబ్కారీ సుంకాలు, బండ్లపన్నులు, అమ్మకపు పన్ను, కేంద్ర పన్నుల రాబడులు అధికమైనందున పైవ్యయం కొంతవరకు సమసిపోయింది.

1966_67 బడ్జెటు అంచనాలలో పెట్టుబడి వినియోగానికి రూ.39.98 కోట్లు కేటాయించబడింది. సవరించిన అంచనాలలో అది, రూ.19.21 కోట్లకు పెరగగలదని భావించబడుతున్నది.

బహిరంగ ఋణాలమూలంగా రూ. 9.50 కోట్లు, చిన్న మొత్తాల పొదుపువల్ల రూ.3 కోట్లు నికరంగా లభించగలవని మొదట అంచనా వేయబడగా ఇప్పుడవి రూ. 8.23 కోట్లు రూ 1.50 కోట్లు అయినవి. డిపాజిట్లు, అప్పులు అడ్వాన్సులు మొదలైన వాటి లావాదేవీలవల్ల నికరంగా రూ.18.86 కోట్లు ఖర్చు కాగలవని భావించబడుతున్నది.

1966 మార్చి ఆఖరున కేంద్రప్రభుత్వం మంజూరుచేసిన రూ. 10 కోట్ల ఋణం గురించి ఇదివరకే ప్రస్తావించివున్నాను. 1966 జూన్ ఆఖరున కేంద్రం మళ్ళీ రూ. 31.35 కోట్ల తాత్కాలిక ఋణం అందజేసింది దానితో మనం అనాటికున్న రిజర్వు బ్యాంకు ఓవర్ డ్రాఫ్టును తీర్చుకోగలిగాం. ఆ విధంగా కేంద్రం ఇచ్చిన తాత్కాలిక సహాయం రూ. 41.35 కోట్లు అయింది. అందులో యీ ఏడు రూ 13.35 కోట్లు తిరిగి చెల్లించాం. మిగిలిన రూ. 31 కోట్ల మొత్తాన్ని రానున్న నాలుగు సంవత్సరాలలో వాయిదాలపై తీర్చవలసివున్నది. రూ. 61.48 కోట్ల నిల్వబాకీతో ప్రారంభమైన 1966-67 సంవత్సరం రూ 27.11 కోట్ల నిల్వ బాకీతో అంతం కాగలదని భావించబడుతున్నది కేంద్రం తాత్కాలికంగా ఇచ్చిన ఋణాలే యీ అభివృద్ధికి ముఖ్యకారణం

1967 మార్చి ఆఖరునాటికి తరుగులోఉన్న నగదు నిల్వను పూర్తిచేసేటందుకు వీలుగా మరికొంతసొమ్ము అప్పుగా ఇవ్వవలసిందని మనం కేంద్రాన్ని కోరాం దీనివల్ల బడ్జెటు సంవత్సరాన్ని మిగులు తరుగులేవీ లేకుండా ప్రారంభించుకోవచ్చు. రిజర్వు బ్యాంక్ ఓవర్ డ్రాఫ్టు విషయంలో అవలంబిస్తున్న వైఖరి మూలంగా ఇలా చేయడం అవసరమౌతుంది సాధనసదుపాయాల అడ్వాన్సు. సెక్యూరిటీ ఋణాల రూపంలో కలుగజేయబడే బ్యాంకింగు సదుపాయాలపట్ల రిజర్వు బ్యాంకు కొంత ఉదారవైఖరి అవలంబిస్తున్నప్పటికీ రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయింపబడ్డ పరిమితులకంటే ఎక్కువమొత్తాన్ని తీసుకోవటానికి వీలులేదనీ, ఏ రాష్ట్రమైనా ఇకముందు ఆ విధంగా తీసుకున్నట్లయితే బ్యాంకు చెల్లింపులను నిరాకరించే అవకాశం ఉన్నదనీ ఇప్పుడు తెలియజేసింది.

## 1967-68 బడ్జెటు అంచనాలు

ఇక 1967-68 సంవత్సరానికి బడ్జెటు అంచనాలను గురించి స్థూలంగా వివరిస్తాను.

రెవిన్యూ వసూళ్ళు: ఈ సంవత్సరం మొత్తం రెవిన్యూ వసూళ్లు రూ. 179.40 కోట్ల వరకు ఉండవచ్చునని ఆశిస్తున్నాం. ఇందులో మామూలు రెవిన్యూ రూ. 174.90 కోట్లు, ప్రణాళికా పథకాలకోసం ఆశిస్తున్న కేంద్ర గ్రాంట్లు రూ. 4.50 కోట్లు చేరివుంటాయి.

ఈ వ్యత్యాసాలకు గల కారణాలను గురించి ఆర్థికశాఖ కార్యదర్శి సవివరంగా తమ వివరణలో తెలియజేశారు. అయితే ఆంధ్రప్రదేశ్ అదనపు భూమిశిస్తు చట్టం విషయంలో సుప్రీంకోర్టు ఇటీవల ఇచ్చిన తీర్పును గురించి ఈ సందర్భంలో ప్రస్తావించదలుస్తున్నాను. ఈ తీర్పు ఫలితంగా 1967-68 లో భూమిశిస్తు వసూళ్ళు చాలవరకు తగ్గే అవకాశం ఉంది.

రెవిన్యూ ఖర్చు: సవరించిన అంచనాలో రూ 186.84 కోట్ల వినియోగానికి కేటాయింపు వుండగా వచ్చే సంవత్సరం ఖర్చు అంచనాలో రూ. 182.11 కోట్ల మొత్తం మాత్రమే ఉంది. ఆ యా పద్దుల క్రింద తేడాలు ఆర్థిక శాఖ కార్యదర్శి వివరణలో వివరించబడినవి. ఈ రూ. 3.73 కోట్లు తగ్గుదలకు స్థూలంగా ఈ దిగువ తెలిపిన లావాదేవీలే కారణం:—

(రూ. కోట్లు)

| | | |
|---|---|---|
| (1) | రాష్ట్ర ఆదాయానికి ఖర్చు వ్రాయబడే ప్రభుత్వోద్యోగులకు, స్థానిక సంస్థల ఉద్యోగులకు ఇచ్చే కరువుభత్యం పెంచడంమూలంగా రూ. 10 కోట్లు కేటాయించబడినవి. అయితే సవరించిన అంచనాలోఉన్న అందనా ఖర్చు రూ. 2.00 కోట్లు మాత్రమే. | 8.00 |
| (2) | వచ్చే సంవత్సరం కేంద్ర ప్రతిపాదిత పథకాలకు సహా ప్రణాళికా వ్యయంలో రెవిన్యూ భాగం. సవరించిన అంచనాలలో రూ. 20.13 కోట్లు ఉండగా దీనిని రూ. 13.46 కోట్లకు తగ్గించడం జరిగింది. | (—) 6.68 |
| (3) | నాగార్జునసాగర్ ప్రాజెక్టుపై వడ్డీ బకాయిల మూలంగా రూ. 7.45 కోట్ల ఖర్చుకోసం సవరించిన అంచనాలలో కేటాయింపు జరిగింది. ఇది వచ్చే సంవత్సరం బడ్జెటు నుండి తీసివేయబడింది. .... ... | (—) 7.45 |
| (4) | ఇతర పద్దులక్రింద వ్యత్యాసాలు ... | 2.40 |

రెవిన్యూ ఖాతా లావాదేవీల మూలంగా 1967-68 లో రూ. 2.71 కోట్లు తరుగు రాగలదని భావిస్తున్నాం.

పెట్టుబడి ఖర్చు: ప్రణాళికా పథకాలకే ముఖ్యంగా సంబంధించి ఉండే పెట్టుబడి వినియోగంకోసం రూ. 33.77 కోట్ల కేటాయింపు జరిగింది.

ప్రజా ఋణం, చిన్నమొత్తాల పొదుపు: వచ్చే సంవత్సరం మార్కెటు పరిస్థితులలో కొంత అభివృద్ధి కనిపించవచ్చని తలంచబడుతున్నది. బహిరంగ ఋణంక్రింద రూ. 12.65 కోట్లు, రాష్ట్ర ప్రణాళికకోసం కేంద్ర ఋణ సహాయం క్రింద రూ. 45.94 కోట్లు జమలోకి తీసికోవడం జరిగింది. అదేవిధంగా చిన్నమొత్తాల పొదుపు విషయంలో తీవ్రంగా కృషి

జరిపి రాష్ట్ర ఖజానాకు రూ. 1 కోట్లు సమకూరే విధంగా వసూళ్లను అధికంచేయవలసి ఉంది.

డిపాజిట్లు, ఋణాలు వగైరా వాటిక్రింద 1967_68 లో నికరంగా రూ. 28.26 కోట్లు ఖర్చు అవుతాయని ఆశింపబడుతున్నది.

ఇప్పుడు అనుకున్నదాని ప్రకారం 1967_68 లో మొత్తం మీద ఆదాయవ్యయాల పరిస్థితినిబట్టి చూస్తే రూ. 2.16 కోట్లు లోటు ఉంటుంది. ఈ లోటును పొదుపు చర్యల ద్వారా ముఖ్యంగా అభివృద్ధికి సంబంధించని వ్యయంలో పొదుపుచేసి భర్తీచేయాలి.

## ప్రణాళికా వినియోగం

అత్యవసర అభివృద్ధి కార్యక్రమాలనూ, లభ్యంకాగల ఆదాయ వనరులనూ పరిశీలించిన మీదట రాష్ట్ర నాలుగవ పంచవర్ష ప్రణాళిక పరిమాణాన్ని రూ. 622 కోట్లకు నిర్ణయించడం జరిగింది. కేంద్ర ప్రభుత్వ సహాయం రూ. 280 కోట్లు ఉంటుందనీ ప్రస్తుత మిగుళ్లు, కొత్తపన్నులు, అప్పులు, చిన్నమొత్తాల పొదుపు వగైరా వాటిద్వారా రాష్ట్రప్రభుత్వం రూ. 242 కోట్లు సేకరించగలదనే ఉద్దేశంతో ఇది రూపొందించడం జరిగింది. ప్రభుత్వోద్యోగుల, స్థానిక సంస్థలు, పబ్లికు సంస్థలు వగైరా వాటి ఉద్యోగుల కరువుభత్యంలో ఇటీవల జరిగిన పెరుగుదల మూలంగా రాష్ట్ర ప్రణాళిక వనరులలో సుమారు రూ. 66 కోట్లు తగ్గుతాయి. ప్రస్తుత ప్రణాళికా పరిమాణాన్ని రూ. 622 కోట్ల నుండి తగ్గింపుచేసే సమస్యే లేదు. కనుక రాష్ట్రం సమకూర్చుకోవలసిన రూ. 242 కోట్లమొత్తాన్ని ఎట్టిపరిస్థితులలోనైనా సమకూర్చుకొనేందుకు చర్యలు తీసుకోవలసివున్నది.

మొదట రూపొందించిన 1966_67 వార్షిక ప్రణాళికలో రూ. 79.26 కోట్ల మొత్తం కేటాయించబడింది. కాని నాగార్జున సాగరు ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టు, విద్యుచ్ఛక్తి పథకాలు మొదలైన వాటిపై అదనపు వినియోగాన్ని చేర్చడంకోసం పై మొత్తం రూ. 94.38 కోట్లకు సవరించబడింది. బహుశా రూ. 61.25 కోట్ల మేరకు కేంద్రసహాయం లభించవచ్చు. 1967_68 కు సంబంధించి, ప్రస్తుత సూచనల ప్రకారం కేంద్రసహాయం రూ. 50 కోట్లకు మాత్రమే పరిమితమై వుంటుంది. రాష్ట్రరంగంలోని వనరు సంవత్సరం ఆఖరున ఓవర్ డ్రాఫ్టును తీర్చడంకోసం కేంద్రప్రభుత్వం ఇచ్చే సహాయంపై ఆధారపడివుంటాయి. ఈ విషయం పరిష్కారమయ్యేలోగా, ఆర్థిక పరిస్థితి క్లిష్టంగా వుండడంవల్ల 1967_68 వార్షిక ప్రణాళికలో నీటిపారుదల, విద్యుచ్ఛక్తి పథకాలపై వినియోగానికి ప్రస్తుత సంవత్సరానికి మొదట రూపొందించినప్రణాళికలో కేటాయించిన మొత్తాన్నే ఏర్పాటు చేయాలని, ఇతర పథకాలకు 1966_67 కు మొదట అనుకున్న ప్రణాళికలో చేసిన కేటాయింపులలో 75 శాతం చొప్పున ఏర్పాటుచేయాలని నిశ్చయించ బడింది. ప్రస్తుత సంవత్సరానికి వచ్చే సంవత్సరానికి ఆయా రంగాలకు సంబంధించిన కేటాయింపులు ఈక్రింది విధంగా వున్నాయి :

(రూపాయలు కోట్లు)

| | 1966_67 కు ప్రణాళికా వినియోగం: మొదట కేటాయించినది. | 1966_67 కు ప్రణాళికా వినియోగం: సవరించిన ప్రకారం. | 1967_68 ప్రణాళికా వినియోగం |
|---|---|---|---|
| 1. వ్యవసాయం, పశుసంవర్ధన, మత్స్యపరిశ్రమ, సమాజాభివృద్ధి, చిన్నతరహా నీటిపారుదల | 17.73 | 19.28 | 13.16 |
| 2. నీటి పారుదల | 13.25 | 22 26 | 13.55 |
| 3. విద్యుచ్ఛక్తి | 32.00 | 37.50 | 32 00 |
| 4. గనులు, పరిశ్రమలు | 3.00 | 2.97 | 2 18 |
| 5. రవాణా, కమ్యూనికేషన్లు | 4.16 | 3.16 | 2 37 |
| 6. విద్య | 3.37 | 3.21 | 2.53 |
| 7. వైద్యం, ప్రజారోగ్యం, గృహనిర్మాణం, వివిధ సంక్షేమపథకాలు, వగైరా | 5.74 | 6.00 | 4 48 |
| మొత్తం. | 79.25 | 94.38 | 70 26 |

### నీటి పారుదల, విద్యుచ్ఛక్తి క్రింద ప్రధాన పద్దులు :

*నీటిపారుదల :* (రూ. కోట్లు)

| | | | |
|---|---|---|---|
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు | ... | .... | 8.50 |
| పోచంపాడు ప్రాజెక్టు | ... | .... | 1.20 |
| తుంగభద్ర ఎగువకాలువ | ... | .... | 0.71 |
| పంపా రిజర్వాయరు | ... | .... | 0.27 |
| నల్లవాగు ప్రాజెక్టు | ... | .... | 0.25 |
| వట్టిగడ్డ ప్రాజెక్టు | ... | .... | 0 25 |
| తాండవ రిజర్వాయరు | ... | .... | 0 60 |
| కనుపూర్ కాల్వ పథకం | ... | .... | 0.20 |
| లంక సాగరు ప్రాజెక్టువిద్యుచ్ఛక్తి | ... | .... | 0.20 |
| ఎగువసీలేరు జలవిద్యుత్ పథకం | ... | .... | 1 45 |
| శ్రీశైలం జలవిద్యుత్ పథకం | ... | .... | 4.20 |
| బలిమెల డాం | .... | .... | 2 79 |

వీటికితోడు విద్యుచ్ఛక్తిబోర్డు, కొత్తగూడెం థర్మల్ పథకం, రామగుండం థర్మల్ పథకం, దిగువ సీలేరు జలవిద్యుత్ పథకాలను నిర్వహిస్తున్నది.

## పొదుపు చర్యలు

నేను ఇంతకుముందే పేర్కొన్నట్లు, నాలుగవ పంచవర్ష ప్రణాళికలో ముఖ్యంగా ఈ బడ్జెటు సంవత్సరంలో

ఖర్చు బాగా పొదుపుచేయడం తప్పనిసరి అయింది. ఖర్చులను అదుపులో పెట్టేందుకు, సాధ్యమైనచోట పొదుపు చేసేందుకు అనేక చర్యలు ప్రవేశ పెట్టబడుతున్నాయి. ఆ చర్యలలో కొన్నిటిని ఇక్కడ పేర్కొంటాను:-

(1) పరిపాలన ఖర్చులలో 10 శాతం తగ్గింపు చేయాలని సంకల్పించబడింది.

(2) క్రొత్తఖర్చులన్నీ నివారించబడతాయి.

(3) భర్తీచేయని ఉద్యోగాలన్నిటిగురించి, వివిధశాఖలలో ఇటీవలి సంవత్సరాలలో మంజూరుచేయబడిన తాత్కాలిక ఉద్యోగాలను గురించి జాగ్రత్తగా పరిశీలన జరిపి వాటిని ఎంతమేరకు తగ్గించడం సాధ్యమో కనుగొనబడుతుంది.

(4) అదేవిధంగా వాహనాలు, సరంజామా మొదలైనవాటి కొనుగోలుకు సంబంధించిన ప్రతిపాదనలన్నీ మరింత జాగ్రత్తగా పరిశీలించబడతాయి.

(5) పబ్లికు వర్క్సు, నీటిపారుదల వగైరా శాఖలలో సిబ్బంది పరిమాణాన్ని కొన్ని సంవత్సరాల క్రిందట అప్పటి ధరల ప్రకారం పనినిబట్టి నిర్ణయించడం జరిగింది. నిర్మాణాలకయ్యేఖర్చు ఇటీవలి సంవత్సరాలలో ఎంతగానో పెరగగా ఒక సర్కిలుకు లేదా డివిజనుకు అప్పజెప్పినపని అదే దామాషాలో సవరింపబడలేదు. అందుచేత ఈ విషయాన్ని సమీక్షించి క్రొత్త ప్రమాణాన్ని నిర్ణయించడానికి సంకల్పించబడింది.

(6) ఇకముందు నిర్మించబోయే క్రొత్త భవనాలకు చవకగాను, పొదుపుగాను వుండే డిజైన్లు రూపొందించ వలసిందిగా చీఫ్ ఇంజనీర్లను కోరడం జరిగింది.

(7) ఏవో తప్పనిసరి అయిన సందర్భాలలో తప్ప, భవనాల నిర్వహణపని ఒక సంవత్సరంపాటు నిలిపివేయబడుతుంది.

(8) జిల్లాస్థాయిలో నిధులకేటాయింపుమీద ప్రస్తుతం 'ప్రీ ఆడిటు' జరగడంలేదు. ఖర్చు ఏసమయంలోను బడ్జెటులో మంజూరైన మొత్తానికి మించకుండా ఉండేటట్లు చూసేనిమిత్తం జిల్లా బడ్జెట్ల పద్ధతిని, జిల్లాలకు కేటాయించిన మొత్తాలపై ట్రెజరీ ఆఫీసరుచే కట్టుదిట్టమైన తనఖీని ప్రవేశపెట్టడానికి సంకల్పించబడింది.

ఇవిగాక, పన్నులు వసూలుచేయడానికి, ఋణాలు, అడ్వాన్సులు రాబట్టడానికి కట్టుదిట్టమైన ఏర్పాట్లుచేయాలని ప్రభుత్వం నిర్ణయించుకుంది. ఈ చర్యలన్నింటి మూలంగా మన ఆర్థికస్థితి ఎంతగానో అభివృద్ధి చెందడానికి అవకాశం ఏర్పడుతుందని భావిస్తున్నాను.

## ముగింపు

మనదేశం ఇప్పుడు క్లిష్టపరిస్థితిలో వుంది. మనలను ఎదుర్కొంటున్న అనేక సమస్యల పరిష్కారంకోసం తక్షణమే ఏకోన్ముఖ కృషిసల్పడం ఎంతైనా అవసరం. అయితే మన ప్రయత్నాలు జయప్రదం కావడమన్నది గౌరవసభ్యులు, అన్ని వర్గాల ప్రజలు అందజేసే సహకారంపై ఆధారపడివుంటుంది. ఇదివరకటిలాగే ప్రభుత్వానికి అన్నివైపులనుంచి హృదయపూర్వక సహకారం లభించగలదని విశ్వసిస్తున్నాను. ముఖ్యమైన సమస్త సమస్యలపైనా, సాధ్యమైన సకల సందర్భాలలోను మీ అందరి అభీష్టాలను తెలుసుకోవడానికి ప్రభుత్వం కృషిచేయగలదని గౌరవ సభ్యులకు హామీ ఇస్తున్నాను. ❀

# 1966లో ఉత్తమ చలనచిత్రాలు

ఏటా ఉత్తమ చలనచిత్రానికి యిచ్చే ఆంధ్రప్రదేశ్ బంగారు నంది బహుమతికి అర్హమైనదిగా 1966 సంవత్సరానికి 'రంగులరాట్నం' ఎన్నికైంది. ఈ చిత్రాన్ని వాహినీ పిక్చర్సువారు నిర్మించారు. శ్రీ బి. నాగిరెడ్డి దర్శకత్వం క్రింద ఈ చిత్రం తయారైంది. 'చిలకా గోరింక' చిత్రానికి వెండి నంది, 'ఆస్తిపరులు' చిత్రానికి కాంస్య నంది బహూకరింపబడ్డాయి.

చలన చిత్ర పరిశ్రమను రాష్ట్రంలో అభివృద్ధిపరిచే ఉద్దేశంతో ఈ బహుమతీ ప్రధాన పథకాన్ని మూడేళ్ళక్రిందట రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించింది. ఈ ఉత్తమ చిత్రాల ఎన్నికకై మాజీ న్యాయమూర్తి శ్రీ ఎం. శేషాచలపతి అధ్యక్షతన, సర్వశ్రీ కె. వి. గోపాలస్వామి, అయ్యగారి వీరభద్రరావు, వి. వి. మాణిక్యాలరావుగారలు సభ్యులుగా గల ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది.

ఏప్రెల్ 19 న శ్రీరామ నవమినాడు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి రవీంద్ర భారతిలో బహుమతులు అందజేశారు.



## శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి 1907 మార్చి 1వ తేదీన దేశభక్తులకు ఆలవాలమైన కుటుంబంలో జన్మించి, తమ పూర్వుల జాతీయభావ సంపదకు వారసులయ్యారు. 1937లో తమ ముప్పయ్యోయేట కాంగ్రెసులో చేరి, గాంధీజీ నాయకత్వంలో దేశమంతటా ప్రభంజనంలా చెలరేగిన స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖపాత్ర వహించారు.

నెల్లూరు పురపాలక సంఘ నిర్వహణతో శ్రీ సుబ్బారెడ్డికి సన్నిహిత సంబంధంవుంది. 1936–1960 మధ్య మూడు దశాబ్దాలకు పైగా వీరు నెల్లూరు పురపాలక సంఘానికి చైర్మన్‌గా వున్నారు. వీరు ఈ పదవిని నిర్వహిస్తున్న సమయంలోనే నెల్లూరు పట్టణాన్ని బహుముఖాలుగా అభివృద్ధిపరచి, పురప్రజలకు అనేక సౌకర్యాలను కల్పించారు. 1957 ఏప్రెల్ 1960 జనవరి మధ్యకాలంలో వీరు టి. టి. డి. బోర్డుకు అధ్యక్షత్వం వహించారు.

1955లో శ్రీ సుబ్బారెడ్డి విధానసభకు ఎన్నికయ్యారు. శాసనసభలో పురపాలక సంఘాలకు సంబంధించిన విషయాల చర్చల్లో ఉత్సాహంతో పాల్గొనేవారు. 1960లో 14 మంది సభ్యులు గల శ్రీ సంజీవయ్య మంత్రి మండలిలో శ్రీ సుబ్బారెడ్డి భారీపరిశ్రమలు, గనులు, ఇండస్ట్రియల్ ట్రస్ట్‌ఫండ్, వాణిజ్యం, గృహనిర్మాణం, పురపాలక నిర్వహణ శాఖల మంత్రిగా నియమింప బడ్డారు. అయితే జూన్‌లో తమ పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది.

1962 జనరల్ ఎన్నికల్లో నెల్లూరు జిల్లా కావలి నియోజక వర్గంనుంచి విధానసభకు ఎన్నికయ్యారు. సంజీవరెడ్డి నాయకత్వంలోగల మంత్రి మండలిలో వీరు పి. డబ్ల్యు. డి శాఖా మంత్రిగా నియమింపబడ్డారు. వీరు ఈ పదవిని చేపట్టి కీలక విద్యుత్పథకాలు, నీటి పారుదల పథకాలు ముఖ్యంగా చిన్ననీటి వనరుల పథకాలు—అమలు జరిపే విషయంలో ఎంతో కృషి చేశారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రిమండలిలో కూడా వీరు యిదే శాఖను చేపట్టారు. 1966లో జరిగిన మంత్రిమండలి పునర్వ్యవస్థీకరణ సందర్భంలో శ్రీ సుబ్బారెడ్డి వ్యవసాయ శాఖా మంత్రిగా నియమింపబడినారు. రాష్ట్రం తీవ్రమైన కరువు పరిస్థితుల్లో వున్నప్పుడు రెవిన్యూశాఖ సహాయంతో అనేక సహాయక చర్యల్ని తీసుకున్నారు. ఇటీవలి సార్వత్రిక ఎన్నికల్లో శ్రీ సుబ్బారెడ్డి రాపూర్ నియోజకవర్గంనుంచి శాసనసభకు ఎన్నికయ్యారు.



## శ్రీ కె. వి. నారాయణరెడ్డి

శ్రీ కె. వి. నారాయణరెడ్డి 1924 అక్టోబరు 4వ తేదీన జన్మించారు. వీరు కరీంనగర్ జిల్లా హుజూరాబాదు తాలూకాకు చెందినవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం. ఎ. డిగ్రీ స్వీకరించి, ఆ విశ్వవిద్యాలయంలోనే మూడేళ్ళ పాటు లెక్చరర్‌గా పనిచేశారు. అక్కడి విద్యార్థుల, సహచరుల ప్రేమాభిమానాలను చూరగొన్నారు.

1952లో జరిగిన తొలి సార్వత్రిక ఎన్నికల సందర్భంలో వీరు తమ ఉద్యోగానికి రాజీనామాచేసి రాజగోపాల్‌పేట నియోజక వర్గంనుంచి ఇండిపెండెంట్ అభ్యర్థిగా పోటీచేసి గెలిచారు. మాజీ హైదరాబాదు శాసనసభలో వున్న మొదటి పదవీకాలంలో శ్రీ రెడ్డి భూసంస్కరణలకు సంబంధించిన సంఘంలో శాసనసభా ప్రతినిధిగా నియమింపబడ్డారు. ఆ పిమ్మట ఆంధ్రప్రదేశ్ శాసనమండలికి తెలంగాణా ఉపాధ్యాయుల నియోజక వర్గంనుంచి పోటీలేకుండా ఎన్నికయ్యారు. 1962 జనరల్ ఎన్నికలలో శ్రీ నారాయణరెడ్డి కమలాపూర్ నియోజక వర్గంనుంచి ఇండిపెండెంట్ అభ్యర్థిగా శాసనసభకు ఎన్నికయ్యారు. ఆ వెంటనే శ్రీ నారాయణరెడ్డి యునైటెడ్ డెమొక్రటిక్ ఫ్రంట్‌ను ఏర్పాటుచేశారు.

1964 మార్చిలో కాంగ్రెస్‌లో యీ ఫ్రంట్ విలీనమైంది. శ్రీ రెడ్డి వ్యవహార దక్షత, రాజకీయ చతురతయే యిందుకు కారణం. కనిష్ట వేతనాలకు సంబంధించిన రాష్ట్ర సలహా మండలికి వీరు అధ్యక్షులుగా వ్యవహరించారు. కరీంనగర్ జిల్లా హుజూరాబాదు తాలూకాకు చెందిన జమ్మికుంటలో ఆదర్శ సైన్సు, కామర్సు, ఆర్ట్సు కళాశాలను నెలకొల్పారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సిండికేట్‌కు నామినేట్ చేయబడ్డారు.

శ్రీ రెడ్డి సమర్థుడైన విద్యావేత్త, "ది అనాటమీ ఆఫ్ ఇండియన్ ఎడ్యుకేషన్" అనే గ్రంథాన్ని రచించారు. విద్యావేత్తలలో ఈ గ్రంథం శ్రీ రెడ్డికి మంచి పేరు ప్రతిష్టలు సంపాదించి పెట్టింది. ఇటీవలి సార్వత్రిక ఎన్నికలలో వీరు తమ ప్రత్యర్థి అయిన ఇండిపెండెంట్ అభ్యర్థిని ఓడించి అత్యధిక మెజారిటీతో కాంగ్రెసు అభ్యర్థిగా శాసన సభకు ఎన్నికయ్యారు.

## శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ

శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ, 1917 జూన్ 10 వ తేదీన మహబూబ్‌నగర్ పట్టణంలో జన్మించారు. వీరి తండ్రి శ్రీ మహమ్మద్ ఉమర్ అలీ అన్సారీ, న్యాయవాద వృత్తి ప్రారంభించే నిమిత్తం 1937 వ సంవత్సరంలో హైదరాబాదు నగరానికి వచ్చారు. శ్రీ ఇబ్రహీం అలీ ప్రాథమిక, సెకండరీ విద్యలను నగరంలోని సెయింట్ జార్జి గ్రామర్ స్కూలులో పూర్తి చేశారు. తరువాత అలీఘడ్ ముస్లిమ్ విశ్వ విద్యాలయంలో చేరి 1934 వ సంవత్సరంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణు లయ్యారు. మరుసటి సంవత్సరం బొంబాయి వెళ్లి అచ్చటి సాంకేతిక విద్యా సంస్థలో ప్రవేశం పొంది వి. ఎం. జె. టి. డిప్లొమా పొందారు. తరువాత మద్రాసు రాష్ట్రంలోని కోయంబత్తూరు అటవీ కళాశాల నుంచి ఎం. ఆర్. హెచ్. ఎస్. డిప్లొమా తీసుకున్నారు.

1939 వ సంవత్సరంలో శ్రీ ఇబ్రహీం అలీ నిజాం ప్రభుత్వ సర్వీసులో—అటవీశాఖలో—చేరారు. కాని స్వస్థానంలోని తమ ఎస్టేటు వ్యవహారాలు చూసుకునే నిమిత్తం వీరు 1946 వ సంవత్సరంలో ప్రభుత్వోద్యోగానికి రాజీనామాచేసి మహబూబ్‌నగర్‌లో స్థిర నివాసం ఏర్పర్చుకున్నారు.



రెండు సంవత్సరాల పిమ్మట శ్రీ ఇబ్రహీంఅలీ కాంగ్రెసు సంస్థలో చేరి, మహబూబ్‌నగర్ జిల్లా కాంగ్రెసు కమిటీలో ప్రముఖ సభ్యులుగా రూపొందారు. 1951 వ సంవత్సరంలో శ్రీ ఇబ్రహీం అలీ మునిసిపల్ కౌన్సిలర్ అయ్యారు. తరువాత ఆరు సంవత్సరాలకు మహబూబ్‌నగర్ సిటీ మునిసిపాలిటీ అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. నాలుగు సంవత్సరాలకు పైగా ఆ పదవిని ప్రతిభావంతంగా నిర్వహించారు. తమ పదవీ కాలంలో వీరు అనేక పౌర సంస్కరణలను చేపట్టి, సమర్థవంతంగా అమలు పరిచారు. వీరి ఈ కృషి అందరి ప్రశంసలకు పాత్రమైనది. శ్రీ ఇబ్రహీం అలీ, 1960 వ సంవత్సరంలో మహబూబ్‌నగర్ స్థానిక సంస్థల నియోజక వర్గంనుంచి ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేటు సభ్యులుగా అత్యధిక మెజారిటీతో ఎన్నిక అయ్యారు. రెండు సంవత్సరాల అనంతరం ముస్లిమ్ వక్ఫ్ బోర్డు అధ్యక్షులుగా నామినేటు అయ్యారు. వీరు ఇప్పటికీ ఈ పదవిలో వున్నారు.

మహబూబ్‌నగర్‌లోని పెక్కు ప్రజా సంస్థలు, సాంఘిక సంస్థలతో శ్రీ ఇబ్రహీం అలీకి సంబంధం కలదు. వీరు జిల్లా లయన్స్ క్లబ్‌కు అధ్యక్షులు, రెడ్ క్రాస్ సొసైటీలో సభ్యులు. బియ్యం మిల్లు యజమానుల సంఘానికీ, లఘు పరిశ్రమలవారి సంఘానికీ అధ్యక్షులు, జిల్లా కాంగ్రెసు కమిటీకి కోశాధికారి.

శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ గత సార్వత్రిక ఎన్నికలలో మహబూబ్‌నగర్ నియోజకవర్గంనుంచి రాష్ట్ర శాసన సభకు మంచి మెజారిటీతో ఎన్నిక అయ్యారు.



## శ్రీ అరిగె రామస్వామి

శ్రీ అరిగె రామస్వామి, 1895లో సికింద్రాబాదులో జన్మించారు. ప్రాథమిక విద్య పూర్తిచేసిన తర్వాత తమ వర్గం ప్రజల సాంఘిక, ఆర్థిక ఉన్నతికి తీవ్రంగా కృషిచేశారు. ప్రత్యేకంగా తను వర్గంలో మధ్య తరగతి, దిగువ మధ్య తరగతి ప్రజలలో మద్యపాన దురలవాటును రూపుమాపడానికి ఆయన 1912లో సునీతి బాల సమాజాన్ని ప్రారంభించి కొంత కాలంపాటు అధ్యక్షుడుగా వ్యవహరించారు.

ఈ శతాబ్దంలో ప్రథమార్థ భాగంలో హరిజనులు ఎదుర్కొనే రాజకీయ, సాంఘిక సమస్యలు ప్రముఖ స్థానం వహించాయి. దశాబ్ది తర్వాత అవి మహాత్ముని వంటి మహానాయకుని దృష్టి నాకర్షించాయి. అరుంధతీ మహాసభ, ఆదిహిందూజాతి ఉన్నత సభ, హైదరాబాదు దళిత జాతి సంఘం వంటి ప్రముఖ సంస్థలతో సన్నిహిత సంబంధం ఏర్పడిన ఫలితంగా ఆయనకు నాయకత్వపు స్థాయిలభించింది. హరిజన సంక్షేమ పథకాలను అమలు జరపడంలో ఎంతో తోడ్పడ్డారు.

వీటన్నిటికీ తోడు శ్రీ రామస్వామిలో జాతీయ భావాలు పెనవేసుకొని ఉన్నాయి. గాంధీజీ బోధనలతో ప్రభావితుడై భారత జాతీయ కాంగ్రెసులో చేరారు. 1927 లో అప్పటి హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెసు ప్రతినిధిగా మద్రాసులో జరిగిన ఎ. ఐ. సి. సి. సమావేశంలో పాల్గొన్నారు. 1933లో హరిజన సేవక సంఘం కార్యక్రమాల సందర్భంగా గాంధీజీ హైదరాబాదు వచ్చారు. అప్పుడు సికింద్రాబాదులో బహిరంగసభ ఏర్పాటుచేసి విజయవంతంగా నిర్వహించడంలో శ్రీ రామస్వామి తీవ్రంగా కృషిచేశారు.

జాతీయ సంస్థలు అతిక్లిష్ట పరిస్థితులు ఎదుర్కొంటున్న అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో శ్రీ రామస్వామి, హైదరాబాదు జిల్లా బోర్డు, హైదరాబాదు మునిసిపల్ కౌన్సిల్, హైదరాబాదు కాంగ్రెసు కమిటీలలో చాలా కాలంవరకు పనిచేశారు. ఈ సంస్థలలో ఉంటూ జాతీయ సమస్యలనేగాక బడుగువర్గాల రాజకీయ సాంఘిక ఆర్థికాభివృద్ధికి కూడ యథోచితంగా కృషిచేశారు.

ఈ శతాబ్ది మధ్యకాలంలో శ్రీ రామస్వామి పార్లమెంటులో ప్రవేశించి రెండు సంవత్సరాల వరకు సభ్యులుగా ఉన్నారు. 1954, 1956 మధ్యకాలంలో రెండు సంవత్సరాల పాటు అప్పటి హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వంలో డిప్యూటీ మంత్రిగా ఉన్నారు. 1957, 1962 లలో జరిగిన సాధారణ ఎన్నికలలో వికారాబాదు నియోజక వర్గంనుండి ఎన్నికైనారు. 1962 ఎన్నికలలో ఆయన శాసన సభకు పోటీ లేకుండా ఎన్నికైనారు. 1967 సాధారణ ఎన్నికలలో వికారాబాదు నియోజకవర్గంనుండి ఇండిపెండెంటు అభ్యర్థిని ఓడించి శాసన సభకు ఎన్నికైనారు.



## శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణరావు

శ్రీ వెనిగళ్ల సత్యనారాయణరావు 1918 ఆగస్టులో జన్మించారు. ఆయన ప్రాథమిక విద్య కృష్ణా జిల్లా పునాదిపాడులోను, ఉన్నత విద్య మచిలీపట్నంలోని హిందూ కళాశాలలోను అభ్యసించారు.

శ్రీ సత్యనారాయణరావు గత పాతిక సంవత్సరాల నుండి కాంగ్రెసు సంస్థలో పనిచేస్తున్నారు. 1941 లో జరిగిన వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. భారత దేశంలో విదేశీ పాలకులను గడగడ లాడించిన 'క్విట్ ఇండియా' మహోద్యమంలో చురుకుగా పాల్గొని అఖిల భారత నాయకులతోపాటు జైలు శిక్ష అనుభవించారు. మూడు సంవత్సరాలపాటు జైలులో ఉన్నారు. ఆయన జిల్లాలో ప్రముఖ నాయకులుగా వ్యవహరిస్తున్న శ్రీ రావు, రెండు సంవత్సరాల పాటు జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు గాను, రెండు సంవత్సరాలకు పైగా ఎ. సి. సి. సభ్యులుగాను వ్యవహరించారు.

ఈనాడు దేశంలోని సహకార రంగంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ముందడుగు వేయడానికి కారణం శ్రీ సత్యనారాయణరావు వంటి ప్రముఖ నాయకుల సేవా తత్పరత, నిర్విరామ కృషి ఫలితమే. ఈనాటి సహకారోద్యమ ప్రముఖులలో ఆయన ఒకరు. 8 సంవత్సరాలకు పైగా గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకుకు అధిపతిగా ఉండి, దానిని సువ్యవస్థిత సంస్థగా రూపొందించారు. దుగ్గిరాల భూమి తనఖా బ్యాంకు అధ్యక్షుడిగా ఉండి దాని ఉన్నతికి కృషి చేశారు.

శ్రీ, సత్యనారాయణరావు 1958 నుండి శాసన మండలి సభ్యులుగా ఉన్నారు. గుంటూరు స్థానిక సంస్థల నియోజక వర్గం నుండి శాసన మండలికి ఎన్నికైనారు. 1970 సంవత్సరంతో ఆయన సభ్యత్వ కాలం పూర్తి అవుతుంది. ప్రజా సమస్యలను సవివరంగా, సునిశితంగా వివరించే ఆయన ప్రసంగాలు శాసన మండలిలోని అన్నివర్గాల సభ్యులను ఆకర్షిస్తుంటాయి.



ముఖచిత్రం

# భారత భారీ విద్యుత్పరికరాల కర్మాగారం

హైదరాబాదు శివార్లలో రామచంద్రపురం వద్ద నిర్మింపబడుతున్న భారత భారీ విద్యుత్పరికరాల కర్మాగారం- భారత, ఒకోస్లోవేకియా దేశాలు కలిసి సంయుక్తంగా నిర్మిస్తున్న నాలుగు భారీ కర్మాగారాలలోనూ ఒకటి. 1963 లో దీనిని ప్రారంభించారు. యంత్రాలు, పరికరాలు, భవనాలు, సిబ్బంది ఖర్చులు మొదలైనవాటితో సహా యీ కర్మాగారం నిర్మాణానికి మొత్తం రు. 34 కోట్లు ఖర్చుఅయ్యింది. తొలిదశలో ఏటా రూ. 25 కోట్ల విలువచేసే పరికరాల ఉత్పత్తి జరగవచ్చని భావిస్తున్నారు.

ఈ కర్మాగారంలో మొత్తం 10 ఉత్పత్తి బ్లాకులు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని బ్లాకులే యితర మూడుచోట్ల కన్నా పరిమాణంలో పెద్దవి. ఇవికాక ఆఫీసు భవనాలు వున్నాయి.

1966 ఏప్రిల్ 22 లో స్విచ్ గేర్ విభాగం పనిచేయడం ప్రారంభించింది, ఈ విభాగం హైపవర్ ప్లాంట్‌కు అనుకొనే వున్నది. కర్మాగార నిర్మాణం యించుమించు పూర్తయ్యింది. తొలిదశ ఉత్పత్తి నిమిత్తం పరికరాలు కూర్పుచేయడమే పూర్తవ్వాలి. ఈ యూనిటును ఏర్పాటు చేసి రెండేళ్లే అయినప్పటికీ పరికరాలకై వచ్చిన ఆర్డర్లను చూస్తే చాలా ఆశాజనకంగా వున్నది. ప్రస్తుతం ఎయిర్ బ్లాస్ట్ సర్క్యూట్ బ్రేకర్స్‌కై సుమారు రూ. 414 లక్షల మేరకు ఆర్డర్లు సిద్ధంగా వున్నాయి. ఉత్పత్తయిన తొలి బ్రేకర్స్‌ను తారాపూరు న్యూక్లియర్ విద్యుదుత్పత్తి కేంద్రంలో నెలకొల్పవలసివుంది. ఈ పని త్వరలోనే ప్రారంభ కానున్నది.

# ముఖ్య వార్తలు

## రాష్ట్రంలో

మార్చి 5 : ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సహకార యూనియన్ ఉపాధ్యక్షుడు శ్రీ మాధవరావు అన్వారీ హైదరాబాదులో స్వర్గస్థులయ్యారు.

మార్చి 6 : శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో ఆంధ్ర ప్రదేశ్ మంత్రి మండలి హైదరాబాదులో ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 15 : విజయవాడలో 23 వ అఖిల భారత పశు ప్రదర్శనకు రాష్ట్ర వ్యవసాయ శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 18 : నాలుగవ సార్వత్రిక ఎన్నికల అనంతరం తొలిసారిగా ఆంధ్ర ప్రదేశ్ విధాన సభ హైదరాబాదులో సమావేశమైంది.

మార్చి 20 : ఆంధ్ర ప్రదేశ్ విధానసభకు తిరిగి బి. వి. సుబ్బారెడ్డి స్పీకరుగా ఎన్నిక య్యారు.

విధాన సభ, శాసన మండలి తొలి సంయుక్త సమావేశంలో గవర్నరు ప్రసంగించారు.

మార్చి 23 : 1967-68 సంవత్సరానికి రూ. 2.71 కోట్ల లోటుతో మధ్యంతర బడ్జెటును రాష్ట్ర విధాన సభకు ముఖ్య మంత్రి సమర్పించారు.

మార్చి 24 : 45 వ అఖిల భారత షియా సమావేశానికి హైదరాబాదులో ముఖ్య మంత్రి ప్రారంభోత్సవం జరిపారు.

మార్చి 29 : ఆంధ్ర ప్రదేశ్ విధాన సభకు తిరిగి శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ డిప్యూటీ స్పీకర్‌గా నియమింపబడ్డారు.

మార్చి 31 : ఆంధ్ర ప్రదేశ్ చెరకు (కొనుగోలు, సరఫరాను క్రమబద్ధంచేసే) సవరణ బిల్లును ఆంధ్ర ప్రదేశ్ విధాన సభ ఆమోదించింది.

ఏప్రెల్ 1 : ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి నిరవధికంగా వాయిదా పడింది.

కేంద్ర ఉక్కు, గనుల, లోహాల మంత్రి వికారాబాదులో పారిశ్రామిక వాడకు ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రెల్ 2 : ఆంధ్ర ప్రదేశ్ విధానసభ నిరవధికంగా వాయిదా పడింది.

ఏప్రెల్ 4 : శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి, శ్రీ కె. వి. నారాయణ రెడ్డి, శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ, శ్రీ అరిగె రామస్వామి, శ్రీ వి. సత్యనారాయణరావు—ఈ యిదుగురు కొత్త మంత్రులు రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం చేశారు

ఏప్రెల్ 6 : మహా ఘనతవహించిన మీర్ బర్కత్ అలీఖాన్ బహదూర్ నిజాముల్‌ముల్క్ అసిఫ్‌జా VIII హైదరాబాదు నిజాంగా నియమింపబడ్డారు.

## భారత దేశంలో

మార్చి 5 : అహమదాబాదులో శ్రీ హితేంద్ర దేశాయ్ నాయకత్వాన పద్నాలుగు మంది సభ్యులుగల గుజరాత్ కొత్తమంత్రి మండలి ప్రమాణస్వీకారం చేసింది.

పాట్నాలో శ్రీ మహామాయ ప్రసాద్ సిన్హా నాయకత్వాన బీహారు కొత్తమంత్రి మండలి ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 6 : శ్రీ ఎస్. జి. బర్వే కొత్త ఢిల్లీలో స్వర్గస్థులయ్యారు.

శ్రీ వి. పి. నాయక్ నాయకత్వాన ఏర్పడిన 26 మంది సభ్యులుగల మహారాష్ట్ర కొత్తమంత్రి మండలి బొంబాయిలో ప్రమాణ స్వీకారం చేసింది.

శ్రీ ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ నాయకత్వాన ఏర్పడిన 15 మంది సభ్యులుగల కేరళ కొత్తమంత్రి మండలి తిరువేంద్రంలో ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 8 : శ్రీ ద్వారకా ప్రసాద్ మిశ్రా నాయకత్వాన ఏర్పడిన మధ్య ప్రదేశ్ కొత్త మంత్రిమండలి భోపాల్‌లో ప్రమాణ స్వీకారం చేసింది.

శ్రీ రాజేంద్ర నారాయణ సింగ్‌దేవ్ నాయకత్వాన ఏర్పడిన 15 మంది సభ్యులుగల ఒరిస్సా మిశ్రమ మంత్రిమండలి భువనేశ్వర్‌లో ప్రమాణ స్వీకారం చేసింది.

శ్రీ గుర్నమ్‌సింగ్ నాయకత్వాన ఏర్పడిన పంజాబు మంత్రిమండలి చండీఘర్‌లో ప్రమాణస్వీకారం చేసింది.

ఇరాక్ విదేశీ వ్యవహారాల మంత్రి డా. ఏడెన్ భారత దేశానికి ఆరురోజుల అధికార పర్యటనకై విచ్చేసిన సందర్భంలో భారత-ఇరాక్ దేశాలకు సంబంధించిన ఒక సంయుక్త ప్రకటన విడుదల చేశారు.

మార్చి 11: 1966 వ సంవత్సరానికి సంబంధించిన సాహిత్య అకాడమీ బహుమతులను రాష్ట్రపతి క్రొత్త ఢిల్లీలో అందజేశారు.

మార్చి 12: కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకురాలుగా శ్రీమతి ఇందిరా గాంధి క్రొత్త ఢిల్లీలో పోటీ లేకుండా ఎన్నికయ్యారు.

మార్చి 13: శ్రీమతి ఇందిరాగాంధి ప్రధాన మంత్రిగా 33 మంది సభ్యులుగల మంత్రివర్గం క్రొత్తఢిల్లీలోని రాష్ట్రపతి భవన్‌లో ప్రమాణ స్వీకారం చేసింది.

రాజస్థాన్‌ను రాష్ట్రపతిపాలనక్రిందకు తెచ్చే ప్రకటనపై రాష్ట్రపతి సంతకంచేశారు.

శ్రీ వి. పి. నాయక్ నాయకత్వాన మహారాష్ట్ర మంత్రిమండలి బొంబాయిలో ప్రమాణ స్వీకారం చేసింది.

శ్రీ నిజలింగప్ప నాయకత్వాన మైసూర్ మంత్రి మండలి బెంగుళూరులో ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 17 : శ్రీ నీలం సంజీవరెడ్డి లోక్‌సభ స్పీకరుగా ఎన్నికయ్యారు.

శ్రీ జి. ఎం. సాదిక్ నాయకత్వాన ఏర్పడిన కాశ్మీర్ మంత్రివర్గం శ్రీనగర్‌లో ప్రమాణస్వీకారం చేసింది.

మార్చి 18 : పార్లమెంటు బడ్జెటు సమావేశాన్ని రాష్ట్రపతి ప్రారంభించారు.

మార్చి 20 : ఉప ప్రధానీ, ఆర్థిక మంత్రీ అయిన శ్రీ మొరార్జీ దేశాయి, 1967–68వ సంవత్సరానికి తాత్కాలిక బడ్జెటును పార్లమెంటుకు సమర్పించారు.

రైల్వేమంత్రి, రైల్వే బడ్జెటును లోక్‌సభలో ప్రవేశ పెట్టారు.

మార్చి 24 : ఇండియా ట్రావెల్ ఏజెంట్ల సంఘం 16వ వార్షిక మహాసభకు మద్రాసు ముఖ్య మంత్రి ఉదకమండలంలో ప్రారంభోత్సవం చేశారు.

శ్రీ రావ్ బీరేంద్రసింగ్ నాయకత్వాన ఏర్పడిన 15 మంది సభ్యులుగల హరియానా మంత్రివర్గం చండీగడ్‌లో ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 30 : స్వచ్ఛంద సేవకు సంబంధించిన అంతర్జాతీయ సచివాలయపు ప్రపంచ సభను ఉపరాష్ట్రపతి ప్రారంభించారు.

ఏప్రి 1 : గవర్నరు ప్రసంగానికి కృతజ్ఞత తెలియజేసే తీర్మానం వీగిపోయిన కారణంగా ఉత్తర్ ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ సి. బి. గుప్త 18 రోజుల పాలనానంతరం తమ మంత్రివర్గం రాజీనామాను సమర్పించారు.

ఏప్రిల్ 3 : సంయుక్త విధాయక్‌దళ్ నాయకుడు శ్రీ చరణ్‌సింగ్ ఉత్తర్ ప్రదేశ్ ముఖ్యమంత్రిగా లక్నోలో ప్రమాణ స్వీకారం చేశారు.

ఏప్రిల్ 8 : క్రొత్తఢిల్లీలో ముఖ్య మంత్రుల సమావేశం ప్రారంభమైంది.

## విదేశాలలో

మార్చి 5 : సిరియా గవర్నర్ జనరల్ జార్జెస్ వెనీర్ అట్టావాలో మరణించారు.

బ్రెజిల్‌కు చెందిన ఒక విమానం మొన్రోవియా విమానాశ్రయం (లైబేరియా) వద్ద ప్రమాదానికి లోనైంది. ఈ విమానంలో 89 మంది ప్రయాణీకులున్నారు.

మార్చి 13 : సర్ ఫ్రాంక్ వారెల్ కింగ్‌స్టన్–జమైకాలో మరణించారు.

మార్చి 20 : వియత్నాంపై ఉన్నత స్థాయి చర్చలు జరిపే నిమిత్తం అమెరికా అధ్యక్షుడు గ్వామ్‌కు చేరుకున్నారు. ఈ చర్చలు రెండు రోజులపాటు సాగాయి.

మార్చి 31 : సోవియట్ రక్షణ మంత్రి మార్షల్ రోడియన్ మలినోవ్‌స్కీ మాస్కోలో చనిపోయారు.

ఏప్రిల్ 2 : భారత దేశానికి అదనంగా మూడు మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలను సరఫరా చేయడానికి సంబంధించిన ఒక తీర్మానంపై అమెరికా అధ్యక్షుడు జాన్సన్ సంతకం చేశారు.

ఏప్రిల్ 3 : 'ఇకేఫ్' వార్షిక మహాసభ టోక్యోలో ప్రారంభమైంది.

ఏప్రిల్ 4 : భారత దేశానికి సహాయం చేసే దేశాల సమావేశం పారిస్‌లో ప్రారంభమైంది.





[సంపన్న కుటుంబంలో పుట్టి, దేశస్వాతంత్ర్యంకోసం మొత్తం పదిహేను సంవత్సరాలు కారాగారంలో కష్టపడిన త్యాగమూర్తి జవహర్‌లాల్ నెహ్రూ స్వాతంత్ర్య పిపాసి. కులతత్వాలూ, సంకుచిత భావాలూ జాతినీ దేశాన్నీ అధోగతికి తెస్తాయని నినదించి ప్రజలకు విశాలదృష్టిని బోధించిన మహాపురుషుడు నెహ్రూ. శాస్త్రపరిశోధనలు జరిపి విజ్ఞాన పథంలో పట్టుదలతో పరిగెత్తకపోతే భారతీయులు భావదాస్యంనుంచి విముక్తి పొందనేరరని అనేక విజ్ఞాన పరిశోధన సంస్థలను స్థాపించిన విజ్ఞాని. నలుబదేళ్లు ప్రజలజీవితంలో ఒక మార్గదర్శి. ఆయన స్వప్నించిన సోషలిజం సాధించడం కన్నా ఆయన కలలకు మనమివ్వదగిన ఆకృతిలేదు.]

'అసహాయులందరినీ ఆదుకున్న అన్న
అవనిలోని నాయకులందరికంటె మిన్న"

# నెహ్రూ

"ప్రజలే నాయకులన్న ప్రజాస్వామ్యవాది నీవు
ఆలోచనకు చిహ్నమయిన నీ ఆననం
చాంచల్యానికి చిహ్నమయిన నీ కన్నులు
శాంతికి, ప్రేమకు చిహ్నమయిన నీ చిరునవ్వు
విప్లవానికి, అభ్యుదయానికి చిహ్నమయిన
నీ ఎర్రగులాబీ ఎద
నీ మానవతాముద్ర
ఎట్లా చెరపగలము ఈ హృదయాల నుంచి
నీవు మాకు భౌతికంగా లేవు
కాని నీ పరుసవేదిలాంటి భావాలతో
పవిత్రం కాని మా జీవన ధాతువు లేదు
నీ తేజస్సు సోకనిచోటేది ఈచరితలో

—వరవరరావు పెండ్యాల

# 'మనోరమ'లో ఒక్కరోజు

## హైదరాబాదు యాత్రికునికి 'మనోరమ' లో ఒకరోజు మరపురాని అనుభూతి

అది వారిని

గోల్కొండ కోట
చార్మినార్
పబ్లిక్ గార్డెన్స్

ఉస్మాన్ సాగర్
సాలార్జంగ్ మ్యూజియం
ఉస్మానియా విశ్వవిద్యాలయం



మొదలయిన స్థలాలకు తీసుకొని వెళ్తుంది

శుక్రవారం మినహా ప్రతిరోజూ పర్యటించవచ్చు

## సాలార్జంగ్ మ్యూజియం

ప్రవేశ రుసుముతో సహా

**రూ. 8-00 మాత్రమే**

రిజర్వేషన్లు చేయించుకోవలసిన స్థలము-మనోరమ బయలుదేరు స్థలము

### రాష్ట్ర సమాచార కేంద్రం, సమాచార పౌర సంబంధాల శాఖ

గాంధీభవనం ఎదుట, హైదరాబాదు.

ఫోన్ నం. 43281 మరియు 43282

# ఐదుగురు కొత్త మంత్రుల నియామకం
## రాజభవన్‌లో పదవీ ప్రమాణ స్వీకారం



మంత్రిగా శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిని, ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఏప్రిల్ 4న రాజ భవన్‌లో పదవీ ప్రమాణ స్వీకారం చేయించారు



శ్రీ అరిగె రామస్వామి పదవీ ప్రమాణ స్వీకారం చేశారు



శ్రీ కె. వి. నారాయణరెడ్డి పదవీ ప్రమాణ స్వీకారం చేస్తున్న దృశ్యం



శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణరావు పదవీ ప్రమాణ స్వీకారం చేస్తున్న దృశ్యం



శ్రీ ఇబ్రాహిం అలీ అన్సారీ పదవీ ప్రమాణ స్వీకారం చేశారు



శ్రీ అరిగె రామస్వామి, మార్చి 18న రాజ భవనంలో తాత్కాలిక స్పీకరుగా ప్రమాణ స్వీకారం చేశారు



ఏప్రిల్ 4వ తేదీన రాజభవన్‌లో హోం మంత్రితో ముఖ్యమంత్రి, రెవెన్యూ మంత్రి



రాజ భవన్‌లో మంత్రులు శ్రీ కె.వి. నారాయణరెడ్డి శ్రీ జె.వి. నరసింగరావు, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజి



మార్చి 20వ తేదీన రాష్ట్ర ఉభయ శాసన సభల సంయుక్త సమావేశంలో ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ స్పీకరు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి గవర్నరు ప్రసంగాన్ని చదివారు. అస్వస్థతవల్ల గవర్నరు ఈ సమావేశానికి హాజరు కాలేకపోయారు



కేంద్ర ఉక్కు, గనులు, లోహాల శాఖామంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డికి, మార్చి 16వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో మిత్రులు, అభిమానులు ఘనంగా స్వాగత మిచ్చారు



కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు, శ్రీశైలంలో కొత్తగా నిర్మించిన శంకరమంటపంలో మార్చి 22వ తేదీన కుంభాభిషేకం జరిపారు. శ్రీ ఆది శంకర భగవత్పాదుల విగ్రహాన్ని, వారి నలుగురు శిష్యుల విగ్రహాలనూ ప్రతిష్ఠించారు



శ్రీశైలంలో మార్చి 22వ తేదీన కంచకామకోటి పీఠాధిపతులతో ముఖ్య మంత్రి



దేవాలయ ప్రాంగణంలో ముఖ్యమంత్రి



ఆ సందర్భంలో శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి బీదలకు అన్నదానం చేశారు



శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు స్థలాన్ని మార్చి 22వ తేదీన ముఖ్య మంత్రి సందర్శించారు



కేరళ ముఖ్య మంత్రి శ్రీ ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్, మార్చి 25వ తేదీన ఆనంద నిలయంలో రాష్ట్ర ముఖ్యమంత్రినీ, రెవెన్యూ, పౌర సరఫరాల శాఖామంత్రి శ్రీ వి. బి. రాజునూ కలుసుకున్నారు



శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు దృశ్యం



ఆహార, వ్యవసాయ శాఖల మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, మార్చి 16వ తేదీన విజయవాడలో అఖిల భారత పశువులు, కోళ్ల ప్రదర్శనను ప్రారంభించారు



శ్రీ జె. పి. ఎల్. గ్విన్; ఐ. సి. ఎస్, 'బోధనా భాషగా తెలుగు వాడకం, అధికార వ్యవహారాలలో తెలుగు ఉపయోగం' అనే విషయంపై తమ నివేదికను మార్చి 28వ తేదీన ముఖ్యమంత్రికి సమర్పించారు



కేంద్ర ఉక్కు, గనులు, లోహాల మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, ఏప్రిల్ మొదటి తేదీన వికారాబాదులో పారిశ్రామిక వాడకు ప్రారంభోత్సవం చేశారు. పరిశ్రమల శాఖామంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు



రాష్ట్ర పంచాయతీ రాజ్ శాఖమంత్రి శ్రీ తోట రామస్వామి, మార్చి 18న హైదరాబాదులో హైదరాబాదు జిల్లా మహిళా మండలుల పోటీల సందర్భంగా ఏర్పాటుచేసిన ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు



సమాచార, కార్మిక శాఖలమంత్రి శ్రీకొండా లక్ష్మణ్ బాపూజీ, మార్చి 14న సమాచార, పౌర సంబంధ శాఖాధికారుల సమావేశంలో ప్రసంగించారు



రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె.ఎన్. అనంతరామన్, ఐ.సి.ఎస్. మార్చి 8వ తేదీన హైదరాబాదులో నర్సింగ్ కళాశాల దినోత్సవంలో ప్రసంగించారు. మహిళాకళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ఎస్. శ్రీ దేవి, బహుమతి ప్రదానం చేశారు



సమాచార, కార్మిక శాఖల మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, ఏప్రిల్ 22న బసంత్ టాకీసులో క్షేత్రప్రచార డైరెక్టొరేటువారి వార్తా చిత్రాల ప్రత్యేక ప్రదర్శనల సందర్భంలో ప్రసంగించారు



ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, మార్చి 21న సికిందారాబాదులో బాలనేరస్థుల పునరావాస కేంద్రం వార్షికోత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు. ప్రభుత్వ రెండవ కార్యదర్శి శ్రీ ఎస్.ఎ. అయ్యంగార్‌ను కూడ చిత్రంలో చూడవచ్చు



శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు స్థలాన్ని మార్చి 22వ తేదీన ముఖ్య మంత్రి సందర్శించారు



కేరళ ముఖ్య మంత్రి శ్రీ ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్, మార్చి 25వ తేదీన ఆనంద నిలయంలో రాష్ట్ర ముఖ్యమంత్రినీ, రెవెన్యూ, పౌర సరఫరాల శాఖామంత్రి శ్రీ వి. బి. రాజునూ కలుసుకున్నారు



శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు దృశ్యం



ఆహార, వ్యవసాయ శాఖల మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, మార్చి 16వ తేదీన విజయవాడలో అఖిల భారత పశువుల, కోళ్ల ప్రదర్శనను ప్రారంభించారు



శ్రీ జె. పి. ఎల్. గ్విన్; ఐ. సి. ఎస్, 'బోధనా భాషగా తెలుగు వాడకం, అధికార వ్యవహారాలలో తెలుగు ఉపయోగం' అనే విషయంపై తమ నివేదికను మార్చి 28వ తేదీన ముఖ్యమంత్రికి సమర్పించారు



కేంద్ర ఉక్కు, గనులు, లోహాల మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, ఏప్రిల్ మొదటి తేదీన వికారాబాదులో పారిశ్రామిక వాడకు ప్రారంభోత్సవం చేశారు. పరిశ్రమల శాఖామంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు



రాష్ట్ర పంచాయతీ రాజ్ శాఖమంత్రి శ్రీ తోట రామస్వామి, మార్చి 18న హైదరాబాదులో హైదరాబాదు జిల్లా మహిళా మండలుల పోటీల సందర్భంగా ఏర్పాటుచేసిన ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు



సమాచార, కార్మిక శాఖలమంత్రి శ్రీకొండా లక్ష్మణ్ బాపూజీ, మార్చి 14న సమాచార, పౌర సంబంధ శాఖాధికారుల సమావేశంలో ప్రసంగించారు



రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె.ఎన్. అనంతరామన్, ఐ.సి.ఎస్. మార్చి 3వ తేదీన హైదరాబాదులో నర్సింగ్ కళాశాల దినోత్సవంలో ప్రసంగించారు. మహిళాకళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ఎస్. శ్రీ దేవి, బహుమతి ప్రదానం చేశారు



సమాచార, కార్మిక శాఖల మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, ఏప్రిల్ 22న బసంత్ టాకీసులో క్షేత్రప్రచార డైరెక్టొరేటువారి వార్తా చిత్రాల ప్రత్యేక ప్రదర్శనల సందర్భంలో ప్రసంగించారు



ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, మార్చి 21న సికిందరాబాదులో బాలనేరస్థుల పునరావాస కేంద్రం వార్షికోత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు. ప్రభుత్వ రెండవ కార్యదర్శి శ్రీ ఎస్.ఎ. అయ్యంగారును కూడ చిత్రంలో చూడవచ్చు



కేంద్రపార్లమెంటరీ వ్యవహారాల డిప్యూటీ మంత్రి శ్రీ జె. బి. ముత్యాలరావుకు, మార్చి 3వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో ఘనమైన స్వాగతం ఇచ్చారు. రాష్ట్ర విద్యాశాఖా మంత్రి శ్రీ టి. వి. రాఘవులును కూడ చిత్రంలో చూడవచ్చు



గుంటూరు కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం, మార్చి 10 వ తేదీన రేపల్లెలో రెండవ వరిపంటపై విమానంనుండి మందులు చల్లే కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు



హైదరాబాదు పరిపాలనా సిబ్బంది కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఆర్. ఎల్. గుప్తా, ఐ. సి. ఎస్; (రిటైర్డు) మార్చి 28 న సచివాలయంలోని సమావేశ మందిరంలో "పబ్లిక్ రంగంలోని పరిశ్రమల నిర్వహణ" అంశంపై ప్రసంగించారు. రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి యీ సమావేశానికి అధ్యక్షత వహించారు



రాష్ట్ర సమాచార, కార్మికశాఖల మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, మార్చి 23వ తేదీన రామచంద్రపురంలోని భారత భారీవిద్యుత్పరికరాల ఫ్యాక్టరీని సందర్శించారు



విమానంనుండి మందులు చల్లుతున్న దృశ్యం



న్యూఢిల్లీలోని విదేశవ్యాపార భారతీయసంస్థ డైరెక్టర్-జనరల్ శ్రీ హెచ్. పి. శౌరి, మార్చి 28న హైదరాబాదులో డైరెక్టర్ల సమావేశానికి అధ్యక్షత వహించారు

## బహుముఖ ప్రతిభాశాలి

## శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారికి

## శ్రద్ధాంజలి

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు దివంగతులైన సందర్భంగా సమాచార, పౌరసంబంధ, కార్మిక శాఖల మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ఒక సంతాప ప్రకటన చేశారు. —



జననం : 1872  మరణం : 19-4-1967

### మహోజ్జ్వల జీవితం

"శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు పరమపదించడంతో సమకాలీన సాహిత్య రంగంనుంచి బహుముఖ ప్రతిభాశాలి అయిన ఒక వ్యక్తి నిష్క్రమించినట్లయింది. శ్రీ కృష్ణాచార్యులవారు అగ్రశ్రేణికి చెందిన 'అవధానుల'లో ఒకరుగా పరిగణించ బడేవారు విద్యారంగంలో వారికిగల సంబంధం సుదీర్ఘమైనది. సన్నిహితమైనది. వారు ఉత్తమ గ్రంథకర్త. సంస్కృతంలో అనేక ప్రామాణికగ్రంథాలు రచించారు. వారు తమ జీవిత కాలంలో అనేక గౌరవ సత్కారాలు, బిరుదములు పొందారు. వారి బహుముఖ ప్రతిభకు ఇవే ప్రబల నిదర్శనాలు. 1961 వ సంవత్సరంలో అప్పటి రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ వారిని ప్రత్యేక అవార్డుతో సత్కరించారు. రాష్ట్రప్రభుత్వం 1961వ సంవత్సరంలో వారిని ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవిగా చేసుకొని గౌరవించింది. వారు మహోజ్జ్వలమైన జీవితం గడిపారు. వారి పాండితీ ప్రతిభ భావిసంతతివారికి మార్గదర్శకమైనది."

### శ్రీ కాశీ కృష్ణాచార్య

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు కృష్ణాజిల్లా మచిలీ పట్నంలో 1872వ సంవత్సరంలో జన్మించారు. వారిజనకుడు మంచి పండితుడు. గుంటూరులో శ్రీ కాశీ వేదవ్యాసాచార్యులవద్ద పెరిగారు. రఘువంశం, శృంగార నైషధంతో వారి విద్యాభ్యాసం మొదలైంది. తత్ఫలితంగా తమ పదవయేటనే వారు సంస్కృతంలో మంచి రచయితగా, వక్తగా రూపొందారు.

అటుతర్వాత శ్రీకృష్ణాచార్యులవారు విజయ నగర సంస్థాన పండితులైన మహీశుర భీమాచార్యుల వారి వద్ద శిష్యుడిగా జేరారు. విజయ నగర సంస్థానంలోనేవున్న పి. వెంకట శాస్త్రి గారి వద్ద పాణినీయం వరకు వ్యాకరణాన్ని అభ్యసించారు. అయితే వీరి చదువు సంధ్యలు చూస్తున్న శ్రీనివాసాచార్యుల వారి మరణంతో వీరి విద్యాభ్యాసం కుంటుపడింది. ఆపైన వీరి చదువు కాకరపర్తిలో జి. సంగమేశ్వర శాస్త్రిగారి అధ్వర్యాన సాగింది.

శ్రీ కాశీ కృష్ణాచార్య 'అవధానుల'లో అగ్రగణ్యులుగా పరిగణింప బడినారు. వారికిగల 'ఆశుకవిత్వం'లోని నైపుణ్యం జగద్విఖ్యాతం. గుంటూరులోని హిందూ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా పనిచేస్తూనే యీ కళలో ప్రావీణ్యం సంపాదించారు. తన 19వ యేటనే గుంటూరులో 'శతావధానం'చేసి అందరి ప్రశంసలను అందుకున్నారు. ఆతర్వాత భారతదేశంలోని అనేక సంస్థానాలలో పర్యటించి అక్కడి రాజాస్థానాలలో గౌరవ సత్కారాలు అందుకున్నారు. మచిలీపట్నంలో 'శతావధానం' చేయాలని శ్రీ. చే. చల్లపల్లి వేంకటశాస్త్రి, కృష్ణాచార్యను ఆహ్వానించినప్పుడు, అక్కడ వారు వరుసగా నాలుగురోజులలో 17 గంటలపాటు తమ పాండితీ ప్రకర్షతో ప్రేక్షకులను మంత్రముగ్ధులనుచేశారు. ఆ సమయంలో శ్రీ కె. గౌరీనాథశాస్త్రి, తిరుపతి వేంకటకవులు, శ్రీ ఎస్ పురుషోత్తమశాస్త్రి, శ్రీ ఎం దక్షిణామూర్తిశాస్త్రి, శ్రీ ఎస్ నరసింహశాస్త్రి, శ్రీ సి. హెచ్. రామనాథశాస్త్రి, శ్రీ పి. నరసింహశాస్త్రి, శ్రీ సి. హెచ్. సుబ్బారాయశాస్త్రి, శ్రీ బి తిరుమల వేంకటాచార్యులు, ఇతర పండిత ప్రకాండులు హాజరైనారు. శ్రీ కృష్ణాచార్య విద్వత్ప్రదర్శన వారిని ముగ్ధులను చేసింది.

శ్రీ కృష్ణాచార్యకు విద్యారంగంలో అపారమైన అనుభవం ఉంది. 1906–10 మధ్యకాలంలో వారు గుడివాడలోని హెచ్. ఇ. పాఠశాలలో ఆంధ్ర, సంస్కృత పండితులుగా పనిచేశారు. 1910 నుండి 1918 వరకు గుంటూరులోని హిందూ ఉన్నత పాఠశాలలోకూడ సంస్కృతాంధ్ర పండితులుగా ఉన్నారు. మన విద్యార్థులు సంస్కృత భాషనేర్వడాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో శ్రీ కాశీ కృష్ణాచార్య "మాతృభాషా సమాజాన్ని" నెలకొల్పారు. ఈ సమాజం సంస్కృతాన్ని బోధించడమేగాకుండా సంస్కృతంలో వక్తృత్వపు పోటీలను ఏర్పాటుచేసి, విజేతలకు బహుమతులను యిస్తుండేది. బ్రిటీషువారి రాజ్యపాలనలో ఇంగ్లీషుభాష ఆధిక్యం వహిస్తున్న] తరుణంలో అనేకమంది విద్యార్థులు సంస్కృతాన్ని అధ్యయనంచేయడానికి యీ సమాజంచేసిన కృషి ఎంతగానో తోడ్పడింది. కాశీ కృష్ణాచార్యులవారి బహుముఖ ప్రతిభ అసమానం. వీణ, ఫిడేలు, మురళి, నాదస్వరం, తబల వంటి జంత్ర వాయిద్యాలను వాయించడంలో బహు సమర్థులు.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు సంస్కృతంలో అనేక గ్రంథాలు రచించారు. కొత్తగా సంస్కృతం నేర్చుకునేవారి నిమిత్తం సులభశైలిలో మూడుభాగాలలో సంస్కృత బాలబోధిని రచించారు, (1918–20). క్రియాదర్శము అనే వ్యాకరణ గ్రంథాన్ని, (1921). ఆంధ్ర సంస్కృత నిఘంటువు అనే శబ్ద నిఘంటువును (1922), వాల్మీకి అనే జీవిత చిత్రణాత్మక గ్రంథాన్ని (1925). సంవాదము (1940) అనే గ్రంథాన్ని రచించారు. వీరి సంస్కృతభాషా పాండిత్యానికి 1960లో గుంటూరు పురవాసులు బంగారు కిరీటంతో వీరిని సన్మానించి 'సంస్కృత సామ్రాజ్యాధీశ' బిరుదునిచ్చి గౌరవించారు.

వీరికిగల బిరుదములే వీరి బహుముఖ ప్రతిభకు తార్కాణం. 1901 లో 'వివిధ కళా విచక్షణ' 1912 లో 'అవధాన శిరోమణి' 1938లో 'విద్యావారిధి' 1960లో 'మహామహోపాధ్యాయ' 'సంస్కృత సామ్రాజ్యాధీశ'. 1964లో 'కళాప్రపూర్ణ' బిరుదులు వీరికి ప్రసాదింపబడినాయి. 1961లో భారత రాష్ట్రపతి డా రాజేంద్రప్రసాదు వద్దనుండి వీరు ప్రత్యేక బహుమతిని అందుకున్నారు. 1962లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం వీరికి గౌరవ డాక్టరేటు ప్రసాదించింది. 1964లో ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదు బహూకరించింది. వీరి సాహితీ ప్రతిభను గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1961లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనంతరం శ్రీ కాశీ కృష్ణాచార్యులవారిని ఆస్థాన కవిగా నియమించింది. మరణకాలంవరకూ వీరు యీ పదవిలోనే వున్నారు.

---

# అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం

శ్రీశ్రీ



అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం ;
ఎక్కడికి చెట్టు ఎప్పుడూ వెళ్లదు కాబట్టి.

ఇవాళ ఉదయం బస్సుకోసం తపస్సు చేస్తూ చెట్టుకింద నిలబడ్డాను. "ఎక్కడికి నేస్తం" అని చెట్టు నన్నడిగినట్లని పించింది. ఇంకెవరైనా ఈ ప్రశ్న అడిగితే "మైలాపూరుకి'' అని జవాబిచ్చి ఉందును. నిజానికి మనం కొలిచే పొడుగు వెడల్పుల పరిమితిలో నా జవాబు నిజంలాగే కనబడేది. కాని చెట్టు వేసిందనుకున్న ప్రశ్న కాబట్టి "మైలాపూరు నా గమ్యం" అని ఏమొగం పెట్టుకొని జవాబివ్వగలను ? తెల్లారగట్టే లేచి "ఇందుకా ఈ వానలో నిలబడ్డావు ?'' అని చెట్టు గద్దిస్తే ఏమయిపోవాలి నేను ?

చెట్టుతో ఎవరూ మాట్లాడలేరు. మనం ఎంత కొలిచి కొలిచి జవాబు చెప్పినా అది అబద్ధపు వాసనే కొడుతుంది. చెట్టుని ఎవ్వరూ కొలవలేరు. మన ఆస్తుల్ని కొలుచుకోగలం! ఏదో ఒక పండుగపేరు చెప్పి ఎవరో ఒక దేవుణ్ణి కొలుచుకోగలం. కాని, ప్రపంచ పర్యాప్తమైన చెట్టు తాలూకు ఆకుపచ్చని అహింసాత్మక సామ్రాజ్యపు వైశాల్యాన్ని ఎవ్వరూ కొలవలేరు. ఇంతలో బస్సు వచ్చింది. నాకు నిలబడ్డానికి చోటు దొరికింది. నిలుచున్న పాటుగానే నేనేమీ కదలకుండానే ఒకచోటునుండి ఇంకోచోటు చేరుకున్నాను. నిలుచున్నంత సేపూ నా ఆలోచనలన్నీ చెట్టునుగురించే! చెట్టులో నువ్వుచూసే నిశ్చలత్వం శిలదీకాదు, శవానిదీకాదు. అది కదలదనుకోవడం భ్రమ. క్షణక్షణం చెట్టు కదుల్తూనే వుంటుంది. అయితే దాని ప్రయాణం ఔన్నత్యంవేపు ఆకాశాన్ని అందుకోవాలని ప్రతీచెట్టూ ప్రతీక్షణం ప్రయత్నిస్తూనే వుంటుంది.

ధ్వనికన్నా ఎక్కువ వేగంతో ప్రయాణించేసే విమానం ధన్యమైనదే. కాని శ్రావణ మంగళవారపు నోము రోజున సెనగగింజలోనుండి ఎదిగే మొక్క సాధించే వేగానికి నేను ఆశ్చర్యం పొందక మానలేను. చిన్నప్పుడు నేను పాతేసిన చింతపిక్కల సంతానం ఇప్పుడు సకల ప్రపంచంలో నిండిపోయిందన్న తలంపు కేవలం నిరాధారమైనది గాదు. శ్మశానాలమీద వాన కురిసినప్పుడు ఎంత వేగంగా పచ్చగడ్డి ఎదుగుతుందో ఎందుకు నేను వేరే చెప్పడం ?

నీ, నీ ఒకొక్క ఊహాకి ఉదాహరణంగా ఒకొక్క చెట్టుని చూడగలవు.

శ్రీ కాశీ కృష్ణాచార్య 'అవధానుల'లో అగ్రగణ్యులుగా పరిగణింప బడినారు. వారికిగల 'ఆశుకవిత్వం'లోని నైపుణ్యం జగద్విఖ్యాతం. గుంటూరులోని హిందూ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితుడిగా పనిచేస్తూనే యీ కళలో ప్రావీణ్యం సంపాదించారు. తన 19వ యేటనే గుంటూరులో 'శతావధానం'చేసి అందరి ప్రశంసలను అందుకున్నారు. ఆతర్వాత భారతదేశంలోని అనేక సంస్థానాలలో పర్యటించి అక్కడి రాజాస్థానాలలో గౌరవ సత్కారాలు అందుకున్నారు. మచిలీపట్నంలో 'శతావధానం' చేయాలని కీ. శే. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, కృష్ణాచార్యను ఆహ్వానించినప్పుడు, అక్కడ వారు వరుసగా నాలుగురోజులలో 17 గంటలపాటు తమ పాండితీ ప్రకర్షతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేశారు. ఆ సమయంలో శ్రీ జె. గౌరీనాథశాస్త్రి. తిరుపతి వేంకటకవులు శ్రీ ఎస్ పురుషోత్తమశాస్త్రి. శ్రీ ఎం దక్షిణామూర్తిశాస్త్రి. శ్రీ ఎస్ నరసింహశాస్త్రి శ్రీ సి. హెచ్. రామనాథశాస్త్రి. శ్రీ పి. నరసింహశాస్త్రి, శ్రీ సి. హెచ్. సుబ్బారాయశాస్త్రి. శ్రీ బి తిరుమల వేంకటాచార్యులు, ఇతర పండిత ప్రకాండులు హాజరైనారు. శ్రీ కృష్ణాచార్య విద్వత్ప్రదర్శన వారిని ముగ్ధులను చేసింది.

శ్రీ కృష్ణాచార్యకు విద్యారంగంలో అపారమైన అనుభవం ఉంది. 1906–10 మధ్యకాలంలో వారు గుడివాడలోని హెచ్. ఇ. పాఠశాలలో ఆంధ్ర. సంస్కృత పండితులుగా పనిచేశారు. 1910 నుండి 1918 వరకు గుంటూరులోని హిందూఉన్నత పాఠశాలలోకూడ సంస్కృతాంధ్ర పండితులుగా ఉన్నారు. మన విద్యార్థులు సంస్కృత భాషనేర్వడాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో శ్రీ కాశీ కృష్ణాచార్య ''మాతృభాషా సమాజాన్ని'' నెలకొల్పారు. ఈ సమాజం సంస్కృతాన్ని బోధించడమేగాకుండా సంస్కృతంలో వక్తృత్వపు పోటీలను ఏర్పాటుచేసి, విజేతలకు బహుమతులను యిస్తుండేది. బ్రిటీషువారి రాజ్యపాలనలో ఇంగ్లీషుభాష ఆధిత్యం వహిస్తున్న] తరుణంలో అనేకమంది విద్యార్థులు సంస్కృతాన్ని అధ్యయనం చేయడానికి యీ సమాజం చేసిన కృషి ఎంతగానో తోడ్పడింది. కాశీ కృష్ణాచార్యులవారి బహుముఖ ప్రతిభ అసమానం. వీణ, పిడేలు, మురళి, నాదస్వరం. తబల వంటి జంత్ర వాయిద్యాలను వాయించడంలో బహు సమర్థులు.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు సంస్కృతంలో అనేక గ్రంథాలు రచించారు. కొత్తగా సంస్కృతం నేర్చుకునేవారి నిమిత్తం సులభశైలిలో మూడుభాగాలలో సంస్కృత బాలబోధిని రచించారు. (1918–20). క్రియాదర్శము అనే వ్యాకరణ గ్రంథాన్ని, (1921). ఆంధ్ర సంస్కృత నిఘంటువు అనే శబ్ద నిఘంటువును (1922), వాల్మీకి అనే జీవిత చిత్రణాత్మక గ్రంథాన్ని (1925). సంవాదము (1910) అనే గ్రంథాన్ని రచించారు. వీరి సంస్కృతభాషా పాండిత్యానికి 1960లో గుంటూరు పురవాసులు బంగారు కిరీటంతో వీరిని సన్మానించి 'సంస్కృత సామ్రాజ్యాధీశ' బిరుదునిచ్చి గౌరవించారు.

వీరికిగల బిరుదములే వీరి బహుముఖ ప్రతిభకు తార్కాణం. 1901 లో 'వివిధ కళా విచక్షణ' 1912 లో 'అవధాన శిరోమణి' 1938లో 'విద్యావారిధి' 1960లో 'మహామహోపాధ్యాయ' 'సంస్కృత సామ్రాజ్యాధీశ'. 1961లో 'కళాప్రపూర్ణ' బిరుదులు వీరికి ప్రసాదింపబడినాయి. 1961లో భారత రాష్ట్రపతి డా రాజేంద్రప్రసాదు వద్దనుండి వీరు ప్రత్యేక బహుమతిని అందుకున్నారు. 1962లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం వీరికి గౌరవ డాక్టరేటు ప్రసాదించింది. 1964లో ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదు బహూకరించింది, వీరి సాహితీ ప్రతిభను గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1961లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనంతరం శ్రీ కాశీ కృష్ణాచార్యులవారిని ఆస్థాన కవిగా నియమించింది. మరణకాలంవరకూ వీరు యీ పదవిలోనే వున్నారు.

---

# అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం

శ్రీశ్రీ



అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం ;
ఎక్కడికీ చెట్టు ఎప్పుడూ వెళ్లదు కాబట్టి.

ఇవాళ ఉదయం బస్సుకోసం తపస్సు చేస్తూ చెట్టుకింద నిలబడ్డాను. " ఎక్కడికి నేస్తం " అని చెట్టు నన్నడిగినట్లని పించింది. ఇంకెవరైనా ఈ ప్రశ్న అడిగితే "మైలాపూరుకి'' అని జవాబిచ్చి ఉందును. నిజానికి మనం కొలిచే పొడుగు వెడల్పుల పరిమితిలో నా జవాబు నిజంలాగే కనబడేది. కాని చెట్టు వేసిందనుకున్న ప్రశ్న కాబట్టి "మైలాపూరు నా గమ్యం" అని ఏమొగం పెట్టుకొని జవాబివ్వగలను ? తెల్లారగట్టే తేచి ''ఇందుకా ఈ వానలో నిలబడ్డావు ?'' అని చెట్టు గద్దిస్తే ఏమయిపోవాలి నేను ?

చెట్టుతో ఎవరూ మాట్లాడలేరు. మనం ఎంత కొలిచి కొలిచి జవాబు చెప్పినా అది అబద్ధపు వాసనే కొడుతుంది. చెట్టుని ఎవ్వరూ కొలవలేరు. మన ఆస్తుల్ని కొలుచుకోగలం! ఏదో ఒక పండుగపేరు చెప్పి ఎవరో ఒక దేవుణ్ణి కొలుచుకో గలం. కాని, ప్రపంచ పర్యాప్తమైన చెట్టు శాలూకు ఆకు పచ్చని అహింసాత్మక సామ్రాజ్యపు వైశాల్యాన్ని ఎవ్వరూ కొలవలేరు. ఇంతలో బస్సు వచ్చింది. నాకు నిలబడ్డానికి చోటు దొరికింది. నిలుచున్న పాటుగానే నేనేమీ కదల కుండానే ఒకచోటునుండి ఇంకోచోటు చేరుకున్నాను. నిలు చున్నంత సేపూ నా ఆలోచనలన్నీ చెట్టునుగురించే! చెట్టులో నువ్వుచూసే నిశ్చలత్వం శిలదీకాదు. శవానిదీకాదు. అది కదలదనుకోవడం భ్రమ. క్షణక్షణం చెట్టు కదుల్తూనే వుంటుంది. అయితే దాని ప్రయాణం ఔన్నత్యంవేపు ఆకా శాన్ని అందుకోవాలని ప్రతీచెట్టూ ప్రతిక్షణం ప్రయత్నిస్తూనే వుంటుంది.

ధ్వనికన్నా ఎక్కువ వేగంతో ప్రయాణంచేసే విమా నం ధన్యమైనదే. కాని శ్రావణ మంగళవారపు నోము రోజున సెనగగింజలోనుండి ఎదిగే మొక్క సాధించే వేగానికి నేను ఆశ్చర్యం పొందక మానలేను. చిన్నప్పుడు నేను పారే సిన చింతపిక్కల సంతానం ఇప్పుడు సకల ప్రపంచంలో నిండిపోయిందన్న తలంపు కేవలం నిరాధారమైనది గాదు. శ్మశానాలమీద వాన కురిసినప్పుడు ఎంత వేగంగా పచ్చగడ్డి ఎదుగుతుందో ఎందుకు నేను వేరే చెప్పడం ?

నీ, నీ ఒక్కో ఊహకి ఉదాహరణంగా ఒకొక్క చెట్టుని చూడగలవు.

"కోరికలెల్ల ధూళిబడ గోల్పడి
దిక్కుల శూన్యదృక్కులం జీరి
యేటో వృథా శిశిరజీవన భారము
బుచ్చుచున్న భూమిరుహమేను..."

అన్నాడొక కవి.

"శ్రీమంతంబుగ స్వాంతముల్ వికసిలన్
సేమంతి సీమంతినుల్
హేమంతుండను కాంతురాకకొరకెం
తేవింత మీరన్ వనీ
భూమిన్ మేన నలంకరించుకొను కెం

పుల్, నీలముల్, వజ్రముల్
గోమేధంబులు నాచెలంగె పలురం
గుల్ గిల్గు పుష్పావళుల్"

అన్నాడు ఇంకో కవి.

ఇక్కడ నా ఉద్దేశంలో కొమ్మా, రెమ్మా, మొగ్గా, ములూ, ఆకూ, వేరూ—అన్నీ చెట్టే!

అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం. ఎక్కడికీ చెట్టు ఎప్పుడూ వెళ్లకపోతేనేం? ఏరోప్లేనులో ఎక్కినా ఎక్కడికి వెళ్లగలం మనం? ఎక్కడికీ వెళ్లని చెట్టు ఎప్పుడూ మనతోనే, మనలోనే ఉంది. అందుకే నాకంటే చెట్టంటే ఇష్టం.

# విశ్వవిఖ్యాత శాస్త్రవేత్త డాక్టర్ యెల్లాప్రగడ

*డాక్టరు యెల్లాప్రగడ సుబ్బారావుగారి జీవితం పలురంగుల సంపుటీకరణ. కేవలం వైద్య విజ్ఞానంలోనేకాక ఇతర రంగాల్లోనూ ఆయనకు అభిరుచీ, జిజ్ఞాసా మెండుగవుండేవి. ఆయనది ప్రతి విషయాన్ని గురించి తీవ్రంగా, సాకల్యంగా ఆలోచించేడి స్వభావం. విమానం నడపడంలో ఆసక్తికలిగి ఆయన దానిని నేర్చుకుని అప్పడప్పుడు విలాస విహారాలు సల్పేవారట. క్రికెట్ ఆటలో బంతి విసరడంలో ఇష్టంకలిగి కొన్నిదినాలు దానిని నేర్చుకొన్నారట. ఆయనకు జీవిత వివిధ రంగాల్లో ఎంత అనక్తిఉండేదో ఈ విషయాలు నిరూపిస్తాయి. ఆయన అభిరుచులనూ భావవిశాలతనూ ప్రకటిస్తాయి. ఖండాంతరాల్లో భారతీయ భావ సంపత్తినిచాటి అపార ప్రశంసలుబడసిన భారతీయుడు డాక్టరు యెల్లాప్రగడ.*

బొంబాయి సమీపంలోని పర్ల్నేరా వద్దగల లెడెర్లే ప్రయోగ శాలల ఫ్యాక్టరీ తెల్లని గోడలపై బూడిదరంగు ఉక్కు-ఫలకం ఒకటి వ్రేలాడుతూ కనిపిస్తుంది. దానిమీద ఈ విధంగా చెక్క-బడివుంది :—

యెల్లాప్రగడ సుబ్బారావు
1896—1948

'శాస్త్రజ్ఞుడు; అధ్యాపకుడు; వేదాంతి; మానవతావాది; రీసెర్చ్ డైరెక్టరు, లెడెర్లే ప్రయోగశాలల విభాగం, అమెరికన్ సయనమైడ్ కంపెనీ.'

ఆరోమైసిన్‌ను కనుగొన్న విఖ్యాత ఆంధ్ర శాస్త్రజ్ఞుడు డాక్టర్ యెల్లాప్రగడ సుబ్బారావు సంస్మరణార్థం 1952 వ సంవత్సరంలో ఈ ఫలకాన్ని ఆవిష్క-రించారు. వైద్య రంగం లోనే అపూర్వమైన దివ్యౌషధం ఆరోమైసిన్.

డాక్టర్ సుబ్బారావు 52 సంవత్సరాల ఉత్కృష్ట జీవితం గడిపారు. ఈ స్వల్పకాలంలోనే ఆయన విజ్ఞాన శాస్త్ర రంగంలో మన కీర్తి నార్జించారు.

డాక్టర్ సుబ్బారావు 1896 వ సంవత్సరంలో తూర్పు గోదావరి జిల్లాలో జన్మించారు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయారు. పితృహీనులైన తన సంతానాన్ని పోషించడంలో, విద్యాబుద్ధులు చెప్పించడంలో ఆయన తల్లి ఎంతో శ్రద్ధవహించారు. తండ్రి గతించిన కొద్ది నెలలకే ఆయన సోదరుడుకూడా జబ్బుచేసి మరణించాడు. ఈయనకూడా ఉష్ణమండలవాసులకు వచ్చేవ్యాధికి గురి అయ్యారు. కొద్ది వ్యవధిలోనే సంభవించిన ఈ రెండు మరణాలవల్ల శ్రీ సుబ్బారావు హృదయం ఎంతో క్షోభపడింది. బహుశః ఈ కారణంచేతనే ఆయన తన జీవితాన్ని దుఃఖిత మానవులకు ఉపశమనం కలిగించడానికి అంకితం చేయదలచారు.

డాక్టర్ సుబ్బారావు బాల్యదశ ఆసక్తికరమైనది. రాజమండ్రి వీరేశలింగం ఉన్నత పాఠశాలనుంచి మెట్రిక్యులేషను పరీక్షకు హాజరయ్యారు. తొలి ప్రయత్నంలో ఆయన విఫలురయ్యారట. అప్పుడు మద్రాసుకు బయలుదేరారు. అభివృద్ధికి ఎన్నో అవకాశాలుగల నగరం అది. నిరాశా నిస్పృహలకు లోనైన ఈ యువకునికి ఆ నగరంలో అవ్యాజమైన ఆదరం లభించింది. మద్రాసులో వున్న కాలంలో శ్రీ సుబ్బారావుకు రామకృష్ణ మిషన్‌తో సాన్నిహిత్యం ఏర్పడింది. రామకృష్ణ పరమహంస దివ్యోపదేశాలను వ్యాపింపజేయడానికి అంకితులైన కార్యకర్తలతో కూడుకున్న సంస్థ ఇది. ఇటువంటి సంస్థతో సంబంధం కలిగి రామకృష్ణ, వివేకానందస్వాముల ఉపదేశాల ప్రభావానికి లోనైన శ్రీ సుబ్బారావు తానుకూడా ఒక యోగిగా రూపొందాలనుకోవడం సహజమే. అయితే తన తల్లి మాటను జవదాటి ఎరుగని శ్రీ సుబ్బారావు, ఆమె అభీష్టం మరొకటి కావడం వల్ల, తన ఈ ఆకాంక్షను నెరవేర్చుకొనలేక పోయారు.

శ్రీ సుబ్బారావు ఈ శతాబ్ది తొలి దశాబ్దంలో మద్రాసు వైద్య కళాశాలలో చేరారు. అనపర్తి వాస్తవ్యులు శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు ఔదార్యంవల్ల ఆయన ఈ అవకాశం పొందగలిగారు. శ్రీ సూర్యప్రకాశరావు తన ఉపకారానికి ప్రత్యుపకారాన్నేమీ ఆశించలేదు. అయితే శ్రీ సుబ్బారావు మాత్రం శ్రీ సూర్యప్రకాశరావుగారి ప్రథమ పుత్రికను పరిణయమాడి ఆ వదాన్యుడిపట్ల తన కృతజ్ఞతను వెల్లడించుకున్నారు. 1919 మే లో వారి వివాహం జరిగింది.

## పరిశోధన

తరువాత రెండు సంవత్సరాలకు శ్రీ సుబ్బారావు మద్రాసు వైద్య కళాశాలనుండి బయటికి వచ్చారు. పిమ్మట మద్రాసు ఆయుర్వేద కళాశాలలో ఉపాధ్యాయుడుగా ఫిజియాలజీ లెక్చరర్‌గా చేరారు. అప్పుడు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు స్వర్గీయ డాక్టర్ ఆచంట లక్ష్మీపతి యీ సంస్థ అధిపతులుగా ఉండేవారు. శ్రీ సుబ్బారావు పరిశోధనపట్ల, కొత్త కొత్త విషయాలను కనుగొనడం పట్ల ఎంతో ఆసక్తి చూపేవారు. ఆయుర్వేద కళాశాలలో పనిచేసిన మూడు సంవత్సరాల కాలములో ఆయన డాక్టర్ లక్ష్మీపతి ప్రోత్సాహముతో, సహాయంతో ప్రాచీనమైన ఆ వైద్య విధానములో అమోఘమైన పరిశోధనలు జరిపారు.

ప్రతిభావంతులైన భారతీయులకు, ముఖ్యంగా విజ్ఞాన శాస్త్రం, సాహిత్యరంగాలలో కృషిచేసినవారికి ప్రారంభంలో పరిగణన విదేశాలలోనే లభించడం దాదాపు ఒక ఆనవాయితీగా పరిణమించింది. శ్రీ సుబ్బారావు 1923 వ సంవత్సరంలో ఉజ్జ్వలమైన అవకాశాల అన్వేషణకై ఇంగ్లాండు వెళ్లారు. లండన్‌లోని వైద్య పాఠశాలలో చేరి పరిశోధన కృషిలో తీవ్రంగా నిమగ్నులయ్యారు. అమెరికా బాస్టన్‌లోని హార్వర్డ్ వైద్య పాఠశాలలో ఉష్ణమండల వ్యాధుల ఆచార్యుడుగా పనిచేస్తున్న డాక్టర్ రిచర్డ్ స్ట్రాంగ్‌తో ఆయనకు అచ్చట పరిచయము కలిగింది. ఈ ప్రఖ్యాత ఆంధ్ర శాస్త్రజ్ఞుని జీవితంలో ఈ పరిచయాన్ని ఒక గొప్ప మలుపుగా పరిగణింపవచ్చు. డాక్టర్ స్ట్రాంగ్ ప్రోత్సాహముతో శ్రీ సుబ్బారావు అమెరికా వెళ్ళి హార్వర్డ్ వైద్యపాఠశాలలో ప్రవేశం పొంది బయోకెమిస్ట్రీలో ప్రత్యేక కృషి సాగించారు. ఇచ్చట ఆయనకు డాక్టర్ ఒట్టోఫాలిన్, డాక్టర్ ఫిస్కేలవంటి ప్రసిద్ధ బయో కెమిస్టుల మార్గదర్శకత్వం లభించింది. 1925 వ సంవత్సరములో శ్రీ సుబ్బారావు డాక్టర్ ఫిస్కేతోకలసి భాస్వరాన్ని నిర్ధారించేందుకు ఒక కొత్తపద్ధతిని కనిపెట్టారు. ప్రయోగశాలలలో ఇప్పటికీ ఈ విధానమే అవలంబించబడుతున్నది. ఆ మరునటి సంవత్సరములో ఆయన డాక్టర్ ఫిస్కేతో కలసి మరో అపూర్వవిషయాన్ని కనుగొన్నారు. కండరంనుంచి భాస్వరజనిత పదార్థాన్ని విడదీయడాన్ని ఆయన కనిపెట్టారు. 1930 వ సంవత్సరంలో ఆయన హార్వర్డ్ సంస్థనుంచి డాక్టర్ డిగ్రీ స్వీకరించి తమ సర్వస్వాన్ని విజ్ఞాన శాస్త్రానికి అంకితం చేశారు. డాక్టర్ సుబ్బారావు జీవితంలో తరువాతి రెండు దశాబ్దాలు చాలా ఉజ్జ్వలమైనవి.

## సదవకాశం

1940 ఆరంభంలో అమెరికా ఔషధ పరిశ్రమ చాలా ముందంజవేసింది. బయోకెమిస్ట్రీ రంగంలో డాక్టర్ సుబ్బారావు సాగిస్తున్న కృషికి మంచి పరిగణన లభించ నారంభించింది. ఔషధ పరిశ్రమకూడా ఆయన సేవలను వినియోగించుకోవడానికి ముందుకు వచ్చింది. మందుల ఉత్పత్తిలో ప్రపంచ ప్రఖ్యాతిగల అమెరికన్ సయనమైడ్ కంపెనీ, తమ పరిశోధన విభాగానికి ఆధిపత్యం వహించవలసిందిగా డాక్టర్ రావును అభ్యర్థించింది. ఆకర్షణీయమైన వేతనం, పరిశోధనకు చక్కని సదుపాయాలు, ఉన్నతికి మంచి అవకాశాలు—ఇన్నింటితో కూడిన ఈ సదవకాశాన్ని ఆయన వినియోగించదలచారు. తమ అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి ఈ సంస్థలో చేరారు.

డాక్టర్ రావు పైనతెలిపిన సంస్థలో జరిపిన అమోఘమైన కృషినీ, వైద్య జగతికి ఆయన చేసిన అద్వితీయమైన సేవలనూ శ్లాఘిస్తూ ఒక ప్రముఖుడు ఈ విధంగా పేర్కొన్నారు:—"డాక్టర్ సుబ్బారావు తమ కృషిని క్రమ పద్ధతిలో ప్రారంభించారు. ఆయన ఒక బ్రహ్మాండమైన గ్రంథాలయాన్ని ఏర్పరిచారు. ఇప్పుడది సుబ్బారావు స్మారక గ్రంథాలయంగా వ్యవహరించబడుతున్నది. పదహారుగురు శాస్త్రజ్ఞుల బృందంతో కలిసి ఆయన కాలేయంపైన, దాని రసాయనిక అంతర్భాగాలపైన పరిశీలన సాగించారు. 1945 వ సంవత్సరంలో ఆయన బృందం ఫోలిక్ ఆసిడ్‌ను సంయోగపరచడంలో విజయం పొందింది. దీనిని సాధించడంలో ఆయన చేసిన తీవ్ర పరిశ్రమకు తగు సత్కారం లభించింది. నిజానికి రసాయనిక శాస్త్ర చరిత్రలోనే ఇది గణనీయమైన విజయం. రక్తక్షయానికి అమోఘంగా పనిచేసే విటమిన్ బి. 12 పదార్థాన్ని కూడా ఆయన తెలుసుకొనగలిగారు. తాము ఫోలిక్ ఆసిడ్ పై ప్రయోగాలు జరుపుతున్నప్పుడు వడపోతలో విసర్జించిన పదార్థాలలో ఇది ఒకటైనట్లుగా ఆయన తెలుసుకు

న్నారు. తదాదిగ ఫోలిక్ ఆసిడ్‌పైన, మానవ శరీరంలో అది వహించు పాత్రపైన వందల సంఖ్యలో పరిశోధక వ్యాసాలు వచ్చాయి. ఫోలిక్ ఆసిడ్ ఉష్ణమండల జాడ్యాలకు, ఇతర రకాల రక్తక్షయ వ్యాధులకు ప్రశస్తమైనది కావడమే కాకుండా, కొన్ని రకాల కాన్సరు, లుకేమియాలకు ఉపయోగించే అమినోప్టెరిన్, మెరోప్టెరిన్ వంటి ఫోలిక్ ఆసిడ్ వ్యతిరేక పదార్థాల వినియోగం విషయంలో కొత్త ఆలోచనలకు ప్రాతిపదికను కూడా ఏర్పరచింది.

"శాస్త్రజ్ఞులకు ఇది స్వర్ణయుగం. డాక్టర్ అలగ్జాండర్ ఫ్లెమింగ్ పెన్సిలిన్‌ను కనుగొనడంతో చికిత్సా క్షేత్రంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. భవిష్యదుపయోగానికై శ్రేష్ఠమైన కొంగ్రొత్త అంటిబయాటిక్స్‌ను కనిపెట్టడంలో డాక్టర్ సుబ్బారావు తమ కృషిని కేంద్రీకరించారు. ఇదే ఆయన దూరదృష్టికి, దార్శనికతకు నిదర్శనం. ఈ ప్రయత్నంలో తమ బృందంతో కలసి పనిచేయవలసిందిగా ఆయన విస్కాన్సిన్ విశ్వవిద్యాలయానికి చెందిన రిటైర్డ్ ప్రొఫెసర్ డాక్టర్ బెంజమిన్ డాగర్‌ను ఆహ్వానించారు. డాక్టర్ సుబ్బారావు పర్యవేక్షణక్రింద పనిచేస్తూ డాక్టర్ డాగర్ బృందం 1945 వ సంవత్సరంలో కొత్త ఏంటిమైక్రోబియల్ 'క్లోరొటెట్రసైక్లిన్'ను కనిపెట్టారు. 1948 వ సం. లో డాక్టర్ డాగర్ న్యూయార్క్ సైన్స్ అకాడమీకి తమ వ్యాసాన్ని సమర్పిస్తూ ఈ పరిశోధనలలో తమకు మార్గదర్శకత్వం వహించిన, ప్రోత్సహించిన డాక్టర్ సుబ్బారావుకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకున్నారు. ఆయన హయాములోనే బోదవ్యాధికి ఉపయోగించే డిథైల్ కార్బమజిన్‌నుకూడా కనిపెట్టడం జరిగింది. ప్రపంచమంతటా లక్షలాది ప్రజలకు ఇది వరప్రసాదంగా పరిణమించింది."

డాక్టర్ సుబ్బారావు సాధారణంగా ప్రతిరోజూ 16 మొదలు 18 గంటలవరకు తమ ప్రయోగశాలలో పరిశోధనలో నిమగ్నులై వుండేవారు. ఈ విధంగా నిరంతరాయమైన పరిశ్రమను ఆయన రెండు దశాబ్దాలపాటు సాగించారు. తత్ఫలితంగా ఆయన ఆరోగ్యం దెబ్బతిని 1948 ఆగష్టులో దివంగతులయ్యారు. ఆయన మరణంతో వైద్య పరిశోధన జగతి ఒక మహనీయుణ్ణి కోల్పోయింది. "శాస్త్ర విజ్ఞానం మానవజీవితాన్ని సుదీర్ఘం చేస్తుంది. మతం దానికి సుదృఢంగా వ్రేళ్ళు పోస్తుంది," అన్న డాక్టర్ సుబ్బారావు ప్రియతమ సుభాషితం పర్ల్రాలోని లెడెర్లే ప్రయోగశాలల గోడలకు వ్రేలాడుతున్న ఫలకాన్ని అలంకరించింది. కలహాలు, కాపట్యాలతో కొట్టుమిట్టాడుతూ ఇంకనూ తన ఆత్మను పరిశోధించుకోవలసే వున్న ప్రపంచానికి శాస్త్రవేత్త, వేదాంతి, మానవతావాది డాక్టర్ యెల్లాప్రగడ సుబ్బారావు ఇచ్చే జీవితసందేశం నిజానికి ఇదే.

# మన జానపద సాహిత్యం

తూమాటి దోణప్ప

పల్లె ప్రజల జీవితం జానపదగేయాలలో వినిర్మలంగా సహజంగా ప్రతిఫలిస్తూ ఉంటుంది. వారి పరిహాసాలు, చమత్కారాలు ఈ గీతాలలో లభిస్తాయి. ఈగేయాలలో భాష చాలా సహజంగా, వినసొంపుగా ఉంటుంది, శ్రోతల హృదయాలలోకి దూసుకు వెళ్ళగల జీవభాష అది. ఇతివృత్తాలకూ, భాషకేకాక చరిత్రగా కూడా జానపద గీతాలు మనకుచాలా ముఖ్యమైనవి.

''బాయికేమో వచ్చినామూ బాయిగంగా మేలుకోయే
బద్దరామూ బాయిగంగా బాలులూ సీభారమమ్మా''

"చీమకన్నుల చీరదేరా పాముకన్నుల పైటదేరా
మల్లిపూలా సరముదేరా మాపిటికి మాయింటికి రారా''

విన్నారా యీపాటలు! తెలతెలవారుతోంది; లేవండిక లేవండి! పల్లెపాటలను విందామని పల్లె పట్టులకి పనిగట్టుకుని వచ్చాంగదూ! మోటనే రాయలసీమలో కపిలె అంటారు. కపిలె తోలుతూ పాడేపాటలే కపిలె పాటలు. వొకొక్క పాట రెండే రెండు చరణాలు. ఈ పాటలు నవరస సీమాపధులూ, నానా రుచిరార్థసూక్తి నిధులూ! కపిలె పాటలు మరి కొన్ని వినండి.

''ఆకులేనీ అడివిలోనా మేకలేలా మేపుతావూ
ఆశలేనీ దానియెంటా దేశమేలా తిరుగుతావూ''

"వూరికీసీ వుత్తరానా వూడలాదీ మర్రిమానూ
వుయ్యాలూగా మనసుబాయే వూపరారా చిన్నవాడా''

## కల్లా కపటంలేదు

పొన్నపువ్వులాగా పొద్దుపొడిచింది. చూశారా పల్లెసిరి పగలబడి నవ్వినట్లు పచ్చని పెచ్చని పంటపొలాలు; పరువుకొచ్చిన చెరకుతోటలూ, పండి వొరిగిన పండ్లతోపులూ, ముంతంత కొప్పులో మొగలి రేకులు ముడిచి, నెత్తి మీద నీళ్ళదుత్తలూ, చల్దిగంపలూ పెట్టుకుని పొలాలగట్ల దారులలో గడుసుదారి పడుచు వొయ్యారులు బారులు దీరి నడుస్తూన్నారు, చూస్తున్నారా ? మిరపపాదులలో, వంగతోటలలో కలుపులు తీయడానికి చిన్నా చితకా, ముసలీముతకా అంతా కదలివస్తున్నారు. పాదుల్లోంచీ కలుపూగాబూ ఏరిపారేసినట్లు, మనసులోంచీ కల్లాకపటం, కసీ కసుమాళం ఏరిపారేస్తారు.

''ధీరుడమ్మ నాగిరెడ్డి సూరుడమ్మ నాగిరెడ్డి
రాజామొనగాడమ్మ జూటూరి చిన్నాగిరెడ్డి

రామరామా కోదండారామా రామరామా కోదండారామా...''

కోటి వీణలు మీటినట్లు, కొండకోనలలో కొదమ కోయిలలు కూసినట్లు, కోటలో నగారా నవుబత్తులు మోగినట్లు ఏమిటీపాట? వోహోఅదా! కలుపు తీస్తూవాళ్ళదో పాటపాడుతున్నట్లున్నారు. ఆ కలుపు పాట విందాం పదండి.

## విషాద గాథ

''రాజామొనగాడమ్మ జూటూరి చిన్నాగిరెడ్డి
గొండ్లోళ్ళాడు బిడ్డ బాలా చిన్నాగమ్మ
రామరామా కోదండారామా రామరామా కోదండారామా...''

పులివాతబడి పతి బలవన్మరణం పొందగా పతివ్రత తల్లి చిన్నాగమ్మ సహగమనంచేసిన విషాదగాథయిది.

''...యింటికాడ చిన్నాగమకు చింతచేసు దోచినాయి
అమ్మలాల వక్కలాల నేనుపక్క కలగంటి

రామరామా కోదండారామా రామరామా కోదండారామా''
అమ్మలాల వక్కలాల నేనుపక్క కలగంటి
యేమీ కలగంటివమ్మ యెర్రి చిన్నాగమ్మ

రామరామా కోదండారామా రామరామా కోదండారామా
యేమీ కలగంటివమ్మ యెర్రి చిన్నాగమ్మ
సేతిలేటి నల్లగాజు సెదిరీ నాల్గోడుకులయ్యో

రామరామా కోదండారామా రామరామా కోదండారామా
సేతిలేటి నల్లగాజు సెదిరీ నాల్గోడుకులయ్యో
అప్పుడు గట్టిన అరటితాళి యిప్పుడు తెగి నేలబడె

రామరామా కోదండరామా రామరామా కోదండారామా

అప్పుడు గట్టిన అరటితోట యిప్పుడు తెగినేలబడె
కాళ్ళేటి కంచుమెట్లు కంచుమించు అయ్యిపాయె

రామరామా కోదండారామా రామరామా కోదండారామా

కాళ్ళేటి కంచుమెట్లు కంచుమింపు అయ్యిపాయె
ముక్కులేటి ముక్కరబోస ముంజేల బడినాది

రామరామా కోదండారామా రామరామా కోదండారామా

ముక్కులేటి ముక్కరబోస ముంజేత బడినాది
నట్టింటగాజు గంటం నగ్గు నుగ్గులయ్యినాయి

రామరామా కోదండారామా రామరామా కోదండారామా...

## కోణంగిపాట

అపుడే పొద్దు పడమటికి వాలిందే! మాపటి వేళ పసుల మందలను ఇంటికి మలిపి, పిల్లంగోవు ఊదుతూ పసుల కాపరులు ఏదో పాటలు పాడుతున్నారు. పరినాట్లువేసి యింటిదారి బట్టిన దోరపయసు పడుచులను పూరించాలనీ, కోరమనసు ప్రౌఢలను పుడికించాలనీ—కొమ్ములదున్నపై సమవర్తిలా కొలువు తీరిన కొంటె కోణంగి వాడదు యెట్లాపాడుతున్నాడో చూడండి.

"గుట్టూరు చెర్వుకింద వోరిమొగుడా
నేను పరిమడినాటబోతి వోరిమొగుడా ॥నేను॥

నలుగుర్ని డాచేసి వోరిమొగుడా
నేను గెనిమెవార మునుం బడితి వోరిమొగుడా ॥నేను॥

నన్ను గొండకాయ తేలుగుట్టె వోరిమొగుడా
నాయేలు బడేపాటు జూడు వోరిమొగుడా ॥నాయేలు॥

నేను వుంటానో పోతానో వోరిమొగుడా

నేను సత్తానో బతుకుతానో వోరిమొగుడా ॥నన్ను॥

నాకు సంగిబంది జేపించు వోరిమొగుడా ॥నాకు॥

నాయేలుబడేపాటు జూడు వోరిమొగుడా
నువ్వెనన కిర్రిలో యునిద్రాద వోరిమొగుడా ॥నువ్వెనన॥

నువ్వు కోరుకొన్న మొగిణివైతె వోరిమొగుడా
నాకు కోడ్ని గోసిపెట్టరాద వోరిమొగుడా ॥నాకు॥

నువ్వు చేసుకొన్న మొగిణివైతె వోరిమొగుడా
నాకు చేపలొండిపెట్టరాద వోరిమొగుడా ॥నాకు॥

నువ్వు అక్కరగల్ల మొగిణివైతె వోరిమొగుడా
నన్ను ఆసపట్ల కంపరాద వోరిమొగుడా ॥నన్ను॥
వోరిమొగుడా వాహోరిమొగుడా వాయ్యారిమొగుడా''

ఈ మహాయిల్లాలు ఎవత్తోగాని వట్టిగయ్యాళి గంపలావుంది. ఈ నయగారాల నంగనాచి, వెర్రివెంగళప్పయైన భర్తను యెలా చెవులుపట్టి ఆడిస్తుందో విన్నారుగా! ఆసపట్ల కంపవలెనట! అబ్బో హాస్పిటలే!

'' పండెండు ధాన్యాలు ఈరాతిపాటా
పదమెత్తి పాడుదమ పదమెత్తి పాడుదమ అత్తమామల్ని
పదమెత్తి పాడుదమ అత్తమామల్ని
తలిసీ పాడారమ్మ తలిసీపాడారమ్మ తలిదండ్రుల్ని ...''

## విసర్రాతిపాటలు

పల్లెటూళ్ళలో గూటిలోదీపం, నోటిలోముద్ద, జొన్నలో, రాగులో తిరగట్లో పోసివిసిరి, జొన్నరొట్టెలో రాగిముద్దలో, చేసుకుని తింటారు పాటకపు జనులు. తిరగలినే మాపక్కల విసర్రాయి అంటారు. విసిరేటప్పుడు స్త్రీలుపాడే పాటలే విసర్రాతిపాటలు. ఇద్దరుగాని ముగ్గురుగాని కల్సివిసుర్తారు. అదిగో, అరుగుమీద తిరగలి విసర్తూ ముగ్గురమ్మలు ముచ్చటగా పాట పాడుతున్నారు. ఈ విసర్రాతిపాటను వినండి.

అన్నగారింట్లోన అమిళ బుట్టిందీ
అడిగిరా అక్కయ్య అడిగిరా అక్కయ్య చేసుకొస్తామూ
అడిగిరా అక్కయ్య చేసుకొస్తామూ
అన్నగారడిగితె అన్నగారడిగితె వోలెంచుదామూ
అన్నగారడిగితె వోలెంచుదామూ
వొదినెగారడిగితె వొదినెగారడిగితె సొమ్ముపెడదామూ
వొదినెగారడిగితె సొమ్ముపెడదామూ
వోలేమిసాలేమి వోలేమి సాలేమి వోయమ్మలారా
వోలేమి సాలేమి వోయమ్మలారా
కందికాయ బూగెండ్లు కందికాయ బూగెండ్లు కాళ్ళ
కడియాలూ
కందికాయ బూగెండ్లు కాళ్ళకడియాలూ
అంటోజి మెట్టెలూ అంటోజి మెట్టెలూ జంపుపిల్లెండ్లూ
అంటోజి మెట్టెలూ జంపుపిల్లెండ్లూ
నూగాయి సరిపెండ్లు నూగాయి సరిపెండ్లు నూటొక్క
మాడా''

## వినోదం—విరామం

పొద్దస్తమానూ రెక్కలువంచి, కష్టించి, డొక్కలు నింపుకునే జానపదులకు రాత్రి కాసేపు వినోదం, విరామం అవసరం.

'' నీకిదండమో నీకిదండమో
నీకిదండమోస్వామి నీకిదండమో
నీకిదండమో రామా నీకిదండమో ...''

రచ్చకట్టకాడ కోలాటం వేస్తాంటే అదామగా, పిన్నాపెద్దా వోహో! వూరు వూరే గుమిగూడినట్లున్నారు. నాడునాడులా వాడవాడలా పేరు పెంపులుగల పెద పెద్ద పెరుమాళ్ళ పేరుచెప్పి యేటి కోళ్ళెత్తుతున్నారు కోలాటం పాటగాళ్ళు, ఆలకించండి.

"...వచ్చేము పొయ్యేము నీకిమొక్కేమూ
వరమియ్యి రాకట్ల వోసుంకులమ్మా
నీకి దండమో నీకి దండమో
నీకి దండమోతల్లి నీకిదండమో
నీకి దండమోతాయి నీకి దండమో

పెనుగొండ బాబయ్యా పెన్నోబళేసా
మార్కాపురం చెన్న సుద్దిలేటయ్యా

నీకిదండమో నీకిదండమో
నీకిదండమో స్వామి నీకిదండమో
నీకి దండమో దేవ నీకిదండమో

బళ్ళారి దురగమ్మ బాటమారెమ్మ
ఆదోని బసుమమ్మ అనిగుందమ్మ

నీకిదండమో నీకిదండమో
నీకిదండమో తల్లి నీకిదండమో
నీకి దండమోతాయి నీకిదండమో..."

అదిగో, ఇంకోపాట అందుకుంటున్నాడు జట్టు నాయకుడు. అవధరించండి.

"కోలు కోలుకోలే కోలనకోలుకోలే
చెలి కోలుకోలే కోలన్న కోలుకోలే ..."

"హెయ్, మద్యాన్నప్పుడెండా మద్యాన్నప్పుడెండా
మనవూరిరచ్చబండా

కొసుకొక్కదండా ఘనమైనపెనుగొండా
కొసుకొక్కదండా ఘనమైన పెనుగొండా॥కోలుకోలు॥...

సద్దంతా అణిగింది, వూరంతా మాటుమణిగింది.

## తాత్త్విక చింతన

సగంసగంకూలిన సత్రం మెట్లమీద కూచుని, ఏక్‌తార మీటుతూ తత్త్వాలు పాడుతున్నాడెవడో వో బైరాగి. సమస్త నదులూ సాగరగర్భంలో సంగమించినట్లు, సర్వ రసాలూ శాంత రసంలో సంలీనమవుతాయని అంటారు అలంకారికులు. ఇదే భారతీయ తాత్త్వికచింతనకు ఉత్తమ ప్రతీక! ఇదే సర్వమానవ పారమార్థిక దృక్పథానికి ఉన్నత పతాక!!



"నాదం బ్రహ్మానందయోగి
యిట్లువాదములేలర వోరిబైరాగి
నాదంబ్రహ్మానందయోగి
వనమూ శ్రుంగారము కోకిలకెరుకాగాని
యిట్లకళ్ళిపుల్లలుయేరే కాకికేమెరుకా॥నాదం॥

పాలానీళ్ళాకలుపు అమిళీ కెరుకాగాని
యిట్లపేడాపురుగులుతినే కోడికేమెరుకా॥నాదం॥
నీళ్ళలోతూ పొడుగూ చేపకెరుకగాని
యిట్ల కడకడగదిరిగేటి కప్పకేమెరుకా॥నాదం॥

నానాకురుసులన్ని నాలుక్కెయెరుకాగాని
యిట్ల కుండాలోదిరిగేటి తెడ్డుకేమెరుకా॥నాదం॥
రాజయోగం బాటతేజీకెరుకాగాని
యిట్ల గడ్డిపాసలుగొరికే గాడ్దికేమెరుకా ॥నాదం॥
నాదం బ్రహ్మానందయోగి
యిట్ల వాదములేలర వోరిబైరాగి
నాదంబ్రహ్మానందయోగి"

బాగా పొద్దుబోయింది. ఇవాళ్టికింతచాలు. మరోసారెప్పుడైనా వద్దాం. ఇక మనవిడిదికి వెడదామా?

# ఉత్తమ చలనచిత్రాలకు రాష్ట్రప్రభుత్వ నంది బహుమతులు

## రవీంద్రభారతిలో కన్నుల పండువుగా బహుమతి ప్రదానోత్సవం



తెలుగు చలన చిత్రాలలో ఉత్తమమైన వాటికి గుర్తింపుగా రాష్ట్రప్రభుత్వం ఏటా యిస్తున్న నంది బహుమతులను ఈ ఏడాది రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి రవీంద్ర భారతిలో ఏప్రెల్ 19న అందజేశారు

"హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమను అభివృద్ధి పరచడానికి రాష్ట్ర ప్రభుత్వం అన్నివిధాలా తోడ్పడేందుకు నిశ్చయించు కుంది"





బహుమతి ప్రదానోత్సవ సందర్భంలో సమాచార, కార్మిక శాఖామంత్రి ప్రసంగిస్తున్న దృశ్యం

రాష్ట్రంలో ముడి ఫిల్మ్ కేంద్రాన్ని నెలకొల్పేవిషయమై కేంద్ర సమాచారశాఖామంత్రి చేసిన సూచననుగూర్చి ప్రస్తావిస్తూ; కేంద్రమంత్రి చేసిన యీ సూచనను చలనచిత్ర పరిశ్రమ సహకారంతో ఆచరణలో పెట్టగలమని శ్రీ కొండా లక్ష్మణ్ తెలియజేశారు



రాష్ట్ర ముఖ్యమంత్రితో బంగారునంది బహుమతి గ్రహీతలు 'రంగులరాట్నం' చిత్రబృందం



ముఖ్యమంత్రి, సమాచారశాఖ మంత్రులతో 'వెండినంది'
బహుమతి గ్రహీతలు 'చిలకాగోరింక' బృందం



ముఖ్యమంత్రితో కాంస్యనంది బహుమతి గ్రహీతలు 'ఆస్థిపరులు' బృందం



మహోఘనత వహించిన మీర్ బర్కత్ అలీఖాన్ బహదూర్ నిజాముల్ ముల్క్ అసిఫ్ VIII హైదరాబాదు నిజాముగా ఏప్రెల్ 6న పట్టాభిషిక్తులయ్యారు.

"భారత రాజ్యాంగంలోని 366 అంశంలోని 22వ క్లాజు ప్రకారం స్వర్గీయ మహోఘనత వహించిన నవాబ్ సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ వారసునిగా మహోఘనత వహించిన నవాబ్ మీర్ బర్కత్ అలీఖాన్ బహదూర్‌ను హైద్రాబాదు పాలకుడుగా 1967 ఫిబ్రవరి 24 నుంచి గుర్తించడానికి భారత రాష్ట్రపతి అంగీకరించారు"



అఖిలభారత చేనేత వారోత్సవ సందర్భంగా హైదరాబాదులో ఏప్రిల్ 9వ తేదీన సమాచార, కార్మికశాఖా మంత్రి ప్రసంగిస్తున్న దృశ్యం

## ఒక దశాబ్ది కాలంలో

# ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన పారిశ్రామిక అభివృద్ధి

తొలి మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలోనూ భారత దేశంలో ఒక గొప్పపారిశ్రామిక విప్లవం వచ్చింది. అప్పుడే పారిశ్రామిక రంగం బహుముఖాలుగా, శీఘ్రతరంగా విస్తరించింది. ముఖ్యంగా ద్వితీయ ప్రణాళికా కాలంలో మరీసీ. ఈ కొద్దిపాటి వ్యవధిలోనే ఒక్కొక్కటి పదిలక్షల స్తోమతగల మూడు ఉక్కు కర్మాగారాలు పబ్లిక్‌రంగంలో నెలకొల్పబడ్డాయి. ప్రయివేటు రంగంలో పనిచేస్తున్న మరో రెండు కర్మాగారాల ఉత్పత్తి శక్తిని రెట్టింపుచేయడం జరిగింది. అంతేకాక భారీ విద్యుత్పరికరాల కర్మాగారాలకు, భారీయంత్ర పరికరాల కర్మాగారాలకు, భారీయింజనీరింగ్ పరికరాల కర్మాగారాలకు, సిమెంటు, కాగితం పరిశ్రమలకు సంబంధించిన ఉత్పాదక యంత్రాల కర్మాగారాలకు తొలిసారిగా శంకుస్థాపనలు జరిగాయి. రసాయనికాలకు సంబంధించిన పరిశ్రమల విషయంలో కూడా యితోధికమైన అభివృద్ధి కనుపిస్తుంది. వివిధపరిశ్రమల ఉత్పత్తులు ఎక్కువగా పెరిగాయి. సైకిళ్ళు, కుట్టు మిషన్లు, టెలిఫోన్లు, ఎలక్ట్రికల్ పరికరాలు, వస్త్రాలు, చక్కెర పరిశ్రమలలో ఉత్పత్తులు అధికమయ్యాయి. మొత్తంమీద 1950–60ల మధ్య సువ్యవస్థీకృతమైన పద్ధతిలో పారిశ్రామికోత్పత్తిని రెట్టింపు చేయడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్‌లోనూ 1956–1966 మధ్యకాలాన్ని అభివృద్ధి దశాబ్దంగా పేర్కొనవచ్చు. ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలు అమలు పరచబడిన ఈ కాలంలో యించు మించు అన్ని రంగాలలోనూ—ముఖ్యంగా పారిశ్రామికీకరణలో—విస్తృతమైన అభివృద్ధి గోచరించింది. రాష్ట్ర ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమల నిమిత్తం రూ. 10.15 కోట్లు కేటాయించబడ్డాయి. అంటే మొత్తం ప్రణాళికా కేటాయింపులో యిది 5.4 శాతంవుంది. తృతీయ ప్రణాళికలో పరిశ్రమలకు కేటాయించిన మొత్తం రూ. 15.62 కోట్లు. అనగా ప్రణాళిక మొత్తంకేటాయింపులో యిది 4.5 శాతం. ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలాల్లో ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ రంగానికి ఎక్కువ ప్రాముఖ్యతను యిచ్చినప్పటికీ విద్యుదుత్పత్తి, రవాణా తదితర సౌకర్యాలువంటి పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడే ప్రాతిపదిక అంశాలకు కూడా యితోధిక ప్రాముఖ్యతను మన ప్రణాళికా వేత్తలు యిచ్చారు. ఈ విషయం ఈ పట్టీని చూస్తే అర్థమౌతుంది.

కోట్ల రూపాయలలో

| | విభాగం | కేటాయింపు | మొత్తం కేటాయింపులో శాతం |
|---|---|---|---|
| 1. | నీటి పారుదలతో సహా వ్యవసాయరంగానికి | 267 | 50.0 |
| 2. | విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు, రవాణా, వార్తాసౌకర్యాలకు | 178 | 33.3 |
| 3. | సాంఘిక సేవా, తదితర కార్యక్రమాలకు | 89 | 16.7 |
| | | 534 | 100.0 |

## రాష్ట్రరంగం

ద్వితీయ ప్రణాళికలో రాష్ట్రంలో రాజమండ్రిలో గల ఆంధ్రాపేపర్ మిల్లు, గూడూరులోని ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీల విస్తరణకు సంబంధించిన పథకాలను చేపట్టారు. ఈ మిల్లుల విస్తరణకు కావలసిన యంత్రాలగురించి పేరిస్‌లోని మెస్సర్స్ ఎంప్సల్ కంపెనీవారితో రాష్ట్ర ప్రభుత్వం 1960లో ఒక ఒప్పందాన్నికుదుర్చుకుంది. ఈ విస్తరణ పథకం తృతీయ ప్రణాళికలో కూడా స్పిల్ ఓవర్ పథకంగా—అంటే ద్వితీయ ప్రణాళికలో అసంపూర్తిగా వున్నభాగాన్ని తృతీయప్రణాళికలో పూర్తిచేసే పథకంగా—అమలుజరపాలని ప్రభుత్వం భావించింది. అయితే 1964 జూలై 11 న, రాజమండ్రి పేపర్ మిల్లు విస్తరణకని యింకా పెట్టుబడి పెట్టదలచక, దానిని ఒక జాయింట్ స్టాక్ కంపెనీకి యిచ్చివేసింది. ఈ కొత్తయాజమాన్యం క్రింద ఈ మిల్లు రోజుకు 100 టన్నుల కాగితాన్ని ఉత్పత్తిచేస్తూ సంతృప్తికరంగా అభివృద్ధిచెందుతోంది. గూడూరులోని పింగాణీ ఫ్యాక్టరీ హైటెన్షన్, లోటెన్షన్ ఎలక్ట్రికల్ ఇన్సులేటర్ల ఉత్పత్తికి సంబంధించి, మన్నికగలశానిటరీ పరికరాల యితోధిక ఉత్పత్తికి సంబంధించి బాగావిస్తరింపజేయడం జరిగింది. 1965–66లో ఈ ఫ్యాక్టరీ రూ. 4,71,690ల విలువగల వస్తువులను ఉత్పత్తిచేసింది.


72--4

## ప్రయివేటు, సహకారరంగాలు

ఈ దశాబ్దంలోనే ఆంధ్రప్రదేశ్‌లో ప్రయివేటు రంగంలోనూ, సహకార రంగంలోనూ అనేక భారీ పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. వ్యావసాయక రాష్ట్రమైన ఆంధ్ర ప్రదేశ్‌లో విశాఖపట్టణంలో ఒకటి, కొత్తగూడెంలో మరొకటి—రెండు ఎరువుల కర్మాగారాలు నెలకొల్ప బడ్డాయి. హిందుస్థాన్ అల్లాయ్ కెమికల్స్ లిమిటెడ్ పేరున ఒక కంపెనీ నమోదైనది. దీనికి ప్రభుత్వ భూమితోసహా వెయ్యి ఎకరాల స్థలాన్ని అందించడానికి ప్రభుత్వం అంగీకరించింది. దిగుమతులపై పన్నులు అధికమైన కారణంగానూ, మరికొన్ని యితర కారణాల వల్లను యింతకు పూర్వం అనుకున్నట్లుగా ముడిసరకుగా బొగ్గును ఉపయోగించే బదులు నాఫ్తాను ఉపయోగించాలని భావించారు. భారత ప్రభుత్వం యిందుకు సమ్మతించింది. అందుచేత యీ కర్మాగార నిర్మాణం చురుకుగా సాగి 1969 నాటికి ఉత్పత్తిని ప్రారంభించ గలదని భావిస్తున్నారు. విశాఖపట్టణంలో నిర్మింపబడుతున్న కోరమాండల్ ఎరువుల కర్మాగారం నిర్మాణం కూడ చురుగుగా కొనసాగుతున్నది. ఇది కూడా ఒక ఏడాదిలో ఉత్పత్తిని ప్రారంభించవచ్చు. గత ఏడాది ఉత్పత్తి ప్రారంభించిన ఇండియన్ డెటొనేటర్స్ లిమిటెడ్‌వారు అమెరికాకు సంబంధించిన ఒక కంపెనీ వారి సహాయంతో అధిక శక్తిగల ప్రేలుడు పదార్థాలను ఉత్పత్తి చేయడానికి ఒక ప్లాంటును నెలకొల్పాలని ఆలోచిస్తున్నారు.

తృతీయ ప్రణాళికాకాలంలో రాష్ట్రంలో సహకార రంగంక్రింద అయిదు చక్కెర ఫాక్టరీలను రాష్ట్రప్రభుత్వం నెలకొల్పింది. వీనిలో చివరిది 1964 నవంబరులో ఉత్పత్తి ప్రారంభించింది. ఇది నిజామాబాదులో నెలకొల్పబడింది. ఒక్కొక్కటి 1,250 టన్నుల చెరకును గానుగ పట్టేశక్తిగల రెండు చక్కెర ఫ్యాక్టరీలను—ఒకటి జహీరాబాదులోను, మరొకటి భీమ్‌సింగిలోను, సహకారరంగంక్రింద నెలకొల్పడానికి భారత ప్రభుత్వం లైసెన్సు మంజూరు చేసింది. సీతానగరం, బొబ్బిలి, సామర్లకోట, చెల్లూరు, తణుకు, చాగల్లు, ఉయ్యూరు, చల్లపల్లిల్లోని సహకార చక్కెర ఫ్యాక్టరీలలో చక్కెర ఆదేశక్తిని విస్తరింపజేయడానికి కూడా భారత ప్రభుత్వం లైసెన్సు యిచ్చింది.

## చట్టబద్ధమైన కార్పొరేషన్లు

రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి మరింతగా అనువైన వాతావరణాన్ని, కల్పించే ఉద్దేశంతో ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్, లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ అనే మూడు కార్పొరేషన్లను ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను 1960 డిశంబరులో నెలకొల్ప బడింది. ఇది పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని కల్పించడమేగాక కొన్ని పరిశ్రమల అభివృద్ధికి నేరుగా తగుచర్యల్ని తీసుకోవడంద్వారాకూడా తోడ్పడుతుంది. నెలకొల్పబడినప్పటి నుంచి రూ 5.41 కోట్ల మేరకు 36 పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని యిది అందజేసింది. ఆర్థిక సహాయాన్ని అందివ్వడమేగాక బాల్‌బియరింగ్, షీట్‌గ్లాస్, హైటెన్షన్ ఇన్సులేటర్ల తయారీకై మూడు కంపెనీలకు ప్రయివేటు రంగంలోని పారిశ్రామిక సంస్థల సహకారాన్ని సమీకరించింది. రాష్ట్రంలో దుక్కయినుము (100,000 టన్నులు), పవర్ కేబిల్స్ (ఏడాదికి 1,860 కి. మీ.), ఎలక్ట్రిక్ మోటార్లు (170—150 రేంజిలో 560 మోటార్లు) సోడాయాష్ (రోజుకు 00 టన్నుల సోడాయాష్, 200 టన్నుల అమోనియం క్లోరైడు)ల ఉత్పత్తులకు సంబంధించిన కర్మాగారాల స్థాపన విషయంలో భారత ప్రభుత్వం వద్దనుంచి లెటర్స్ ఆఫ్ ఇంటెంట్ లభించాయి. ఈ విషయంలో కార్పొరేషన్ పరిశీలనలు జరిపి అవకాశాలను తెలుసుకొని భారతదేశంలోను, విదేశాలలోనుగల సంస్థల సహకారాలను పొందడానికై సంప్రదింపులు జరుపుతున్నది.

ఆంధ్రప్రదేశ్ లఘు పరిశ్రమల అభివృద్ధికార్పొరేషన్ 1960లో నెలకొల్ప బడింది. లఘుపరిశ్రమల అభివృద్ధికి యిది విశేషంగా కృషిచేస్తున్నది. ఇంతవరకు రూ. 78.67 లక్షలమేరకు 107 ఋణాలను యిది మంజూరు చేసింది. ఇది మంజూరుచేసిన రుణాలు యీదిగువ పేర్కొన్నవాటి నిమిత్తమై ఉపయోగింపబడాలి.—

(ఎ) ప్లాంటు, యంత్రాలకొనుగోలు, కూర్పుకు.

(బి) ఫ్యాక్టరీకై స్థలం కొనుగోలుకు.

(సి) ఫ్యాక్టరీ భవనాలతోసహా నిర్మాణపు పనులకు లేదా ఫ్యాక్టరీ భవనాల కొను''లుకు.

(డి) నిర్వహణ పెట్టుబడికి.

(ఇ) కార్పొరేషనుకు సంబధించినబోర్డు అనుమతించిన తదితరమైన ఏవస్తువుల కొనుగోలుకైనా.

ఈ కార్పొరేషను హైదరాబాదు, వరంగల్లు, విజయవాడ, విశాఖపట్టణం, సామర్లకోట, కడపలోగల ఆరు ముడిసరకు సర్వీసింగ్ కేంద్రాల యాజమాన్యాన్ని చేపట్టింది. అంతేకాదు. రాష్ట్రమంతటా వున్నమొత్తం యిరవైఉత్పత్తి యూనిట్ల యాజమాన్యాన్నికూడా చేపట్టింది. దేశవాళీరకాలు, విదేశాలనుంచి దిగుమతిచేసుకునే రకాలకు సంబంధించిన ఫెర్రస్, నాన్ ఫెర్రస్ ముడి పదార్థాలను, కంట్రోలు ముడిపదార్థాలను సేకరించి, లఘుపరిశ్రమలవారికి ఈ సర్వీసింగ్ కేంద్రాలు అందజేస్తున్నాయి. 1962 జూలై 1వ తేదీమొదలుకొని 1966 ఫిబ్రవరినాటికి రూ. 200 లక్షల పైగా విలువచేసే సరుకును సర్వీసింగ్ కేంద్రాలద్వారా లఘుపరిశ్రమలకు అమ్మడంజరిగింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రఆర్థిక సహాయ మండలి యీ పదేళ్ళ కాలంలోనూ రూ. 10.42 కోట్లమేరకు ఋణాలను మంజూరు చేసింది. బియ్యపు మిల్లులు, నూనెగానుగలువంటి సాంప్రదాయక పరిశ్రమలు మొదలుకొని ఎలక్ట్రానిక్కులు, పేల్చుడుకు సంబం

ధించిన సేఫ్టీఫ్యూజులు వంటి శాస్త్రీయ పరికరాలకు సంబంధించిన ఆధునిక పరిశ్రమలవరకు అనేక పరిశ్రమలకు ఈ ఋణాలను మంజూరుచేయడం జరిగింది.

## లఘుపరిశ్రమలు

వ్యవసాయమే ప్రధానమైన మన రాష్ట్రాన్ని పారిశ్రామిక రాష్ట్రంగా మార్చడంలో లఘుపరిశ్రమలు కీలకపాత్ర వహిస్తాయి. ఈ మూలాంశాన్ని దృష్టిలో ఉంచుకొని దిగువ నాలుగు మార్గాల ద్వారా లఘుపరిశ్రమల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం అన్ని విధాలైన సహాయాన్ని అందజేస్తున్నది. (1) లఘుపరిశ్రమల అభివృద్ధికి గల మార్గాలు, నెలకొల్పదగిన లఘుపరిశ్రమలు, అటువంటి పరిశ్రమల ద్వారా లభించేలాభాలకు సంబంధించిన సమాచారాన్ని అందజేసే పథకాలు; (2) లఘుపరిశ్రమలకు ఆర్థిక సహాయం అందజేసే పథకాలు; (3) లఘుపరిశ్రమలకు అవసరమైన భవనాలు, నీరు, విద్యుచ్ఛక్తి వంటి సౌకర్యాలు కలిగించే పథకాలు; (4) లఘుపరిశ్రమలలో పనిచేస్తున్న లేదా పనిచేయకలిగిన పనివారలకు శిక్షణ సౌకర్యం కల్పించే పథకాలు; పైన పేర్కొన్న మొదటి వర్గానికి సంబంధించి పరిశ్రమల శాఖలో సాంకేతిక సెల్‌ను నెలకొల్పడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సెల్‌వారు ఇతర విషయాలతో పాటు వివిధ పెట్టుబడుల స్థాయిలకు చెందిన నమోనా పథకాలను రూపొందించడమే గాక లఘుపరిశ్రమలకు సంబంధించిన అన్ని సమస్యలను గూర్చిన సలహాలను అందజేస్తారు. రెండవ వర్గానికి సంబంధించి, పరిశ్రమలకు రాష్ట్ర సహాయం చట్టం క్రింద ప్రభుత్వం నేరుగా లఘుపరిశ్రమలకు ఆర్థిక సహాయం అందజేస్తున్నది. అంతేగాక ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, రాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్‌ల ద్వారాకూడ ఆర్థిక సహాయం అందజేయబడుతున్నది. గత ఐదు సంవత్సరాలలో పరిశ్రమలకు రాష్ట్ర సహాయం చట్టం క్రింద లఘుపరిశ్రమలకు మొత్తం రు. 36.92 లక్షల సహాయం అందజేయబడింది.

పరిశ్రమలను నెలకొల్పడానికి ప్రోత్సాహం కలిగించే దృష్టితో రాష్ట్రంలో పారిశ్రామిక వాడలను నెలకొల్పే కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ కార్యక్రమం క్రింద పరిశ్రమలకు అనువైన భవనాలను నిర్మించి అద్దెకు ఇవ్వడం, విద్యుచ్ఛక్తి, నీరు మొదలైనవి సరఫరా చేయడం జరుగుతున్నది. గత పది సంవత్సరాలలో (అ) ప్రభుత్వ పారిశ్రామిక వాడలు (ఆ) సహాయక ప్రైవేటు పారిశ్రామిక వాడలు (ఇ) గ్రామీణ పారిశ్రామిక వాడలు నెలకొల్పబడినాయి. దిగువ ప్రదేశాలలో 18 ప్రభుత్వ పారిశ్రామిక వాడలు ఉన్నాయి. (1) సనత్‌నగర్ (2) చందూలాల్ బారాదరీ (3) మౌలాలీ (హైదరాబాదు) (4) కడప (5) కరీంనగర్ (6) మహబూబునగర్ (7) నిర్మల్ (8) మంచిర్యాల (9) వరంగల్లు (10) వికారాబాద్ (11) నిజామాబాద్ (12) పటంచెర్వు (13) సూర్యాపేట (14) కొత్తగూడెం (15) నంద్యాల (16) సామర్లకోట (17) విజయవాడ (18) విశాఖపట్నం. 15 సహాయక ప్రైవేటు పారిశ్రామిక వాడలు దిగువ ప్రాంతాలలో ఉన్నాయి. (1) ఆమదాలవలస (2) విజయనగరం (3) రాజమండ్రి (4) పాలకొల్లు (5) మచిలీపట్నం (6) అనంతపురం (7) ఆదోని (8) చిత్తూరు (9) తిరుపతి (10) ప్రొద్దుటూరు (11) నెల్లూరు (12) గుంటూరు (13) ఏలూరు (14) జనగామ (15) సనత్‌నగర్. నిజామాబాదులోని కిసాన్‌నగర్, అనంతపురం జిల్లాలోని నల్లపల్లిలలో రెండు గ్రామీణ పారిశ్రామిక వాడలు నెలకొల్పారు. సంప్రదాయక పారిశ్రామిక వాడలలో 260 ఫ్యాక్టరీ భవనాలు నిర్మించారు. అందులో 258 కేటాయించబడినాయి. 253 ఫ్యాక్టరీ భవనాలు పని ప్రారంభించాయి. వాటిలో 3800 మందికి ఉపాధి కల్పించారు. సహాయక పారిశ్రామిక వాడలలో 247 ప్లాట్లను అభివృద్ధి పరచారు. అందులో 226 ప్లాట్లను కేటాయించారు. ఇంతవరకు 28 యూనిట్లు పని ప్రారంభించాయి. 268 మందికి ఉపాధి కల్పించారు. పెరుగుతున్న అవసరాలకు అనుగుణంగా భవనాలకు మార్పులు, చేర్పులు చేసుకొని అభివృద్ధి పరచుకోవడానికి వీలుగా పారిశ్రామిక వాడలలోని యూనిట్ల యాజమాన్యం లఘుపరిశ్రమలకే ఇవ్వాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. తదనుగుణంగానే భవనాల అద్దె కొనుగోలు పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఇది పారిశ్రామిక వేత్తలకు మంచి ప్రోత్సాహాన్ని కలిగిస్తుందని చెప్పవచ్చు.

## గ్రామీణ పరిశ్రమలు

గ్రామీణ పరిశ్రమల ప్రణాళికా సంఘం సిఫార్సులను అనుసరించి ఆంధ్ర ప్రదేశ్‌లో నెలకట్టు చేయబడిన ప్రాంతాలలో గ్రామీణ పరిశ్రమలతో సహా లఘుపరిశ్రమల తీవ్రతర అభివృద్ధి నిమిత్తం 1962–63 వ సంవత్సరంలో నల్లగొండ, నరసారావుపేట (గుంటూరు జిల్లా,) అనంతపురములలో మూడు గ్రామీణ పరిశ్రమల ప్రాజెక్టులను ప్రణాళికా సంఘం మంజూరు చేసింది. గ్రామీణ పరిశ్రమల ప్రాజెక్టు ఒక విధంగా ప్రాంతీయాభివృద్ధి పథకమని చెప్పవచ్చు. ఈ ప్రాజెక్టుద్వారా పారిశ్రామికాభివృద్ధి మాత్రమే గాక వ్యవసాయ–పారిశ్రామికాభివృద్ధిని త్వరితగతిని అభివృద్ధిపరచడంలో దోహదం కలిగించే వ్యవసాయం, నీటిపారుదల, కమ్యూనికేషన్స్, విద్యుచ్ఛక్తి సరఫరా, విద్య మొదలైన ముఖ్య రంగాలలోకూడా అభివృద్ధి సాధించడానికి ఉద్దేశించబడింది.

1965–66 సంవత్సరానికి పైమూడు ప్రాజెక్టుల అమలు నిమిత్తం ప్రణాళికాసంఘం రు. 21 లక్షల కేటాయించింది. పాత పథకాల అమలు కొనసాగించడంతో పాటు 1966–67 లో దిగువ తెల్పిన కొత్త పథకాలను చేపట్టాలని ఉద్దేశించారు.

(అ) నల్లగొండలోని అద్దకం, డిజైన్ విస్తరణ కేంద్రానికి అనుబంధంగా ఉత్పత్తి విభాగం (ఆ) అనంతపురం ప్రాజెక్టులో గాజుగుడ్డ ఉత్పత్తి పథకం.

ప్రాంతీయ పారిశ్రామికాభివృద్ధి పథకాన్ని ప్రభుత్వం అమలు జరపడం పారిశ్రామిక వేత్తలకు మరో ప్రోత్సాహకరమైన చర్యగా భావించవచ్చు. ఈ పథకం క్రింద మూడవ ప్రణాళిక ఆఖరు వరకు హైదరాబాదు సమీపంలో దాదాపు 2000 ఎకరాల భూమిని సేకరించి ఉత్సాహవంతులైన పారిశ్రామిక వేత్తలకు కేటాయించారు. అదే విధంగా విశాఖపట్నం సమీపంలోకూడ దాదాపు 1500 ఎకరాల భూమిని సేకరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## కేంద్ర రంగంలోని పరిశ్రమలు

ఇటీవలి కాలంలో కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కేంద్ర పరమైన పరిశ్రమలను నెలకొల్పడంలో కొంత వరకైనా ఆసక్తి కనబరుస్తున్నది. ఉజ్జ్వల భవిష్యత్తుకు యిది శుభారంభంగా భావించవచ్చు.

రాజధానినగరం సమీపంలో రు. 20 కోట్ల పెట్టుబడితో సింథటిక్ ఔషధాల ఫ్యాక్టరీ, రు 35 కోట్ల ఖర్చుతో భారత భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ, హిందుస్థాన్ యంత్రపరికరాల యూనిటు మొదలైనవి ఏర్పాటు కావడంవల్ల భారతదేశ పారిశ్రామిక పటంలో ఆంధ్రప్రదేశ్ కు గౌరవ ప్రదమైన స్థానం లభించింది. రష్యా సహాయంతో నెలకొల్ప బడుతున్న ఔషధాల ఫ్యాక్టరీ గరిష్ఠ స్థాయిలో ఉత్పత్తి ప్రారంభించినప్పుడు దాదాపు 850 టన్నుల సల్ఫా గ్రూపుకు చెందిన సింథటిక్ మందులను ఉత్పత్తి చేసే శక్తి కలిగిఉంటుంది. గత సంవత్సరం ప్రారంభోత్సవం జరిగిన రామచంద్రాపురం ప్లాంటులో వార్షికంగా దాదాపు 800 ఎం. డబ్ల్యు. ల ఉత్పాదక శక్తితో స్టీమ్ టర్బైన్స్, టర్బోఅల్టర్నేటర్లు తయారు చేయడమే గాక, కూలింగ్ వాటర్ పంపులు, ఏర్ జెట్ పంపులు మొదలైన అనుబంధ పరికరాలు కూడ తయారవుతాయి. వార్షికంగా రు. 15 కోట్ల అంచనా విలువగల స్టీమ్ టర్బైన్సు, టర్బో అల్టర్నేటర్లు తయారవుతాయి. హిందుస్థాన్ యంత్ర పరికరాల ఐదవ యూనిటు వివిధ రకాల యంత్ర పరికరాలను తయారు చేస్తున్నది. విశాఖపట్నం, కొత్తగూడెంలో ప్రైవేటు రంగంలో రెండు పెద్ద ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పుతున్నారు. విశాఖపట్నంలో ఫ్యాక్టరీ నిర్మాణం అభివృద్ధిదశలో ఉన్నది. ప్రాగాటూల్స్ కార్పొరేషన్, విశాఖపట్నంలోని నౌకా నిర్మాణ కేంద్రం, సింగరేణి బొగ్గుగనులలో గత దశాబ్దికాలంలో దశలవారీ విస్తరణ కార్యక్రమాలు అమలు జరిగి చెప్పుకోదగిన స్థాయిలో ఉత్పత్తిని ఎక్కువ చేశాయి. రెండవ ప్రణాళిక ఆఖరుకు కేంద్ర ప్రభుత్వం సింగరేణి బొగ్గుగనుల విస్తరణ కార్యక్రమాలకు ఆర్థిక సహాయం అందజేయడమే గాక పెట్టుబడి వాటాలను స్వీకరించడానికి కూడా అంగీకరించింది. తత్ఫలితంగా రాష్ట్రంలో మొదటి ప్రణాళిక ఆరంభంలో బొగ్గు ఉత్పత్తి 12 లక్షల టన్నులు ఉండగా మూడవ ప్రణాళిక ఆఖరుకు 40 లక్షల టన్నులకు పెరిగింది.

భారత ప్రభుత్వ నిర్ణయాన్ని అనుసరించి ఆంధ్ర ప్రదేశ్ లో కేంద్ర పరిశ్రమల రంగంలో దిగువ పరిశ్రమలను నెలకొల్పనున్నారు. విశాఖపట్నంలో రు. 14 కోట్ల ఖర్చుతో స్టీల్ హెవీ వెస్సల్స్ పరిశ్రమలు, హైదరాబాదు సమీపంలో రు 4-కోట్ల పెట్టుబడితో జిర్కోనియంప్లాంటు, రు 2 కోట్లతో సిరిమిక్ ఫ్యూయల్ ఫాబ్రికేషన్ ప్లాంటు, రు 2-కోట్లతో యూరేనియం ఆక్సైడ్ ప్లాంటు, వీటికి తోడు హైదరాబాదు సమీపంలో హిందుస్థాన్ ఏరోనాటిక్స్, డిఫెన్స్ మెటలర్జికల్ రీసర్చి లెబొరెటరి, డిఫెన్స్ రీసర్చి డెవలప్మెంట్ లెబొరెటరీ, డిఫెన్స్ ఎలక్ట్రానిక్ రీసర్చి లెబొరెటరీలను భారత ప్రభుత్వం నెలకొల్పుతున్నది. ఈ విధంగా మన రాజధాని నగరం త్వరలోనే దేశరక్షణ వ్యవస్థలో కీలకస్థానం వహించనున్నది. *

### ఫొటోలు పంపించండి

ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రకటనార్థం కళాత్మకంగా ఉండే ఫొటోలు పంపించండి. మీరు పంపే ఫొటోలు మీరే స్వంతంగా తీసినవై వుండాలి. ఫొటోపేరు, మీ చిరునామా వివరంగా ఫొటో వెనక వ్రాయాలి. ప్రచురింపబడిన ఫొటోకు తగిన విధంగా పారితోషికంయివ్వబడును. ఫొటోలు శ్రీ ఎన్.వి. గోపాలశాస్త్రి, సంపాదకుడు, (ఇంగ్లీషు) ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాదు, చిరునామాకు పంపించండి. తగినన్ని స్టాంపులు జతపరచినప్పుడే ఫొటోలు త్రిప్పి పంపించడం జరుగుతుంది.

# గృహిణి

## పిలకా గణపతిశాస్త్రి

### జరిగిన కథ

పార్థసారథికి నాటకాల పిచ్చి. రాఘవ నాట్యకళా మండలి ద్వారా నాటకాలు వేయిస్తుండేవాడు. నాటకాల రిహార్సల్సులో పడి తరచు రాత్రిళ్ళు ఆలస్యంగా యింటికి వచ్చేవాడు. భార్యా భర్తల మధ్య ఈ విషయంలో పొరపొచ్చాలు వస్తుండేవి. ఒకసారి అతని భార్య విజయలక్ష్మి మేనమామ కొడుకు పెళ్ళికని పుట్టింటికి వెళ్ళింది. పార్థసారథి నాటకంలో వేషం వెయ్యవలసి వచ్చి పెళ్ళికి వెళ్ళలేదు. విజయలక్ష్మి తిరిగి వచ్చేసరికి భర్త నాటకం వేయడానికై పెద్దాపురం వెళ్ళినట్లు తెలిసింది. అయిదు ఎకరాల మాగాణీ పొలాన్ని తెగనమ్మాడని, ఇల్లు తణఖా పెట్టాడని కూడా ఆమెకు తెలిసింది. ఊరినించి రాగానే ఆ విషయం అతన్ని అడిగింది.



పార్థసారథి, భార్యప్రశ్నకే విధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు. వినీ విననట్టు మాట్లాడ కూరుకున్నాడు. అంతలోనే పెద్దాపురంలో ఆడిన నాటకంలో జరిగిన వింత సంగతులు కొన్ని ముచ్చటించడం మొదలుపెట్టాడు. కాని విజయలక్ష్మి తిరిగి అదేప్రశ్న రెట్టించింది. దానితో పార్థసారథి బాగా చిరాకుపడ్డాడు.

'ఎవరు చెప్పారు నీకీసంగతి?'

'ఒకరు చెప్పేదేమిటి? ఊరు, వాడ అంతా కలసి కోడై కూస్తూంటేను!'

అయినా పార్థసారథి దానికేవిధంగాను బదులుచెప్పలేదు. అంతలోనే విజయలక్ష్మి తిరిగి గట్టిగా నిలవరించింది.

'ఆనాటకం అన్నిచోట్ల అంతబాగా ఆడుతూంటే అమాంతంగా ఆ ఇళ్ళు రెండు తెగనమ్మి అయిదెకరాల భూమి తణఖా పెట్టవలసినంతటి అవసరం ఏమివచ్చింది?'

పార్థసారథి ముఖంచిట్లించుకున్నాడు.

'ఆ ఇళ్ళురెండు ఇప్పుడే అమ్మాననని ఎవరుచెప్పారు?..... అవి ఇంతకుమునుపే అమ్మివేశాను!'

విజయలక్ష్మి అసమాధానంతో నిలువునా నిర్ఘాంతపడింది.

'ఇంతకుమునుపే అమ్మివేశారా? నాతో కాస్త చెప్పనయినా చెప్పారుకాదే? అయితే ఆ అయిదెకరాలభూమి తణఖాపెట్టిన మాటకూడ నిజమేనన్న మాట! అంతేనా?'

పార్థసారథి కాప్రశ్నతో చిరాకుతలకెక్కింది.

'అయిదెకరాలు ఎక్కడపెట్టాను! మూడెకరాలే తణఖా పెట్టానుఅంతే!'

'అవిమాత్రం ఎందుకు తణఖాపెట్టవలసి వచ్చింది? ఇక మిగిలిన రెండెకరాలు ఇంతకుమునుపే అమ్మివేశారన్న మాట! అంతేనా?'

దానిమీద పార్థసారథి భగ్గుమని మండిపడ్డాడు.

'ఏదో అత్యవసరంవచ్చి తణఖాపెట్టాను! అవ్వన్నీ నీకెందుకు? నాఇష్టం! ఇంట్లో అడుగు పెట్టానోలేదో! అప్పుడే మొదలయింది దరిద్రపుగోల!'

పార్థసారథి అక్కడినించి వెళ్లిపోవాలని తటాలునలేచి నిలుచున్నాడు! ఆధోరణితో విజయలక్ష్మికి కళ్ళమ్మట నీళ్లపర్యంతము అయింది.

'ఎందుకలాగ ముఖంచిట్లించుకుంటారు! ఇంతకి నేనేమన్నానని? పిల్లలు బయలుదేరుతున్నారుగదా. ఆ స్థితిఏమయిపోతుందో అన్నభయంకొద్ది అడిగాను అంతే! అంత నేనంటే

మీకిష్టంలేకపోతే చెప్పండి। మావాళ్లింటికి వెళ్లిపోతాను। నాకేంగతి కడుపుక్కువపోలేదు। ఇంకపొద్దస్తమానమూ ఆ సరోజతోనే కులుకుతూ కూర్చుందురుగాని।'

ఆ చివరివాక్యం విని వినగానే పార్థసారథి తోకతొక్కిన తాచులా కస్సుమనిలేచి చరచరానడిచి వీధిగుమ్మందాకా వెళ్లిపోయాడు। చెక్కిళ్ళపై ప్రవహిస్తున్న వేడివేడి కన్నీటితో విజయలక్ష్మి కూడా వెను వెంటనే అతని వెంటవెళ్లి అడ్డుకుని తడబడుతున్న గద్గద స్వరంతో అడిగింది.

'ఎక్కడికలాగ బయలుదేరుతున్నారు ? ఇంతకీ నేను ఏమన్నానని ! అనునుమరి! ఉన్నమాట అంటే ఎవరికైనా ఉలుకెక్కువవుతుంది।'

'ఆసరోజతో కులుకుతూ కూర్చోమన్నావుగా ! అక్కడికే వెడుతున్నాను।'

'వల్లకాదు। ఇక ఈ వేళనుంచి మీరు దాని ఇంట్లో అడుగు పెట్టడానికి వీలులేదు।'

విజయలక్ష్మి ఇనుమడించిన దగ్గుత్తికతో అతని దారికడ్డుగా నిలబడింది.

'మధ్యన నీ ఇష్టమేమిటి? నాఇష్టంవచ్చినచోటికి వెడతాను।'

'ఏది ఏమయినాసరే, ఇంకమిమ్మల్ని అక్కడికి వెళ్లనివ్వను।'

విజయలక్ష్మి అతని చెయ్యిపట్టుకుని గట్టిగానిలవరించింది.

'మీవాళ్లింటికి వెళ్లిపోతానన్నావుగా। వెళ్లిపో వెంటనే ఇప్పుడే వెళ్లిపో'।

పార్థసారథి తీవ్రంగా గద్దించి, దురుసుగా విదిలించి భార్య చేతిపట్టు విడిపించుకుని ఒక అంగలో వీధిలోకి వెళ్లిపోయాడు। దానితో విజయలక్ష్మి ధబాలున నేలమీద కూలబడిపోవలసిందే। కాని తలుపు చేతోపట్టుకుని అతి కష్టంమీద నిలబడగలిగింది కాని భర్త కనుచూపుమేర దాటిపోయిన తరవాత మరి నిలబడలేక కుప్పగా నేలమీద కూలబడి కుమిలి దుఃఖించింది.

లోపలినిం[illegible] కొంతవరకు చూచాయగావిన్నవర్ధనమ్మ వెంటనే అక్కడికి వచ్చి మనవరాలి పరిస్థితిగమనించి క్షణకాలం నోటమాట వె[illegible] నిలువునా నిర్ఘాంత పడింది.

'ఏమిటే అమ్మడు ఏమిజరిగింది। ఎందుకిలాగ రాగాలు పెడుతున్నావు? అతనెక్కడికి వెళ్లాడు।'

విజయలక్ష్మి ఆప్రశ్నలకన్నింటికి వెంటనే సమాధానం చెప్పలేదు. వర్ధనమ్మ తిరిగి తిరిగి ప్రశ్నించిన తరవాత జరిగినదంతా సంగ్రహంగా వెల్లడించింది. అమ్మమ్మ మళ్లీ మళ్లీ అడిగి ఆగొడవ అంతా ఆకళించుకుని ప్రాణాలన్ని ఒక్క మారుగా ఎగిరిపోయేటట్టు ఉసూరని నిట్టూర్చింది.

' చూడమ్మా ! ఇలాంటప్పుడు అతన్ని అదేపనిగా రెచ్చగొట్టావంటే మరింతగా తాదుబారిపోతాడు. అయినదేదో అయిపోయింది. అనవసరంగా సంసారం గొడవ చేసుకుంటేమాత్రం పోయిన ఆస్తి తిరిగి వస్తుంది కనకనా ? నామాట వినుతల్లీ ! అతన్నింక ఏమీ అనకు. చూసీ చూడనట్టు మాటాడ కూరుకో ! పోనీ ఈవేళకికాకపోతె రేపటికయినా దారికి రాకపోతాడా ? అతనికి మాత్రం సంసారంబాధ్యత తెలియదూ ? ఒకవేళ తెలియకపోతే మాత్రం। మనం చెయ్యగలిగింది ఏమిటిచెప్పు !...... ఇంతకీ ఏది ఎలా జరుగవలసి ఉంటే అలాగ జరుగుతుంది........ అయ్యో ! మనవల్ల ఏమవుతుందే వెర్రిదానా ! నామాటవిని కొంత ఓపికపట్టుతల్లీ !'

'పుట్టింటికి పోపొమ్మని దులిపివేసిన తరవాతకూడా ఇక్కడే పడి ఉండమన్నావా ? నేనిక ఒక్కక్షణంకూడా ఇక్కడ ఉండలేను !'

విజయలక్ష్మి లోలోపలినుండి ఉప్పొంగుతున్న దుఃఖం నిగ్రహించుకోలేక ముఖంమీద చీర చెరగు అడ్డుపెట్టుకుని [illegible] స్వరంతో వాలిడిచి విలపించింది. అమ్మమ్మ మనవరాల్ని [illegible] ఆప్యాయంగా అక్కున చేర్చుకుని, తానుకూడా కంటనీరు పెట్టుకుని తడబడుతున్న మాటలతో ఓదార్చింది.

'అయ్యో ! అతనికి సంసారబాధ్యత తెలియకపోతే నీకయినా తెలియకపోతే ఎలాగ ! ఈసమయంలో ఇక్కడినించి కదిలావంటే అతనికింక పట్టపగ్గాలుంటాయా ? తప్పమ్మా ! శుభమల్లే అలాంటిమాట అనుకోకూడదు ? ఇంటికి వెడితే మాత్రం అక్కడ ఎంతకాలమని ఉండగలవే ! పిల్లలిద్దరు తండ్రి కోసం బెంగపెట్టుకుని బెంబేలు పడిపోరు ? వాళ్ళదాకా ఎందుకు ? నువ్వు ఏమాత్రం అతనిని విడిచిపెట్టి ఒక్క క్షణమయినా ఉండగలవా ? నామాట వినమ్మా ! కొంచం సంబాళించుకోతల్లి ! నీ రాగాలతో పసిపిల్లలిద్దరు దిగాలుపడిపోయి కూర్చున్నారు చూశావా ? నెమ్మదిగా అతనికి నచ్చచెప్పి సంసారం చక్కబెట్టుకోవాలిగాని, ఇలాగ తొందరపడితే లాభమేమిటిచెప్పు !'

విజయలక్ష్మి ఇక మాట్లాడలేదు. మరికొంత సేపటివరకు అలాగే కుమిలి కుమిలి దుఃఖించింది. వర్ధనమ్మ తిరిగి అనేక విధాల నచ్చచెప్పింది. మగవాళ్లు ఎలాంటి పోకిళ్లు పోయినా చూసీ చూడనట్టు మాట్లాడ కూరుకునేవాళ్లు అనేకమంది ఉన్నారని కొన్ని ఉదాహరణలిచ్చి, తమాయించక తప్పదని ఓదార్చింది. ఆవిధంగా మరికొంత సేపు బతిమాలుకున్నతరవాత విజయలక్ష్మి [illegible] శాంతించింది.

మరికొంత సేపటికి కామెకు అమ్మమ్మచెప్పిన చివరిమాటల్లో [illegible]ంత ముందుచూపు లేకపోలేదని స్ఫురించింది. అవును ! తానిప్పుడు తొందరపడి పుట్టింటికి వెళ్ళినంతమాత్రాన భర్త ప్రవర్తన మారగలదన్న నమ్మకమేమిటి ? పైగా అది మరింతగా మితిమీరి పోవచ్చును ! అసలే పుట్టెడుసంసారం జంజాటంతో సతమతమౌతున్న తండ్రి, తనని, పిల్లల్ని ఎంతకాలమని దగ్గిర అట్టే బెట్టుకోగలరు ? అమ్మమ్మ అన్నట్టు తాను మాత్రం క్షణమయినా భర్తని విడిచిపెట్టి ఉండగలదా ?

ఆసంగతి తెలుసుకోగానే విజయలక్ష్మి చెక్కిళ్ళమీద వేడి వేడి కన్నీరు ధారకట్టి ప్రవహించింది. కనకనే తానంత అలుసయి పోయానని ఉసూరుమని వేడి నిట్టూర్పు విడిచిపెట్టింది. ఇక అప్పటినించి భర్త ఎప్పుడింటికివచ్చినా, ఏమిచేసినా మరి ఆగొడవలేవి తలపెట్టకుండా మాట్లాడకూరుకోవాలని నిశ్చయించుకుంది. ఆ తరవాత మాటలసందర్భంలో అణగించి వేసుకున్న గద్గదికతో అదేసంగతి అమ్మమ్మతో చెప్పింది. వర్ధనమ్మకూడా అంతకన్న గత్యంతరమేమీ లేదని గట్టిగా నచ్చచెప్పింది. యథా ప్రకారంగా పార్థసారథి ఆవేళకూడా రాత్రి పదిగంటలు దాటిన తరవాతగాని ఇంటిలో అడుగు పెట్టలేదు। అయినా విజయలక్ష్మి ఆవిషయం గమనించినట్టే కనబడలేదు.

* * *

విదూషకపాత్రధారి వెంకటనారాయణ మేష్టరు చెప్పిన మాటలు విన్నతరవాత రాఘవకెంతయినా ఆశ్చర్యం కలిగింది. అతడు తన నాటక కళామండలి స్థాపించి నప్పటినించి దానిలోచేరిన మనిషి. ఈనాటివాడుకాడు। పైగా వెంకటనారాయణ ఇన్నాళ్ళనించి ఇంకొకరి గోడవే పట్టించుకోలేదు. తనకిచ్చిన వేషం సంగతి చూసుకోవడమేగాని అతనికింకొక గోడవే అక్కరలేదు।

అటువంటి వాడీనాడు తనకెంతో అన్యాయం జరిగినట్టు మాట్లాడుతున్నాడు। 'పైగా పార్థసారథి సరోజ ఏకమై నిన్నుకూడా మోసగిస్తున్నారనే నా నమ్మకం। జాగ్రత్త। కొంచం ఒళ్లు దగ్గరపెట్టుకుని మసులుకో।' అనికూడా హెచ్చరించాడు. ఆ ధోరణిని బట్టిచూస్తే వెంకటనారాయణ కెంతో అసంతృప్తి కలిగినట్టు స్పష్టపడుతున్నది। అతడన్న మాటలన్ని నిజమేనా? లేక ఉన్నవి నాలుగు లేనివి నాలుగు కల్పించి అలాగ తన అక్కసంతా వెళ్లబోసుకున్నాడా? ఏదో కొంతయినా అన్యాయం జరిగి ఉండకపోతే అతని కంతటి అసంతృప్తి ఎందుకు కలుగుతుంది?' అంతకు మునుపే వెంకటనారాయణని వీధిగుమ్మందాకా వెళ్లి దిగబెట్టివచ్చిన రాఘవ పడక కుర్చీలో చేరగిలబడి సిగరెట్టు ముట్టించి రెండు మూడు దమ్ములు లాగి తీవ్రంగా దీర్ఘాలోచనలోపడ్డాడు. ఎంతసేపాలోచించినా అతనికేమి అంతుచిక్కలేదు।

వెంకటనారాయణ ప్రత్యేకంగా పనికట్టుకుని వచ్చి రాఘవతో అతిరహస్యంగా పూసగుచ్చినట్లు చెప్పిన సంగతుల సారాంశమిది. ఇటీవల కృష్ణతులాభారం ఆడినచోటల్లా చాలావరకు చక్కగానే రక్తి కట్టింది. అందుచేతా పార్థసారథి పెట్టుబడిపోగా బాగా రెండుచేతులా డబ్బు గుంజుకుంటున్నాడు। కనక తనకివ్వ నిర్ణయించిన ప్రతిఫలం కాక, ఇంకా ఎక్కువగా ముట్టజెప్పవలసినదని మేష్టరు అతన్నినోరు విడిచి అడిగాడు.

పార్థసారథి దానిమీద ఎంతో చిరాకుపడి 'వెంకటనారాయణా। ఈ మధ్యన సొమ్ముకొంచెం ఎక్కువగా చేతికి రాగానే సరా. రేపు ఇంకొకచోట ఎక్కడయినా దండుగవస్తే ఎవరు భరిస్తారు? అత్యవసర మయినప్పుడు నేనీమధ్యన నాటకాలకోసం మూడెకరాల భూమి తాకట్టుపెట్టి ఆదుకున్నాను. ఆ అప్పు తీరిన తరవాత ఏమయినా మిగిలితే తప్పకుండా మీ కెక్కువగా సొమ్ము ముట్టజెపుతాను। అంతవరకు మీరందరు కొంచెం ఓపిక పట్టక తప్పదు' అని తటాలున ఆవ్యవహారం అంతటితో తుంచివేశాడు.

అయితే పార్థసారథి అంతకుమునుపే శచీదేవి వేషం వేసిన చిట్టెమ్మతోబాటు మరి కొంతమందికి కొంచెం ఎక్కువగా ప్రతిఫలం ముట్టజెపుతున్నట్టు వెంకటనారాయణకి తెలిసింది. అంతేకాదు। సరోజకి అంతకిమునుపు ఇస్తున్నమొత్తంకన్న మూడు రెట్లు ఎక్కువ సొమ్ము ఇస్తున్నట్టుకూడా పొక్కింది. అయినా వెంకటనారాయణ ఆసంగతులేవి ఉటంకించలేదు। అధమం చిట్టెమ్మకిచ్చినంతయినా తన కివ్వడం న్యాయమని ఆశించాడు అయినా అమాట అనకుండానే తన సంసార జంజాటం సంగతి ప్రస్తావించి కొంచెం సాయపడవలసినదని తిరిగి ప్రతిమాలుకున్నాడు। కాని పార్థసారథి దానికయినా తిన్నగా సమాధానం చెప్పక ఏదోతొందరపని ఉన్నదని విసుక్కుని వెనువెంటనే అక్కడినించివెళ్లిపోయాడు। అయినా వెంకటనారాయణ నిరుత్సాహ పడలేదు. సరోజ సిఫారసు పార్థసారథి శిరసావహించగలదన్న ఆశతో ఒకసారి ఆమె దగ్గరికివెళ్లి తనగోడంతా వెళ్లబోసుకున్నాడు కాని దానివల్లకూడా ప్రయోజనం కలగలేదు। చిట్టచివరకి సరోజ పార్థసారథి నే సమర్థించింది.

అతని ముఖతావిన్న అగోడుసంగతి ఆలోచిస్తూంటే మేష్టరుమీద రాఘవ కెంతయినా జాలివేసింది. కొద్దో, గొప్పో మిగిలినవాళ్ల కిచ్చినప్పుడు, పాపం, పిల్లలుకలవాడు వెంకటనారాయణకికూడా కొస్త విదిపితే ఏంపోయింది। లోలోపల పార్థసారథిమీద కొంచెంవిసుక్కున్నాడు రాఘవ. కాని అంతవరకు వచ్చినతరవాత తాను కలుగజేసుకుంటే ఆ వ్యవహారం మరింతగా విషమించగలదనిచెప్పి అప్పటికి తప్పించుకున్నాడు. అయితే మరికొన్నాళ్లుగడిచిన తరవాత పార్థసారథితో చెప్పి తప్పకుండా కొంతయినా సాయంచేయించగలనని మాటయిచ్చాడు.

తిరిగి ఇంకొక సిగరెట్టు ముట్టించి జోరుగాదమ్ములాగి దీర్ఘాలోచనలో పడ్డాడు రాఘవ. సరోజ, పార్థసారథి కలిసి తనని మోసగిస్తున్నారని వెంకటనారాయణ చేసిన హెచ్చరికతో కొంత కాకపోయినా కొంతయినా నిజంఉండి తీరిందని అతనికప్పటికొక నిశ్చయంకలిగింది. లేకపోతే కొంతమందికి సొమ్మెక్కువగా ముట్టజెపుతున్నట్టు పార్థసారథికాని, సరోజకాని, చూచాయగానయినా తన చెవిని వెయ్యకపోవడాని కేమిటికారణము? తనకికూడా ఎక్కువసొమ్ము ఇవ్వవలసి వస్తుందన్న కారణంవల్లనే వాళ్లిద్దరు కలిసి ఆ సంగతి అంతగుంభనగా దాచివేశారని రాఘవ గట్టిగాఅనుమానించాడు. దానితో అతనికి ఆ ఉభయులమీద ఎంతయినా అక్కసుకలిగింది.

ఇన్నాళ్లనుంచి పార్థసారథి, రాఘవ, సరోజ ఏ విధమయిన ఎరమరికలులేకుండా నాటకం వ్యవహారం అంతా నిమ్మకి నీరెత్తినట్టు కొనసాగించారు. ఇంతకు మునుపెన్నడు రాఘవ తనకింత సొమ్ము ఇవ్వాలని సూచించడం కూడా జరగలేదు. నిజానికి అతడెన్నడు ఆగోడే పట్టించుకోలేదు తమ మండలి పేరు

పైకి రావాలన్న ఉత్సాహం. దానితోబాటు తనకింకా గొప్ప పేరు రావాలని ఉబలాటం పెద్ద ఉంది.

అలాంటప్పుడు వాళ్లిద్దరు ఏకమై అంత రహస్యంగా వ్యవహరించవలసినంత అవసరం ఏమి వచ్చింది? ధన లాభంతో బాటు మరి తమరిద్దరు పేరన్న భావం బలిసిపోయింది కాబోలు! లేక తమరిద్దరు అసాంతంగా మహా నటీ నటుల మయిపోయామన్న అహంభావం పెరుగుతుంది కాబోలు! సరోజ ఇటీవల ఒకసారి తనవంటి గొప్ప నటీమణి ఇక పుట్టబోదన్నట్టు మాట్లాడింది! అవిడగారి కప్పుడే తలబిరుసెక్కువయింది! అప్పాటయినా గడవక బాధపడుతూ ఎక్కడో ఒక మూలమూల పడిఉన్న దానిని తానే సరా సయుగురిలోకి తీసుకువచ్చి పార్థసారథితో పరిచయం కలిగించింది! ఆ వెనకటి కథ అంతా అప్పుడే పూర్తిగా మరిచిపోయినట్టుంది! ఎంతలో ఎంతటి విడ్డూరమయిన మార్పు వచ్చింది!

అందరికన్న గొప్పగా నటించగలిగినా తన కెందుచేతనో తగినంత పేరు, ప్రతిష్ఠ రాలేదని రాఘవ అంతకు మునుపే ఎంతో మథనపడుతున్నాడు! పార్థసారథి పట్టి చూపుల గుర్రమే కాని అతనికి తగినంత నటన శక్తి లేదని అతని గట్టి నమ్మకం! అయితే సాగతీ కనుముక్కు తీరులో గల అందమే గొప్ప అభినయమని ప్రేక్షకులందరు భ్రమిస్తున్నారని కొంతవరకు సరిపెట్టుకున్నాడు!

కాని ఎక్కడికి వెళ్లినా సరోజా పార్థసారథుల పేరు ప్రతిష్ఠలే వినబడడంవల్ల అతని మనస్సులో మథన నానాటికి ఇనుమడించింది! పైగా ఇప్పుడిద్దరు కలిసి తన కన్యాయం చేస్తున్నారన్న అనుమానం బలపడడంతోనే అతని గుండెలో అది కళుక్కుమని వేధించింది! దాని కిప్పటి అక్కసు కూడా తోడయింది! అదే సమయంలో అతనికి వెంకటనారాయణ మాటలలో నిజం ఎంతవరకు ఉన్నదో లోతుగా ఆరా తీయాలన్న ఆరాటం కలిగింది.

వెంటనే బయలుదేరి తిన్నగా పార్థసారథి దగ్గరికి వెళ్ళి ఆ సంగతులన్ని కుండ బద్దలుకొట్టినట్టు నిర్మొహమాటంగా అడిగివెయ్యాలని తీర్మానించుకున్నాడు. కాని అంతలోనే లోతుగా నిజా నిజాలు తెలియకముందే తొందరపడడం మంచిదికాదని తనూయించుకున్నాడు. అయితే సరోజ ఇంటికి వెళ్లి ఆ వ్యవహారం చూచాయగా ప్రస్తావించి తేలికగా కూపీ తీయవచ్చునని ఒక ఆలోచన కలిగింది. అప్పటి కప్పుడే కొంచెం చీకటి పడింది. మరి ఆలస్యమెందుకని అనుకుని ఇప్పుడే వస్తానని భార్యతో చెప్పి సరోజ ఇంటికి బయలుదేర బోయాడు.

అదే క్షణంలో అతనికి తన దుస్తులన్ని బొత్తిగా మాసిపోయాయన్న అభిప్రాయం కలిగింది. త్వరగా అవి మార్చుకుని, అద్దం ముందు నిలబడి చిందర వందరగా ఉన్న క్రాపు తిన్నగా దువ్వుకుని ఒకే ఒక్క అంగలో వీధిలోకి వెళ్లిపోయాడు! దారిలో అతని హృదయంలో చిత్ర చిత్రమయిన ఆలోచనలెన్నో చెలరేగాయి.

అతని నెన్నడు సరోజ అంతగా ఆకర్షించలేదు. అందు చేతనే పార్థసారథి కామెయెడల కలిగిన విపరీతమయిన వ్యామోహం రాఘవ కెంతో ఆశ్చర్యం కలిగించింది. ఆమెలో ఒక విధమయిన చక్కదనం లేకపోలేదని అనుకున్నాడు. కాని అంతగా తలకిందులయిపోవలసి నంతటి అంద చందాలేవి లేవని నవ్వుకున్నాడు. అయితే సరోజ చలాకీతనము, చాక చక్యము, ఎల్లప్పుడు కులాసాగా కనిపించే నవ్వుముఖము అతని నెక్కువగా ఆకర్షించి ఉండవచ్చునని నిర్ణయించుకున్నాడు. వెంకట నారాయణ చెప్పిన విడ్డూరాలన్ని వినగానే రాఘవ కామెమీద ఎంతయినా కోపం వచ్చింది.

(సశేషం)

---

పట్టుదలను ధర్మాచరణముతో సంబంధించిన ముఖ్యాంశములలో జూపుట యావశ్యమును కర్తవ్యమునేయైనను, ధర్మభంగములేని యల్పాంశములలో జూపుట యనాదరణీయమును మూర్ఖత్వమును నగును. నీతికిని సత్యమునకును ధర్మమునకును భంగముకలుగని విషయములలో నెల్లను బహుజన వాక్యమును మాననీయముగా భావించి తదనుసారముగా పెద్దలకు లోబడి నడచుట కర్తవ్యము.

—కందుకూరి వీరేశలింగము

# మేలురకం వంగడాలు ఇస్తున్న సత్ఫలితాలు

భారతదేశంలో వరి పండిస్తున్న భూమిలో 9.6 శాతం విస్తీర్ణం ఆంధ్రప్రదేశ్‌లో వుంది. దేశంలో వరి పండించే రాష్ట్రాలలోని విస్తీర్ణం దృష్ట్యా ఆంధ్రప్రదేశ్ ఆరవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో పండించెడి ప్రధానమైన పంటలలో వరి అగ్రస్థానాన్ని అలంకరిస్తుంది. 1964_65 (1374 ఫసలీ) సంవత్సరంలో, మొత్తం పంట భూమిలో 27.1 శాతం విస్తీర్ణంలో వరి పండించారు. అంతక్రితం సంవత్సరంలో ఈ పైరు 26.3 శాతం విస్తీర్ణంలో వేశారు. కాగా సగటు విస్తీర్ణం శాతం 26.2. రాష్ట్రంలో వరిపైరు వేసిన మొత్తం విస్తీర్ణంలో 91.9 శాతం విస్తీర్ణానికి 1964_65 వ సంవత్సరంలో నీటి పారుదల కల్పించారు. అంత క్రితం ఏడాదిలో నీటి పారుదల కల్పించిన విస్తీర్ణం శాతం 89.9.

రాష్ట్రంలోని 20 జిల్లాలలోనూ వరి పండిస్తారు. రాష్ట్రంలో ఈ పైరు వేసిన మొత్తం విస్తీర్ణంలో 54.7 శాతం విస్తీర్ణం ఆంధ్రప్రాంతంలోని శ్రీకాకుళం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలోనేవుంది. వరిని సాధారణంగా కాలువలు, చెరువుల క్రింద నీటిపారుదల జరిగే మాగాణి భూములలో పండిస్తారు. ఈకాలువలు, చెరువులు వర్షాలపై కానీ, లేదా నదులపై కానీ ఆధారపడి వుంటాయి. కొన్ని ప్రాంతాలలో పాక్షికంగా నీరు లభించే పరిస్థితుల్లోకూడా ఈ పైరు వేస్తారు. తెలంగాణాలో, శీతాకాలపు పంట అని కూడా వ్యవహరించ బడుతున్న ఆబీ లేదా వర్షాకాలపు వరిపైరును జూన్ నెలాఖరులో వేస్తారు. నవంబరు, డిశంబరు నాటికి ఇది చేతికి వస్తుంది. తాబీ లేక వేసవి వరిపైరును డిశంబరులో వేస్తారు. మార్చి ఏప్రిల్ నాటికి పంట సిద్ధమవుతుంది ఇదేవిధంగా ఆంధ్ర ప్రాంతంలో మొదటి పంట కాలం జూన్_అక్టోబరు కాగా రెండవ పంటకాలం డిశంబరు_ఫిబ్రవరి. మొదటి పంట కోతలు సాధారణంగా నవంబరు_డిశంబరునెలలలో జరుగగా రెండవ పంట కోతలు మార్చి_మే నెలలలో జరుగుతాయి.

1955_56 వ సంవత్సరం నుంచి 1965_66 వ సంవత్సరం వరకు గడచిన ఒకదశాబ్దిలో ఆంధ్రప్రదేశ్‌లో వరి పండించిన విస్తీర్ణంలోనూ ధాన్యం దిగుబడిలోనూ క్రమేపీ పెరుగుదల ఏర్పడింది. వ్యాసం చివర మొదటి పట్టికలో ఇచ్చిన వివరాలు ఈ అంశాన్ని వెల్లడిస్తాయి. ఈ క్రింద ఇచ్చిన పట్టికలో రాష్ట్రంలో 1964_65 వ సంవత్సరంలో జరిగిన వరి ఉత్పత్తికి సంబంధించిన వివరాలు పొందు పరచబడినాయి. గత సంవత్సరంతో పోల్చి చూచినప్పుడు రాష్ట్రంలో బియ్యం ఉత్పత్తిలో 15.3 శాతం పెరుగుదల ఏర్పడింది. అప్పుడు ఋతు పరిస్థితులు అనుకూలంగా వుండడం సకాలంలో వర్షాలు కురియడాన్ని ఈ పెరుగుదలకు కారణాలుగా పేర్కొనవచ్చు. మొత్తం ఉత్పత్తిలో 51.3 శాతం ఉత్పత్తి శ్రీకాకుళం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే జరిగింది.

ఇటీవల ఏర్పడిన అనావృష్టి పరిస్థితులు ఉత్పత్తి పెరుగుదలకు అవరోధం కలిగించాయి.

| క్రమ సంఖ్య | సంవత్సరం. | విస్తీర్ణం. (ఎకరాలలో) | దిగుబడి. (టన్నులలో) | ఎకరాసగటు దిగుబడి. (పౌనులలో) |
|---|---|---|---|---|
| (1) | 1964_65 | 85,50,050 | 49,27,758 | 1291 |
| (2) | 1963_64 | 82,97,731 | 42,74,410 | 1154 |
| (3) | సగటు | 80,21,100 | 40,54,470 | 1132 |

ఏ కార్య క్షేత్రంలోనైనా అభ్యున్నతి సాధించడానికి పరిశోధన చాలా అవసరం. కాగా వ్యవసాయరంగంలో ఇది సర్వతోముఖాభివృద్ధికి కీలకం. వ్యవసాయ రంగంలో అభివృద్ధి పొందడానికి వినూత్న ఆలోచనలు, విధానాలు, పరికరాలు నిరంతరం అవసరమౌతాయి. కనుకనే ఇటీవల వ్యవసాయ పరిశోధనకు అత్యధిక ప్రాధాన్యం లభిస్తున్నది. ముఖ్యంగా పంచవర్ష ప్రణాళికా పథకాల క్రింద దీనికి విశేష ప్రాముఖ్యం చేకూరుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో అనేక పరిశోధన కేంద్రాలను నిర్వహిస్తున్నారు. పైరు అభివృద్ధికి సంబంధించి విభిన్న అంశాలపై విస్తృత ప్రాతిపదికపైన వీటిలో పరిశోధనలు జరుగుతున్నాయి. వేరు వేరు పంటలకు సంబంధించి, భూములలో విభిన్న పరిస్థితులకు అనుకూలమైన మేలురకం వంగడాలను ఈ కేంద్రాలు కనుగొన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో వరి విషయంలో 81 మేలు రకాలు, జొన్న విషయంలో 25 మేలు రకాలు, ఇతర పైర్ల విషయంలో 47 మేలు రకాలు సేద్యంలో వున్నాయి.

## పదిలక్షల టన్నుల పెరుగుదల

దిగుబడులను రెండు మూడింతలకు పైగా సాధించడంలో ఈ మేలురకం వంగడాలు సత్ఫలితాలు పొందుతున్నాయి. తైచుంగ్ నేటివ్ —1, తైచుంగ్ 65, తైనాన్–2, తైనాన్ –3 వంటి మేలు రకం వరి వంగడాలు ఎకరానికి సగటున 5000 పౌనులు మొదలు 7000 పౌనులు వరకు దిగుబడి నిచ్చాయి. రాష్ట్రపు సగటు ఎకరా దిగుబడి 1600 పౌనులు. మేలు జాతి విత్తనాల ప్రాముఖ్యం దృష్ట్యా రాష్ట్రంలో మేలు రకం వంగడాలు వేసే విస్తీర్ణాన్ని ఆయేటి కాయేడు పెంచుతున్నారు. మూడవ ప్రణాళిక ఆఖరు నాటికి వరి పంట క్రిందవున్న విస్తీర్ణంలో దాదాపు 95 శాతం విస్తీర్ణానికి మేలురకం వంగడాల సేద్యపు కార్యక్రమాన్ని వర్తింప జేశారు. నాలుగవ ప్రణాళికా కాలంలో 98 శాతం విస్తీర్ణానికి వర్తింప జేయడానికి ప్రతిపాదించారు. వర్తమాన సంవత్సరంలో ఖరీఫ్, రాబీరుతువులలో కలిసి సుమారు 10 లక్షల ఎకరాలలో గరిష్ఠ దిగుబడునిచ్చే వంగడాలను వేయడానికి తలపెట్టారు. వీనిలో వరి పండించే భూమి విస్తీర్ణం 6.65 లక్షల ఎకరాలు ఉంటుంది. ఈ చర్యల ఫలితంగా మన రాష్ట్రంలో ప్రస్తుత సంవత్సరంతో ఆహారోత్పత్తి పది లక్షల టన్నుల వరకు పెరిగే అవకాశం వుంది.

ఇటీవల తైచుంగ్ నేటివ్—1 వరి వంగడాన్ని గురించి విరివిగా ప్రస్తావించడం జరుగుతున్నది. తైవాన్ (ఫార్మోజా) కు చెందిన గరిష్ఠ దిగుబడినిచ్చు వరివంగడం ఇది. సుమారు రెండు సంవత్సరాలక్రితం వాణిజ్య సేద్యంనిమిత్తం ఫిలిప్పైన్స్ నుంచి ఈ వంగడాన్ని భారతదేశంలో ప్రవేశపెట్టడం జరిగింది. చాలా ఎక్కువ దిగుబడినిచ్చే వరివంగడాలలో ఒకటిగా ఇది పరిగణించ బడుతున్నది. అనేక సంవత్సరాల పరిశ్రమ తరువాత ఈ వంగడాన్ని రూపొందించారు. ఎక్కువ మోతాదులో ఎరువులు వేయడంవల్ల అధిక పరిమాణంలో దిగుబడిఇచ్చే శక్తి ఈ వంగడానికివుంది. కొన్ని రకాల తెగుళ్ళకు లోనయ్యే దీనితత్వంవల్ల —ముఖ్యంగా తీవ్రతర సేద్యంలో—మన దేశంలోని చాలా మంది వరి నిపుణులకు ఈ వంగడాన్ని రైతులకు సిఫార్సుచేసే విషయంలో సంశయం కలిగింది. అయితే పశ్చిమ గోదావరిజిల్లా మార్టేరు, హైదరాబాదు జిల్లా రాజేంద్ర నగర్‌లలోని వ్యవసాయ శాఖ క్షేత్రాలలో 1964–65 సంవత్సరంలో ఇది సాధించిన గరిష్ఠ దిగుబడిని చూసి ఆంధ్ర ప్రదేశ్‌లోని పురోగాములైన కర్షకులు చాలా మంది ముగ్ధులయ్యారు. ఆ సంవత్సరంలో ఈ వంగడాన్ని ప్రయోగ ప్రాతిపదికపై వేయడం జరిగింది. ఈ వంగడానికి మంచి గిరాకీ ఏర్పడినందున 1965 వేసవిలో ఫిలిప్పైన్స్‌నుంచి ఒక టన్ను గింజలను సేకరించారు. ఈనాడు అనేకవేల ఎకరాలలో ఈ వంగడం సాగులోవుంది.

## అంతర్జాతీయ వరి సంవత్సరం

1966 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ వరి సంవత్సరంగా పాటించడానికిగల కారణాలను ఇచ్చట ప్రస్తావించడం అప్రస్తుతంకాదు. ప్రపంచ జనాభాలో దాదాపు మూడవ వంతు మందికి బియ్యం ముఖ్యాహారం. ప్రపంచంలో సుమారు 267 మిలియన్ ఎకరాలలో వరి సేద్యం జరుగుతున్నది. ఏటా 129 మిలియన్ టన్నులకు పైగా ధాన్యం దిగుబడి అవుతున్నది. మన దేశంలో 88 మిలియన్ ఎకరాలలో వరి పండిస్తున్నారు. సుమారు 36 మిలియన్ టన్నుల ధాన్యం వుత్పత్తి అవుతున్నది. అయినప్పటికీ జనాభా విపరీతంగా పెరుగుతుండడంవల్లనైతేనేమి, లోగడ జొన్నలు మొదలైన ఇతర ధాన్యాలు ఉపయోగించినవారు సైతం ఇప్పుడు బియ్యం వాడకం ప్రారంభించడంవల్లనైతేనేమి బియ్యం కొరత ఏర్పడుతున్నది. ఇంతేకాక మన దేశంలో ఎకరా సగటు దిగుబడి తక్కువగా వుంటున్నందువల్ల ఆహార ధాన్యాల కొరత–ముఖ్యంగా బియ్యం కోత–సంభవిస్తున్నది. మన దేశంలో హెక్టార్ ఒక్కింటికి సగటు వరి దిగుబడి దాదాపు 14 క్వింటాళ్లు. జపాన్, తైవాన్, ఆస్ట్రేలియా, ఇటలీ వంటి వరిపండించే ఇతర దేశాలతో పోల్చినప్పుడు ఈ దిగుబడి చాలా తక్కువైనట్లు తెలుస్తుంది. ఈ పరిస్థితుల దృష్ట్యా వరి ఉత్పత్తిని పెంపొందించడానికీ, ఈ అంశంపట్ల ప్రజాభిప్రాయాన్ని సమీకరించడానికీ ఐక్యరాజ్యసమితికి చెందిన ఆహార, వ్యవసాయ సంస్థ (ఎఫ్.ఏ.ఓ) 1966 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ వరి సంవత్సరంగా ప్రకటించి ఈ సందర్భాన్ని సముచిత రీతిని పాటించవలసిందిగా సభ్యదేశాలను కోరింది. దీనిని పురస్కరించుకొని భారతదేశంలో డిశంబరు 17 వ తేదీనుంచి వారం రోజులపాటు జాతీయ వరి సప్తాహం జరిపారు. ఆ సందర్భంలో గరిష్ఠ దిగుబడినిచ్చు వంగడాలు, సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అమలులోనున్న ప్రాంతాలలో దేశవ్యాప్తంగా అమలు జరుగుతున్న "నూత్న ఆహార విధానం" మన క్షేత్ర ఉత్పత్తిని భారీఎత్తున పెంపొందించడానికై ఎరువులు మొదలైనవాటి ఇతోధిక వినియోగం—వీటి విషయంలో ప్రజల దృష్టిని ఆకర్షించడం జరిగింది. ఈ చర్యలన్నింటిద్వారా భారతదేశం 1966–67 వ సంవత్సరంలో సుమారు 97 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తిని సాధించ సంకల్పించింది. 1965–66వ సంవత్సరంలో జరిగిన ఉత్పత్తి (అంచనా) 75.9 మిలియన్ టన్నులు.

## జీతంలో 10 శాతం తగ్గింపుకు మంత్రుల నిర్ణయం

ప్రభుత్వవ్యయంలో పొదుపు చర్యగా ఆంధ్రప్రదేశ్ మంత్రులు తమ జీతాలలో 10 శాతాన్ని తగ్గించు కొంటున్నారు. 1967-68 సంవత్సరం నుంచి దీనిని అమలులో పెడుతున్నట్టు ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, గవర్నరు ప్రసంగానికి కృతజ్ఞత తెలియజేసే మూడురోజుల చర్చా సమావేశంలో తెలియ జేశారు. అంతేగాక మంత్రులు తమ పర్యటనల్లో 25 శాతం తగ్గించుకుంటున్నట్టు కూడా ముఖ్యమంత్రి తెలియ జేశారు. ప్రభుత్వాధికార్లుకూడా యిదేమాదిరి పొదుపుచర్యల్ని అనుసరించాలని ఆయన ఉదేశించారు.

---

### పట్టిక—1.

ఆంధ్ర ప్రదేశ్‌లో, 1955-56 వ సంవత్సరం నుంచి 1965-66 వ సంవత్సరం వరకు గడచిన పది సంవత్సరాల కాలంలో వరి పండించిన విస్తీర్ణం, ధాన్యం దిగుబడులకు సంబంధించిన వివరాలు-సంవత్సరాల వారీగా-దిగువ పొందు పరచబడినాయి :-

| క్రమ సంఖ్య | సంవత్సరం | భూమి విస్తీర్ణం (హెక్టార్లలో) | దిగుబడి (టన్నులలో) |
|---|---|---|---|
| 1. | 1955-56 | 27,27,000 | 30,99,000 |
| 2. | 1956-57 | 29,27,000 | 34,07,000 |
| 3. | 1957-58 | 28,31,000 | 33,4,6000 |
| 4. | 1958-59 | 30,10,000 | 37,65,000 |
| 5. | 1959-60 | 30,80,000 | 38,36,000 |
| 6. | 1960-61 | 29,61,000 | 36,61,000 |
| 7. | 1961-62 | 33,93,000 | 45,15,000 |
| 8. | 1962-63 | 34,25,000 | 42,13,000 |
| 9. | 1963-64 | 33,58,000 | 43,43,000 |
| 10. | 1964-65 | 34,60,000 | 50,10,000 |

### పట్టిక—2.

పూర్వకాలం నుంచి చాలా విస్తృతంగా సాగు చేస్తున్న ప్రదేశాలలో వరి దిగుబడి తక్కువగా వున్నట్లు ఈ దిగువ ఇచ్చిన వివరాలు వెల్లడిస్తాయి :

| దేశం | దిగుబడి (ఒక హెక్టారుకు కిలో గ్రాము చొ.) | భూమి విస్తీర్ణం (హెక్టార్లలో) |
|---|---|---|
| ఆస్ట్రేలియా | 6,630 | 20,000 |
| స్పెయిన్ | 6,360 | 62,000 |
| ఇటలీ | 5,460 | 1,23,000 |
| యు. ఏ. ఆర్. | 5,050 | 2,26,000 |
| జపాను | 4,700 | 3,30,1000 |
| యు. ఎస్. ఏ. | 3,820 | 6,13,000 |
| కొరియా | 3,280 | 1,12,8000 |
| తైవాన్ | 3,210 | 25,08,000 |
| వియత్నాం | 1,960 | 23,54,000 |
| బర్మా | 1,680 | 40,68,000 |
| ఇండియా | 1,510 | 3,38,59,000 |
| థాయిలాండ్ | 1,390 | 56,51,000 |
| ఫిలిప్పైన్స్ | 1,230 | 31,79,000 |
| కంబోడియా | 1,050 | 11,91,000 |
| లావోస్ | 870 | 6,20,000 |

ఆధారం :- భారత వ్యవసాయ పరిశోధక సంస్థ, న్యూ ఢిల్లీ.

# భాగ్యచక్రం

"అమ్మాయిగారూ, వంట్లో తులాసాగా లేదా?" మెల్లగా ప్రశ్నించింది.

"చూడు మంగమ్మా, ఒక్కటడుగుతాను, నిజంచెప్తావా?" అనడిగింది జయశ్రీ, లేచికూర్చుని.

విస్తుపోయింది మంగమ్మ. "అడగండమ్మా, దానికేం?" అన్నది.

"మీ డాక్టర్‌గారికి పెళ్ళి ఎప్పుడైంది?"

"ఏమోనమ్మా? నాలుగేళ్లైందేమో!"

పెళ్లై నాలుగేళ్లైతే నాలుగేళ్ళ కొడుకెలావున్నాడు?"

తడబడింది మంగమ్మ. అదేనమ్మా......ఒక్కభార్యనే ఎరుగుదును. సెలవులకొచ్చినప్పుడు తీసుకొచ్చేవారు. అంతకు ముందు భార్య బిడ్డ ఈ అబ్బాయి!"

"ఇద్దరు భార్యలూ చచ్చిపోయారా?"

మంగమ్మ భయం భయంగా అటుయిటు చూచింది. సంకోచిస్తూ చెప్పింది: "అవును ఇద్దరూ చచ్చిపోయారు."

"ఎందుచేత?" జయశ్రీ మనస్సు అల్లకల్లోలమైపోయింది.

"ముందు భార్యను అసలు మేమెవరం చూడలేదమ్మా. యుద్ధంలోనే చేసుకున్నారట. ఒక బిడ్డ కలిగిన తర్వాత చచ్చిపోయిందట. అసలు ఆపెళ్ళి అయినట్టే మాకుగాని, అమ్మగారికిగాని ఎవరికీ తెలియదు. రెండోపెళ్ళికూడ ఆయనే చేసుకున్నాడు అమ్మగారు చెయ్యలేదు. పోనీ, బాగానే ఉందనుకున్నాం. కొన్నాళ్లు బాగానే ఉన్నారుమరి. ఆయమ్మ ఎందుకో బెంగపెట్టుకుంది. ఆబెంగతోనే చచ్చిపోయింది. మరి ఇంతమంచిబాబు ఆ యమ్మకు అన్యాయం చేసేడని నేననమ్మను. డాక్టరుబాబు దేవుడేనమ్మా!"

"అంతేలే, కొందరుపైకి కన్పించరు. మగవాళ్ళు మహా మోసగాళ్ళు!" అన్నది అక్కసుగా జయశ్రీ.

"కాదమ్మా! నగేశ్‌బాబు.............." ఏమో చెప్పబోయిన మంగమ్మ జయశ్రీ తీక్షణస్వరానికి కలవరపడి మాటలు ఆపేసింది.

"ఇక నాకేంచెప్పకు, నువ్వు వెళ్లు." అని కోపంగా అరిచి గోడవైపు తిరిగి పడుకున్నది జయశ్రీ.

ఆరెకపూడి కౌసల్యాదేవి

---

జరిగిన కథ

కా ఏక్సిడెంట్‌లో శ్రీపతి చిక్కుకుని మతి స్థిమితాన్ని కోల్పోతాడు. అతని కూతురు జయశ్రీ మినహా మిగిలిన వారంతా ఆ ఏక్సిడెంట్‌లో చనిపోతారు. శ్రీపతి మేనల్లుడు శ్రీనగేష్ అయనకు చికిత్స చేస్తూంటాడు. జయశ్రీ గర్వం, ఆడంబరం శ్రీనగేష్‌కు నచ్చదు.

పైపెచ్చు బి. డి. ఒ తో జయశ్రీ చనువుగా ప్రవర్తించడం శ్రీ నగేష్‌కు బాధ కలిగించింది. ఆమె టీపార్టీ యిచ్చిన రోజునకూడా బి. డి. ఒ., శ్రీకాంత్‌ల ప్రవర్తన తీరు శ్రీ నగేష్‌కు ఏమి నచ్చలేదు.

---

నిర్ఘాంతపోయిన మంగమ్మ మెల్లగా తేరుకొని వెళ్ళిపోయింది. డాక్టరుగారికి పెళ్ళయితే ఈవిడకు బాధెందుకో— పూర్వకాలపుదైన మంగమ్మ కెంతమాత్రం అర్థంకాలేదు. ఆలోచిస్తూ మేడమెట్లు దిగుతూంటే, జయశ్రీ పరుగు పరుగున వచ్చి ఆమెను కలుసుకున్నది.

"చూడు మంగమ్మా. నేనిలా అడిగినట్లు ఎవ్వరికీ చెప్పకేం?" అన్నది అర్థింపుగా.

"చెప్పనమ్మా, నాకేంపని?"

"నిజంగా చెప్పవుకదూ?"

"చెప్పనుతల్లి. మీమీద ఒట్టు."

"సరే వెళ్ళు," వచ్చినంత వేగంగాను నిష్క్రమించింది జయశ్రీ.

మంగమ్మ కొద్దిక్షణాలు నివ్వెరపోయి, జయశ్రీ వెళ్ళిన దిక్కే చూచి, తరువాత మెల్లగా నడక ప్రారంభించింది నిజాని కామెకు అంతవరకూ అవిషయం ఎవరికీ చెప్పాలనే ఊహేలేదు. కాని జయశ్రీ, 'ఎవరితోను చెప్పవల'దని శాసించడంతో, తక్షణం ఎవరికైనా చెప్పివేస్తేకాని ప్రాణం నిలువదన్నస్థితికి వచ్చేసింది. ఆమె మనసులో ఆరాటం. జయశ్రీపై ఒట్టుపెట్టుకున్న విషయం కూడ మరచిపోయింది. 'ఈ విషయం ఎంతత్వరగా ఎవరికి చెప్పివేయడమా?' అని ఆలోచించుతూ ఇల్లుజేరిన ఆమెకుదొడ్లో నూతిదగ్గర నీళ్లతోడుతూన్న నాగన్న కన్పించాడు.

"ఒరేయ్, నాగన్నా! మరేం........." వాడితో ఏదో రహస్యం చెప్పబోతూన్న ఆమెనోరు శ్రీదేవి పిలుపు చెవిన పడడంతో మూతపడిపోయింది.

"వచ్చావా మంగమ్మా? అక్కడ విందు పూర్తైందా?" అని యధాలాపంగా ప్రశ్నించింది, వరండా మీదినుండి శ్రీదేవి.

"వచ్చానమ్మగారూ." కాలు చేతులు కడుక్కుని శ్రీదేవి దగ్గఱకువచ్చి కూర్చున్నది మంగమ్మ.

"విందు ఎందరికి? ఏవిధంగా జరిగింది? ఏమేం చేశారు?" అం పెద్దతరహా ఆసక్తితో ప్రశ్నించింది శ్రీదేవి.

వివరంగా చెప్పింది మంగమ్మ. పనిలో పనిగా, తన మనసులో దాగి వుండలేక ఆరాటపడ్తూవున్న విషయాన్నికూడ వెళ్ళ గ్రక్కేసింది. అంతాచెప్పి, "ఆ అమ్మాయి గారికి మన అబ్బాయి గారిమీద....ఉన్నదేమోనండమ్మగారూ.'' అంటూ ముగించింది.

శ్రీదేవి వదనంలో ఆనంద క్రోధరేఖలు మిళితమై పరుగు లెత్తాయి. ''చాల్లే, అధిక ప్రసంగం నువ్వూను. ఆవిషయా లన్నీ నిన్నెవరుమాట్లాడ మన్నారు ఆ అమ్మాయితో?"

ఇంతలో ఈమెకింత అప్రసన్నత యేమో మంగమ్మకర్థం కాలేదు. తానుచేసిన తప్పేమిటో అసలే బోధపడలేదు. కాని, మేనత్తకు తగిన మేనకోడలే అన్పించింది ఆమెకు.

"వెళ్ళి నీపని చూసుకో. ఇంకెవరి దగ్గరా ఏమీ నోరు జారబోకు. ఆ విషయం మరచిపో.'' అని ఆజ్ఞాపించుతూ అక్కడినుండి తనగదికి వెళ్ళిపోయింది శ్రీదేవి.

అక్కడే మంగమ్మకు వచ్చినచిక్కు ! మామూలుగా ఎన్ని విషయాలు మాట్లాడుతున్నా ఆమెకు యిబ్బంది వుండదుకాని, ఎవరి తోనూ చెప్పకు ! అనిమాత్రం ఎవరైన అన్నారో, ఇక అది కన్పించిన ప్రతివారితోను చెప్పేసే వరకు నిద్రపట్టదు ! ఫలితంగా ఆ రహస్య విషయం, వాడకట్టులో అమ్మలక్కలందరి నోళ్ళలో నలుగుతుంది.

*　　　*　　　*

ప్రొద్దుపోయి యింటికి వచ్చిన కుమారుని, ''ఎక్కడకు వెళ్ళావు ? మామయ్యగారింటికి విందుకని వెళ్ళినవాడవు తిరిగి యిదేరావడం !'' అన్నది శ్రీదేవి.

''అక్కడ భోజనాలయ్యాక అత్యవసరంగా విశాఖ పట్టణం వెళ్ళేనమ్మా'' అన్నాడు శ్రీనగేష్.

''ఏం ? మళ్ళీ ఏపేషెంటు విషయమేనా ? ఎవరినైనా తీసుకొచ్చావా ?"

"లేదమ్మా, వేరేపని. పేషెంటు విషయమేననుకో. అన్నట్లు నాభోజనమైంది. అక్కడే చేసివచ్చాను. నువ్వేమీ శ్రమపడకు, ఇలాకూర్చో'' అన్నాడు దుస్తులు మార్చుకుని, శయ్యపై వాల్తూ.

"ఎక్కడ ? శ్రీలక్ష్మి యింట్లో కాదుకదా ?''

ఆ ప్రశ్నను తప్పించాడు శ్రీనగేష్. "నాకోసం ఎవరైనా వచ్చారా నేనులేనప్పుడు ? శ్రీధర్ నిద్రపోయాడా ?"

ఆమాత్రం గ్రహించలేని తెలివితేమి లేదు శ్రీదేవికి. అర్థం చేసుకున్నా అన్నట్లు ఒక్క నిశ్వాసంవదిలింది. ''ఉండు. కాసిన్ని పాలైనా త్రాగి పడుకుందువుగాని'' అంటూ లేచివెళ్ళి పాల గ్లాసుతో తిరిగివచ్చింది. "నీకు నామాటలు చాదసంగా కన్పిం చినా, నాతల్లి ప్రాణం నీగురించి గిలగిల లాడక మానదు. నా మాటనాదే. నీ నడవడి నీదే." అన్నది కొంచం నిష్ఠురం ధ్వనింపజేస్తూ.



పాలుత్రాగి గ్లాసుప్రక్కనపెడ్తూ, ''లక్ష్మియింటికి వెళ్ళి నందుకామ్మా నీకోపమంతా ?'' అన్నాడు చిన్నగానవ్వి.

శ్రీదేవి మాట్లాడలేదు

''ఆమెతోనే పనివుండి వెళ్ళినప్పుడు మరి ఆమె మర్యాద లను విధిగా స్వీకరించొద్దామ్మా ?''

"ఏమిటి నీకామెతో అంతపని ?"

"అవన్నీ నీకూడా చెప్పి విసిగించడం ఇష్టంలేదమ్మా. అందుకనే నీకు నేనేమీ చెప్పడంలేదు. మామయ్యకు నేనుచేస్తున్న వైద్యం కేవలం మనస్తత్వశాస్త్రంపై ఆధారపడి వున్నది. ఆ విషయంలో శ్రీలక్ష్మి ప్రమేయంకూడా వున్నది గనుక, కొన్ని విషయాలు మాట్లాడడానికి అక్కడికి వెళ్ళవలసి వచ్చింది. అంతే.''

"సరేలే. ఇంతకు నువ్వేం నిర్ణయానికొచ్చావ్ ?"

''ఫర్వాలేదు. ఆయనపిచ్చి పూర్తిగా తగ్గిపోగలదనే అనుకుంటున్నాను.''

''నీ పిచ్చి విషయం నేనడుగుతూన్నది!'' శ్రీ దేవి కంఠంలో తీవ్రత!

గతుక్కుమన్నాడు శ్రీ నగేశ్. ''ఏదమ్మా, ఎక్కడా తీరిక లేనిదే ఆ విషయం ఆలోచించడానికి?"

అగ్నిలో ఆజ్యం పోసిన చందంగా రగులుకున్నది శ్రీదేవి ఆగ్రహం. ''అవును. అన్నీ అమర్చి పెడ్తూంటే ఆ విషయం నీకు గుర్తెలా వస్తుంది? నేను చావాలి—ఈ యింటికి అడ దక్షతా, అందమూ రావాలి.'' విసురుగా లేచి పోబోతూన్న ఆమెను ''అలా అంటే నామీద ఒట్టేనమ్మా ఆలోచిస్తానని అన్నానుగా? నాకు కొంత వ్యవధియియ్యి.''

కోపం పూర్తిగా తగ్గలేదుకాని, కొంచెంగా శాంతించింది శ్రీదేవి. ''సరే. నీకు ఒక్క రెండు రోజులు మాత్రం వ్యవధియిస్తున్నాను.'' అన్నది ఖచ్చితంగా.

''క్షమించమ్మా. ఓ వారంరోజులు వ్యవధియియ్యి.''

శ్రీ దేవి సమాధానమీయలేదు.

''అమ్మా!'' మందస్వరంలో పిలిచాడు రాజీమార్గంలో ''ఇంతకూ మనం ఆలోచించి ఏమిటంటావు లాభం?''

''అంటే''

''అదే.........ఎలా ఆలోచించమకో మంటావు నన్ను?''

''అంటే? అదేదో వివరంగా చెప్పరాదూ?''

''చెప్పటానికేమున్నదమ్మా?'' విషాదహాసం చేశాడు. ముఖమంతా నీలిమేఘాచ్ఛాదితమైంది. కంఠస్వరంలో ప్రత్యక్షంగా బాధ ధ్వనించింది. ''నువ్వు నాగురించి, శ్రీధర్ గురించీ ఆలోచింమతున్నావు.''

''అవును?''

''నేను నీ గురించీ, శ్రీధర్ గురించీ ఆలోచిస్తున్నాను.''

''అయితే?''

''ఏముందీ? మనకు కావలసినది—'మన' అనేకంటే 'నీకు' కావలసిన వ్యక్తి అంటే బాగుంటుందేమో!—అనురాగ మూర్తి మాత్రమే కాని, ఎవరో ఓ కన్యకాదు. ఈ యింటికి యింతకంటె నిండుదనాన్నీ, సుఖశాంతులనూ సమకూర్చగల సమర్థనీయ్య, జ్ఞానమయి కావాలి.''

''అవును. అక్షరాలా అంతే!''

''అయితే యికనేను ఆలోచించ వలసినదేంలేదు!''

''ఏమిటో నీ అడవి ధోరణి నాకేమీ బోధ పడడంలేదు.'' విసుక్కుంది శ్రీదేవి. ''పిచ్చివాళ్ళకు వైద్యంచేసిచేసి, నీకూ పిచ్చెక్కిందనుకోనా?''

విచారంగా నవ్వాడు నగేష్ ''నేను తిక్కగా మాట్లాడడం లేదమ్మా. కాని మన ఆశ అడియాస అంటున్నాను. మనం కోరినటువంటి అమృతమూర్తు లుండరని అనడం లేదు కానీ, మనకు దొరకడం దుర్లభమంటున్నాను. ఎక్కడని వెదకుతాం? ఎవరో ఒకర్ని చేసుకుని ఈ ఉన్నసుఖం కూడా చేతులారా నాశనం చేసుకోవడం నాకిష్టంలేదు. అయినా, రెండుసార్లు పెళ్ళి, ఇద్దరు భార్యలను సాగనంపిన వాడిని—తిరిగి ఒక కన్యను ఆశించడం అపరాధం కాదామ్మా?''

నిండుగా నవ్వింది శ్రీదేవి. ''నువ్వలా మనస్సు విప్పి ఒక్క నాడైనా మాట్లాడావా? ఇలా మర్మం విడచి మాట్లాడితే ఇక నాకు కావలసినదేమున్నది? జయశ్రీ ని నేర్పుగా అడిగి, అంగీకరింపచేస్తాను.''

'' నీకటువంటి ఆలోచనలు తగవమ్మా. పాపం, ఖర్మ కాలి ఆ అమ్మాయి ఏదో వైద్యానికొస్తె అలా మాట్లాడ తావేమిటమ్మా? నీకు అటువంటి ఆలోచనలు తగవు ''

'' నేనేమి అసంబద్ధంగా మాట్లాడడంలేదు. ఇవ్వాళ మధ్యాహ్నం జరిగిన విషయం విను. జయరూడా ఇందుకు సుముఖంగా వున్నదో లేదో నీకేతెలుస్తుంది. మంగమ్మ చెప్పింది నాకీవిషయం............''

విషయమంతా విన్న శ్రీనగేష్ ఏమాత్రం చలించలేదు ''ఆ అమ్మాయి ప్రవర్తనలోనే తెలుస్తూన్నది కదా, ఆమె కేమాత్రం అభిమానమున్నదో!'' అన్నాడు మందగంభీర స్వరంతో.

''ఫర్వాలేదు. చిన్నతనం మూలాన విన్నవెంటనే తట్టుకోలేక లోపలి భావాలను వ్యక్తపరిచేసింది. అంతే. నా మాటను పేసివేయదనే గట్టినమ్మకమున్నది. అయినా, ఆలోచించి చూస్తే ఇక ఆమెకు మనంగాక ఎవరున్నారు? ఉన్న అవకాశాన్ని కాలదన్నుకునేంత తెలివి తక్కువ దంటావా?''

ఆలోచనలతో నున్న శ్రీనగేష్ మాట్లాడలేదు.

తానే అన్నదిశ్రీదేవి : ''వివేకం, సహనగుణం లేనిదే అంత చదువు కున్న పిల్ల ఈ పల్లెటూళ్ళోపడి పిచ్చితండ్రితో అలా వేగుకొస్తున్నదా పాపం? అసలు ఆనాడు నిన్ను తృణీకరించకపోతే యింతఘోరాలు జరిగి వుండేవేకాదు! ఆనాటి తన తప్పిదాన్ని ఈ ఈసరికి గుర్తించకుండా వుంటుందంటావా?''

విషాద గంభీర హాసంతో అన్నాడు శ్రీనగేష్: ''జయ విషయాలు నీకంటే నాకు బాగా తెలుసమ్మా, మనకెంత మాత్రం సరిపడదు. నిన్న వచ్చినప్పుడు శ్రీధర్‌ను చూచి ముఖం ఎలా చిట్లించుకుందో చూచావా? నాబాబును అలా అసహ్యించుకున్నా నిర్లక్ష్యం చేసి నాసుఖం కోసంప్రాకులాడేంత హీనుడినికాను నేను. ఆమెకు మంచి సంబంధం చూచిచేసి, మనపెద్దరికాన్ని నిలుపుకుందాం. అంతే.''

''నగేష్!''

''అవును. అయినా యిటువంటి విషయాలలో బాగాయోచన అవసరం. తొందర తగదు. సరే. పడుకుందాం. చాలా రాత్రి అయ్యింది.''

''ఊం.'' భారంగా మూల్గిలేచి కదలింది శ్రీదేవి.

"అన్నట్టు —అమ్మా! రేపు మధ్యాహ్నం ఇద్దరు ముగ్గురు అతిథులు రావచ్చు మనింటికి. నీకుముందే చెప్తున్నాను."

"అలాగే."

"మరెవరూ కాదులే. సూరయ్యా, జయా, బహుశః పురోత ముగ్గురు నలుగురూను. ఎవరు వచ్చినా, ఏంజరిగినా నువ్వొకలవరి పడకుండా, అతిథి మర్యాదలకు లోపం రానీయవని నాకుతెల్సు!"

ఆ మాటలలోని అంతరార్థం, అభ్యర్థన ఆజ్ఞలను గుర్తించినట్లు తలపంకించి నిష్క్రమించింది శ్రీదేవి.

పడుకున్న శ్రీనగేష్‌కు ఎందు వల్లనో ఈనాడు అనుదినం వలె నిద్రపట్టలేదు. ఆ సాయంత్రం శ్రీలక్ష్మితోడి సంభాషణా సన్నివేశాలే పదే పదే జ్ఞాపకానికి వసాగినవి. శ్రీలక్ష్మి సాక్షాత్తూ ఆ కమల జాత శ్రీలక్ష్మే అన్పించింది.

* * *

అతి ముఖ్య సమయంలో అనుకోని సంఘటనలు సమకూడి మానవులను అయోమయం చేసి అగ్నిపరీక్షకు నిలబెడతాయనే విషయం అనుభవజ్ఞులకు మాత్రమే సుగ్రాహ్యం. చిత్రమైన, ఊహించని సంఘటనా మాలికను ఏచలన చిత్రంలోనో నాటకంలోనో చూచి అది రచయిత సృష్టి అని సరిపెట్టుకుంటాం. కాని ఈ యిలాతలంపై నిజజీవితాలలోని సంఘటనా సందర్భాలు మరీ చిత్రాతి చిత్రంగా వుంటాయి. అందుకు ఏతర్కవాదమూ సరిపోదు.

ఆ ఉదయం నిద్రలేస్తూనే శ్రీలక్ష్మిని పిలచి, "ఈ రోజు కాలేజీకి సెలవు పెట్టేయమ్మా. మీ అమ్మ వాళ్ళ చెల్లెలింటికి వెళ్తుందట. దిగబెట్టిరా. నాకు ఖాళీలేదు." అని ఫర్మాయించాడు శ్రీనివాసరావు.

క్షణకాలం తత్తరపాటు జెందింది శ్రీలక్ష్మి. "ఆ దినం తాను ఎలాగూ సెలవు పెట్టి శ్రీనగేష్ యింటికి పోవలసి వున్నది. కాని మళ్ళీ ఈ పని పైనవేసుకొంటే ఎలాగ?"

అందుకే అన్నది: "నాకు వీలు కాదమ్మా. నాకు వేరే పనుంది. అదీ పెద్ద పట్టణమేగా? ఇక్కడ రైలెక్కేస్తే అక్కడ దిగివెళ్ళిపోవచ్చు. రైలుస్టేషనుకు దిగబెడతాను చాలా?"

సుశీలా శ్రీనివాసరావు లొకేసారి అన్నారు: "అదేం మాటమ్మా? అయితే నీకు అమ్మ పనికంటె ఎక్కువైన పనులున్నాయన్న మాట?"

శ్రీలక్ష్మి మనస్సు బాధ పడింది. తొందర పాటుతో తానెంత పొరపాటుగా మాట్లాడిందో గ్రహించింది. కుమారుడైనా, కొమరిత అయినా తానే వారికి. వారి విషయాలు చూడ దానికి తన కంటే ఎవరున్నారు? వారి పట్ల తన బాధ్యతను నెఱవేర్చడమే తనకు పరమ కర్తవ్యం. చెల్లెలూ,తమ్ముడూ చిన్న పిల్లలు. వారి కేమీ తెలియదు.........అయితే, శ్రీనగేష్‌కు చేసిన వాగ్దానమూ అతి ముఖ్యమైనదే! తన మాటను నమ్మి అతడు అన్నీ సిద్ధం చేసుకుంటాడు. ఆ మాట నమ్మి జేయడం కూడా తప్పే. బాధ్యతా నిర్వాహణ, మాట చెల్లింపు-రెండూ ముఖ్యమే.

క్షణాలలో కర్తవ్యం నిర్ణయించుకున్నది. "సరేనమ్మా, ఒక గంటలో బయలుదేరు. నిన్ను కారులో దిగబెడుతాను, రెండు-రెండున్నర గంటలలో అక్కడికి జేరుకుంటాం. అక్కడ నిన్ను దింపేసి పోయి, నేను నా పని చూచుకుంటాను. మళ్ళీ ఎప్పుడు రావాలి నీకోసం?"

"తర్వాత ఉత్తరం వ్రాస్తానులే"

"సరే"

అంత దూరమూ ప్రయాణంచేసి, రెండున్నర గంటల అనంతరం తోటుబ్బువుయిల్లు జేరినప్పటికీ, అక్కడ వుండాల్సిన అవసరం లేకపోయింది సుశీలాదేవికి. కారు దిగుతూనే కాలుజారి కింద పడిన ఆమె, వెంటనే ప్రాణం శోష వచ్చినట్లు మూల్గుతూ మాట్లాడలేక పోయింది.

"అయ్యో అదేమిటమ్మా?" భయపడింది శ్రీలక్ష్మి. మంచి నీరు పట్టించి, ఆమెను శయ్యపైకి జేరవేసి, కొంత కోలు కోగానే చూచేసరికి ఎడమ చేతి మణికట్టు మాత్రం విరిగి వున్నది.

"అయ్యో బాబోయ్, ఇదేమిటీ ఖర్మ?" అని అధైర్యంతో దుఃఖించ సాగింది సుశీల.

"ఫర్వా లేదమ్మా. నేను లేనూ? నువ్వలా బంగారు పడక," తల్లి చెంపల నీరొత్తి త్వర త్వరగా కారులో పడుండ బెట్టి, ఆ ఊరిలోని హాస్పిటల్‌కు తీసుకెళ్ళింది శ్రీలక్ష్మి తల్లిని.

ట్రాఫిక్ రూల్స్ కూడ లెక్క జేయకుండా కారును పోనిస్తూ ఒక్కతృటిలో ఆసుపత్రి జేరిన శ్రీలక్ష్మి ప్రయాస అంతా వ్యర్థమే అయ్యింది.

"ఇప్పుడు కాదు, మూడు గంటలకు కాని గేటు తీయబడదు." అన్నాడు గేట్ మాన్ ఖరారుగా.

"అలా అంటే ఎలాగా? చేయి విరిగిపోయింది. చాలా బాధగా వున్నది, అన్నది శ్రీలక్ష్మి.

"రూలు రూలేనండీ, ప్రాణం పోయినా మారదు. మూడు గంటలకే గేటు తీసేది."

"మేం 'విజిటర్స్' కాదు పేషెంట్లం కదా?"

"ఎవరైనా సరే!"

చేసేది లేక అంత వఱకూ వేచి వున్నది కారులోనే. ఎలాగైతే మూడు గంటలైే, గేటు తెరవ బడింది. ఏదో పెద్ద స్వర్గద్వారాన్ని ఉదారంగా తెరిచినట్టు బోజు పెట్టాడు వాడు. 'అవసర సమయాలలో గడ్డి పఱక కూడా గగన కుసుమ మవ్వుత మంటే యిదే కాబోలు' ననుకొంటూ శ్రీలక్ష్మి కారును హాస్పిటల్ ఆవరణ లోనికి పోనిచ్చింది.

ఆత్రుత అధికమైన కొద్దీ అతిగతి కనుక్కొనే వాళ్ళు లేక పోయారు, నెత్తిమీద నాప్‌కిన్ ధరించడంతోనే ఏదో ఎలిజబెత్ రాణి కిరీటం ధరించినంత గర్వంతో నడుస్తున్నారు నర్సులు, ఎక్కడా నేలా నింగీ తెలియకుండా. కడకు ఎలాగో శ్రమ పడగా ఒక అరగంట పోయాక దేవదూత కనికరించి వచ్చినట్టుగా వచ్చింది ఒక నర్సు.

"ఏమైందండీ ఈమెకు?" అతి ఫాషన్‌గా అడిగింది. చెప్పింది శ్రీలక్ష్మి, "జారి పడ్డా" రని. "ఎక్కడ? మేడ మీది నుండా, స్నానాల గదిలోనా.

"స్నానాల గదిలో" అలిస్టు వినలేక చటుక్కున ఏదో ఒకటి చెప్పేసింది శ్రీలక్ష్మి. "అవన్నీ తర్వాత. ముందు చేతికట్టు విషయం చూడండి. ఎంత డబ్బైనా వెనుదీయ నవసరంలేదు."

నర్సు ముఖం చిట్లించుకుంది "ఇదంతా మా రొటీన్ వర్క్. ముందు పేషెంట్ డేటా అంతా తీసుకోవాలి. చెప్పండి. ఈమె కెందరుపిల్లలు?"

"నే నొక్కతినే."

"ఎవరైనా చచ్చిపోయారా? పుట్టినదే ఒక్కరా?"

శ్రీలక్ష్మికి వినడానికే అసహ్యం వేసింది. ఇక సమాధానం చెప్పకుండా, "కూర్చో" మని తల్లికి చెప్పి, తాను బయటకు నడిచింది. వరండా గోడమీద నున్న బోర్డులో అప్పుడు డ్యూటీలో వున్న డాక్టర్ల లిస్టు కన్పించింది. అయిదుగురికీ ముగురు డాక్టర్లు 'సిక్‌లీవ్' పెట్టారు. ఒకామె అంతవఱకూ ఒక ఆపరేషన్ చేసి అలసిపోయి వున్నది. మరో రెండు గంటలు విశ్రాంతి తీసుకుంటే కాని ఎవర్నీ చూడరు. ఇంకొకాయన ఎక్కడికో షికారువెళ్ళాడు! 'డ్యూటీ వుండగా షికారేమిటి, బుద్ధిలేక?' అని అడగాలన్పించింది కోపంలో శ్రీలక్ష్మికి. కాని తమాయించుకున్నది.

"మరో రెండు గంటలవఱకూ ఈ బాధ భరించలేరు. కనీసం 'ఫస్ట్ ఎయిడ్' చేయడానికైనా ఎవరూ లేరా?" అనడిగింది శ్రీలక్ష్మి.

"లేరు!" నర్సు టెక్కుగా చెప్పింది.

"ఛీ, హాస్పిటల్స్ యింత అధ్వాన్నంగా ఎప్పుడు మారిపోయాయి?" స్వగతమే అయినా పైకే విన్పించాయి శ్రీలక్ష్మి మాటలు. "ఆ షికారు వెళ్ళినాయనను తీసుకురాగలవా?" అంటూ అయిదు రూపాయలు తీసి వార్డుబోయ్ చేతిలోవుంచింది. డబ్బు చూడగానే వాడిముఖం వికసించింది.

"వెళ్ళి తీసుకొస్తాం, ఇప్పడే మనిషిని పింపిస్తాను." వెళ్ళిపోయాడు. "లంచం తీసుకోవడం వంటిదే ఇవ్వడం గూడా" అనే సంగతి తనకు సాధారణ వ్యక్తులందరికంటె బాగా తెల్సు. కాని మరి అవసరాలు? ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో తానే నీతిని విస్మరించింది కదా—మరి సాధారణుల సంగతి? తమకే ఇంత నిర్లక్ష్యం చేస్తున్న వీళ్ళు బీద వారినీ, విద్యాహీనులనూ అసలు లెక్క చేస్తారా? పాపం, అటువంటి వాళ్ళు అవసరార్థం ఏ అడ్డదార్లూ త్రొక్కకుంటే ఎం చేస్తారు?'

ఓ పావుగంట గడిచింది; దివినుండి భువికి అవతరించిన ఆపద్బాంధవునిలాగా పోజు పెట్టి, పాంటు జేబుల్లో రెండు చేతులూ వుంచి, ఠీవిగా ఎటూ చూడకుండా కట్టిలాగా నడచివచ్చాడు, డాక్టరు లింగరాజు.

"హల్లో డాక్టర్ రాజూ! గుడీవెనింగ్." ఒయ్యారమంటా ఒలుకబోస్తూ పలుకరించారతడిని, అక్కడవున్న నర్సులు నలుగురూ.

"వాటీజ్ ది మాటర్?" ధుమ ధుమ లాడ్తూ అడిగాడతడు నర్సులను.

వాళ్ళు వివరించారు. అంతవఱకూ శ్రీలక్ష్మి, సుశీలల అస్తిత్వమే గుర్తించని అతడి కళ్ళు ఇప్పుడు ఒక్కసారి తీక్షణంగా వారిపైకి తిరిగాయి. సుశీలాదేవి విరిగిన చేతిని అటు యిటు త్రిప్పి చూచాడు.

"నేను ఫోర్తు యియర్ మెడికల్ స్టూడెంటును. రిటైర్డు జడ్జి శ్రీనివాసరావుగారి అమ్మాయిని." అని తనను తాను పరిచయం చేసుకొన్నది శ్రీలక్ష్మి.

అతడు సరకే జేయలేదు! ఒక్కసారి శ్రీలక్ష్మినిచూచి, నర్సులవైపు తిరిగి విసుగ్గా అన్నాడు: "డాక్టర్లు కూడా మనుష్యులేనండీ, డాక్టర్లకు వింతా, వినోదం, విశ్రాంతి అక్కర్లేదా? ఎక్కడకు వెళ్ళినా అలా వెనుకనే చేట పట్టుకు వచ్చేస్తారెందుకూ? నోనో. దటీజ్ టూ బాడ్."

శ్రీలక్ష్మికి పరమసహ్యం వేసింది. 'వీడసలు డాక్టరేనా? వెధవ భాష—ఆ మాటలేంటి? ఆ తీరేమిటి? అనుకున్నది.

"మరి వీరు ఇంగారు పడ్తూంటే, మీకోసం వచ్చామండీ." అన్నారు నర్సులు.

ముఖం ముడుచుకుని ఒక పుస్తకం తీశాడు. "ఎక్కడ పడ్డారు? ఎలా పడ్డారు?........." నర్సు అడిగిన లిస్టంతా డిటోగా అడగడం మొదలుపెట్టాడు. మధ్య మధ్యన అతడికి రాని విషయాలు వాళ్ళు చెప్పి సాయంచేస్తున్నారు. అసలు రహస్యం తెలిసిపోయింది శ్రీలక్ష్మికి. తెలివి తక్కువ అవతారమన్నమాట! నర్సులు నేర్పుతున్నారు. అసలతడికి ప్రాథమిక విషయాలే బాగా తెలిసినట్లులేవు! టెక్కూ నిక్కూ మాత్రం కావలసినంత!'

అంతా వ్రాసి పూర్తిచేసి, "ఇందులో ఏమంత ఇంగారు పడవలసిన దున్నది? హాస్పిటల్‌లో జాయిన్ చేసేయండి. రేపు చూద్దాం." అంటూ బయటకుపోయాడు.

"రేపా?" ఆశ్చర్యం కూడాకాదు. మరో రకమైన అనుభూతితో, అసహ్యంతో ప్రశ్నించింది శ్రీలక్ష్మి.

"ఔను." నిర్లక్ష్యంగా అంటూ వెళ్ళిపోయాడు.

"డాక్టరుగారు చెప్పారుగా? చేర్పేయండి. జాయినింగ్ ఫీజు......" నర్సుల మాటలను సగంలోనే త్రుంచేసింది శ్రీలక్ష్మి. "ఇవాళ చెయ్యి విరిగితే రేపు ప్రొద్దుటి వరకూ [illegible] చేయించుకోలేనంత దుర్గతిలో లేం. డాక్టరుగారు చెప్పవలసిన మాటేనా అది? ఇటువంటివి చూస్తే [illegible], హాస్పిటల్స్ అంటే రాను రాను [illegible]. పదమ్మా వెళ్ళిపోదాం." తల్లిని లేవదీసి [illegible].

"డాక్టరుగా[illegible] తెలుసా?" నర్సు కీసుకగా అన్నది.

తల్లిని వెనక సీటులోకి ఎక్కించి పరుండబెట్టి డ్రైవింగు ముందు కూర్చుని [illegible] వేసుకుంటూ అన్నది శ్రీలక్ష్మి సమాధానంగా, "[illegible] పదల్లా ప్రజల్లో మూఢపంతులు మంది ఏరంగంలో వున్నా తమ విలువను మరచిపోయి, సినిమా ప్రణయాలనే గ్రుడ్డిగా అనుసరించాలనే వెఱ్ఱిలో పడిపోతున్నారి. ఈ హాస్పిటల్లో నాకు వైద్యసౌకర్యాల కంటే, సినిమా ప్రభావాలు ఎక్కువ కనిపిస్తున్నాయి." అంటూనే కారు స్టార్టు చేసింది. ఆ శబ్దంలో నర్సుల గుసగుసలు కలిసిపోయింది.

గేటు దగ్గర మలుపు త్రిప్పటానికి స్లో అయిన కారు దగ్గరకు ఒక నర్సు పరుగు పరుగున వచ్చింది." డాక్టర్ మిస్ సిల్వియా మిమ్మల్ని పిలుస్తున్నారు."

"ఎందుకు [illegible] ఇంజను ఆపకుండానే దారిలో ఆపి, ఎదురడిగింది శ్రీలక్ష్మి, "ఎవరా సిల్వియా?"

"ఇందాక ఆపరేషన్ చేసి అలసి వున్నారని చెప్పాంకదా? ఆమె!"

"ఏమిటి విషయం?"

"ఆమె గారి స్నేహితుడొకాయన ప్రైవేట్ ప్రాక్టీషనర్ వున్నారు, డాక్టర్ రామమోహన్ అని. మీరు అక్కడికి వస్తే అక్కడ ఆవిడా ఆయనా కలిసి కట్టు కడతారట. ఎక్స్‌రే తీసిందట్ల ఒక తొంబై వరకూ ఔతుంది."

"ఇదన్నమాట అసలు ఏడుపు! ఇక్కడిచ్చే జీతాలు కాక ఇంకా ప్రైవేట్ ప్రాక్టీషనర్స్‌తో చేతులు కలిపి, ఇక్కడికొచ్చిన కేసులు అక్కడికి తీసుకుపోయి డబ్బు సంపాదిస్తారన్నమాట! అలాయిచ్చుకోలేని వాళ్ళగతి అధోగతే! ఛీ ఛీ ప్రాణాలు నిలబెట్టే ఈ మహత్తర విద్య యింతటి నీచుల చేతిలో పడి ఎంత దుఃఖిస్తున్నదో! నాకే అధికారముంటే యిటువంటి హీనులందరికీ వెంటనే పట్టాలు రద్దుచేసేద్దును!" అంటూనే కారు వేగం హెచ్చించింది.

(సశేషం)

# స్త్రీలూ-ఉద్యోగాలూ

ఆమంచర్ల కృష్ణకుమారి

> వ్యక్తిస్వాతంత్ర్యంలేని సామ్యవాదం బానిసత్వం, సామాజిక నియమబద్ధంకాని వ్యక్తిస్వాతంత్ర్యం అరాజకం అన్నాడు హెచ్. జి. వెల్సు. భావిప్రపంచ నిర్మాణానికి మూలస్తంభాలైన నేటి యువతీయువకులు చాలా జాగ్రత్తగా ఆలోచించవలసిన వాక్యమిది.

హౌరా మెయిలు చాలా వేగంగా పరుగెడుతోంది. బండి వేగానిక్కీ ఊపుకీ చేతిలో పుస్తకం అల్లాడిపోతున్నా, లక్ష్యం చేయకుండా చదువుతూ డా॥ నో (Dr. No) పాతాళప్రపంచం లోనికి జేమ్సుబాండుతోపాటు ప్రవేశించడంలో నిమగ్నురాలి నైపోయాను.

"ఏ ఊరిలో ప్రాక్టీసు చేస్తున్నారు?" లీలగా అపరిచిత కంఠంతో ప్రశ్న వినిపించింది. నన్ను కాదులే అనుకొని తల ఎత్తకుండా అలానే చదువుకుంటున్నాను.

"క్షమించండి. మిమ్మల్నే నమ్మా-ఏఊరులో ప్రాక్టీసు చేస్తున్నారని అడిగాను". ఎదుటి సీటులో కూర్చున్న పెద్దమనిషి ప్రశ్న అడుగుతూంటె ఉలికిపడి ఊహాలోకాన్నుండి, వాస్తవిక జగత్తులోనికి దిగి అడిగాను, ఖంగారుగా.

"ప్రాక్టీసా, ఏంప్రాక్టీసండీ"?

"అదే మెడికల్ ప్రాక్టీసా, లీగల్ ప్రాక్టీసా?"

"లేదండీ, నేను డాక్టర్నిగాను, లాయర్నిగాను".

"మరేమిటమ్మా, టీచరా?"

"టీచర్ని కానండి,"

"ఏదన్నా ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నారా?"

"లేదండి."

ఇలా కొంతసేపు గుడి గుడి గుంచం, గుళ్ళో రాగం సంభాషణ అనంతరం అనిపించింది, నే నేమిటి చేస్తున్నానో, ముందే చెప్పేస్తే, ఆయనకూ, నాకూ కూడా బాధా విముక్తి అయి ఉండును గదా అని.

## మన ఆత్మ కథ రాస్తారా?

ఇల్లాంటి ప్రశ్నలు కొంత నయం. కొందరి ధోరణి వింటే, వారికి మనతో వియ్యమొందాలని ఉందా, లేక మన ఆత్మ కథ గాని వ్రాసి పెట్టాలనే సంకల్పమా అని సందేహం రాక మానదు.

స్త్రీలు విద్యావంతులై ఉద్యోగ రీత్యా గాని, ఇతర విద్యా వ్యాపకాల వలనగాని పదిమందిలో, పురుషులతోపాటు తిరుగుతూ ఉంటే, వారి గత చరిత్ర, ప్రస్తుత పరిస్థితులూ, పెండ్లీ, పిల్లలూ-ఒకటేమిటి_వారి ఆంతరంగిక విషయాలన్నిటినీ తెలుసుకోవాలనే కుతుహలంతో, ఎంతో పరిశోధన, అంతులేని ఊహాగానాలూ జరుగుతుంటాయి. ఇతరుల ఆంతరంగిక విషయాల్లో మనమేమీ ఆసక్తి చూపించమే, మరి మన స్వంత విషయాల గురించి, వీరందరికీ ఎందుకీ తాపత్రయమూ అని తరచుగా కోపమూ, అసహనమూ కలుగుతాయి. ఇటువంటి సందర్భాలలో, మా సంగతి మీ కెందుకు అని తిరుగుబాటు చేయడం కంటె, వారడిగిన ప్రశ్నలకూ, అడగలేక సంకోచిస్తూ ఆపిన ప్రశ్నలకూ వరుస క్రమంతప్పకుండా నింపాదిగా సమాధానం చెప్పడమే క్షేమం. ఎందుకంటే, సాటి వారితో సంబంధం లేకుండా మనం సాధించగల కార్యాలు, సంతరించుకోగల సౌఖ్యాలు ఏ పాటివి? విభిన్న మనస్తత్వాలూ, దృక్పథాలు గల వ్యక్తుల మధ్య "తానొవ్వక, నొప్పించక" జీవన పరమార్థాన్ని సాధించగల వారే ధన్యజీవులు_పురుషులైనా, స్త్రీలయినా।

## వెనుకటి కాలంలో

ఉపనిషత్తుల కాలంనుండీ "ఉద్యోగం పురుషలక్షణం" అని పురుషులకూ "ఇయంగేహేలక్ష్మి" అని స్త్రీలకూ చీటీ లంటించేసి వారి జీవన వ్యాసంగాల్లో ప్రత్యేక పరిధులు ఏర్పరచారు. కాలగమనంతో, వాడుకతో, వర్ణాశ్రమ ధర్మాల్లాగా ఇవి సుస్థిరమయ్యాయేగాని సడలిపోలేదు. జీవన భృతి సంపాదనా కార్యక్రమం పురుషుడిదైతే, గృహమే స్త్రీకి జీవనరంగంగా పరిమితమయింది.

## కాలం మారింది

కాని ప్రస్తుతం పరిస్థితి వేరు. విజ్ఞానం విస్తరిల్లి, జీవితావసరాలూ, జీవన ప్రమాణాలు పెరిగి, స్త్రీవిద్య బహుళవ్యాప్తిలోనికి వస్తూ, సాంఘిక వ్యవస్థే తారుమారవుతూన్న ఆధునిక యుగం ఇది. అవసరాన్ని, అవకాశాన్నీ బట్టి స్త్రీలు గూడ సంపాదనా మార్గాన్ని వెతుక్కొని, పురుషులతోపాటు అన్ని రంగాల్లోనూ

ఉద్యోగానికి ఉపక్రమిస్తున్నారు. దీని వలన స్త్రీలకు వ్యక్తిగతంగాను, సాంఘికంగానూ, అనుభవంలోనికి వస్తున్న సాధక బాధకాలను గురించి కొంత ఆలోచించడం అవసరం.

పారంపర్యంగా ఉద్యోగం మా జన్మహక్కని భావిస్తూ వచ్చిన పురుషుల రంగంలోనికి స్త్రీలు ప్రవేశించడంతో వారి అహం దెబ్బతింటోంది. అనాదిగా ముంచినా, తేల్చినా నీతోటిదే లోకమన్న స్త్రీ విద్యలో, భావవికాసంలో, ఆర్థిక సముపార్జనలో—అన్నింటా నీతో సమానమని నిరూపిస్తూ ఉండేసరికి, తరతరాలుగా పురుషుల తత్వంలో జీర్ణించి ఉన్న, అధిక్యతా భావం కొంత బాధపడుతోంది. దీనితో వారిలో ఉద్యోగం చేసే స్త్రీలంటే విముఖతా, వ్యతిరేకభావం కలగడం కద్దు. ఇందులో అసహజం గాని, మనం పేచీపడవలసిన విషయంగాని నిజంగా ఏమీలేదు. మన స్వంతం అనుకునే దాన్ని, పదిమందిలో పంచుకోవలసి వచ్చేప్పుడు మానవులందరికీ కలిగే బాధేఇది. పురుషుల ఈ దృక్పథం క్రమంగా మారుతుంది. కాలంతోపాటు పూర్తి పరివర్తన చెందుతుంది. అందాకా సహృదయంతో, సహనంతో సంచరించడం స్త్రీల ధర్మం.

మరి బాధేమిటంటే, స్త్రీలు ఉద్యోగ నిర్వహణలో ఎంత మెళకువగా, సమర్థతతో వ్యవహరించినా, పురుషులు సాధారణంగా హర్షించలేరు. హర్షించడం న్యూనతగా భావిస్తారు— ఎంతో సహృదయులయితే తప్ప. వీరివల్ల ఏమవుతుందనే నిరసన భావమే ఎక్కువ. కాని ఇది ధర్మంకాదు. ప్రకృతి సహజంగా స్త్రీలకు ఒక ప్రత్యేక గుణముంది. ఏదిచేసినా—గృహ నిర్వహణ అనండి—పిల్లల పెంపకం కానీండి—ఉద్యోగం చేయడమే అనండి—ఏకాగ్రతతో, బుద్ధినంతా కేంద్రీకరించి దీక్షతో చేస్తారు. పురుషుల కుండేటన్ని వ్యాపకాలు సాధారణంగా స్త్రీలకు ఉండవు కాబట్టి, ఇది సాధ్యంకూడా. కాని ఈ విషయం సులువుగా మగవారు ఒప్పుకోరు. "ఈ ఆడవాళ్లు ఏం చేయగలరు" అనో "పాపం ఆడవాళ్లు అంతకంటే వాళ్లవల్ల ఏమవుతుంది" అనో సరిపెట్టుకుంటారు.

## కత్తిమీద సాము

ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలకు, ఇతరుల ప్రవర్తన వలన కలిగేబాధలు కొన్ని. 'ఇంటి హద్దులు దాటి, ఉద్యోగాలు చేయడానికి వచ్చారు కాబట్టి, మిగతా నైతికంగా ఉండే హద్దులనేవి వుండవు. వారు యెప్పుడూ ఎందునా అందుబాటులో వుంటారు' అనే నమ్మకం కొంత మందికి లేకపోలేదు. తమతో పాటు సమానంగా పనిచేస్తూ ఉన్న స్త్రీలను గౌరవించాలనే మానవ న్యాయాన్ని గుర్తుంచుకోకుండా వుండేవారు కొందరు—కనీసం స్త్రీలకు నమస్కరించడానికికూడా మనస్కరించని వారు కొందరు కొద్ది పరిచయంతోనే అతి చనవుగా వ్యవహరించేవారు కొందరు; స్త్రీలు ఎదుటికి రాగానే లేచి నమస్కరించి ప్రసన్నంగా మాట్లాడి మర్యాద చేసేవారు కొందరు—కంటకావృతమైన ప్రపంచంలో ఈ స్త్రీలను కాచి రక్షించాలని కంకణం కట్టుకున్నట్లు ప్రవర్తించే వారు కొందరు—స్త్రీలతో స్నేహంగా మాట్లాడితే చూచే వాళ్లు ఏమనుకుంటారో అనే భయంతో, లేనిపోని గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకొని ముభావంగా ఉండేవారు మరి కొందరు. వీరందరి మధ్యా స్త్రీజీవితం కత్తితో సాములాటిది.

ఇవన్నీ చాలవన్నట్లు స్త్రీలు స్వయంగా తెచ్చి పెట్టుకొనే బాధలు కొన్ని. అన్ని రంగాల్లో మాకు సమాన హక్కులు అవకాశాలు కావాలంటూ, మేము స్త్రీలం గనుక మాకు ప్రత్యేక రక్షణలు, సదుపాయాలూ కావాలని ఆందోళన చేస్తాము. ఆందోళన చేయకపోయినా అసంతృప్తిపడుతాము. పురుషులతోపాటు అన్నింటా సమానమని నిరూపిస్తూ ప్రత్యేక హక్కులు కావాలనడం ఎంతవరకూ సమంజసం అని నిదానించి ఆలోచించము.

ఉద్యోగ రీత్యా, పదిమందితో వ్యవహరించ వలసిన స్త్రీలు నడవడిలో, వేషధారణలో ఎంతో మెళకువగా ఉండాలి. మాటలో, మర్యాదలో, ప్రవర్తనలో ఒకరికి వేలెత్తి తప్పు ఎంచే అవకాశం కలగకుండా చూచుకోవాలి. అపోహలకు గాని, వారా ప్రచారానికిగాని తావిస్తే, ఉద్యోగంలోనూ, అంతరంగికతంలోనూ శాంతి సౌఖ్యాలు కరువవుతాయి. జీ.వి

## దూరదృష్టి లేకపోతే

ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీలకింకా కొంత వరకు క్రొత్త. స్వంత సంపాదనలు ప్రారంభించగానే అన్ని విధాలా స్వతంత్రుల మనే భావంతో కొంత విశృంఖలంగా, దూరదృష్టి రహితంగా ప్రవర్తించడం కద్దు. ఇలాగయితే చేజేతులా వనితలే తమకుతాము హాని చేసుకోవడమన్నమాట.

ఉద్యోగినులుగా, సంఘ సేవికులుగా పని జేసే స్త్రీలను చూస్తే మిగతా స్త్రీలకు కొంత కనీకనిపించని అసూయ; తమకులేని ఆర్థిక స్వాతంత్ర్యం వారికున్నదే అనే బాధ; తమకు లేక పోయినా, కనీసం వారినయినా పదిమందిలో తిరిగే ధైర్యమూ, స్వేచ్ఛా ఉన్నాయనే తృప్తి, సంతోషమూ—ఈ భావాలన్ని మిళితమయిన విచిత్రానుభూతి. దీనితో వారిని కొంతవేరుగా చూడడమూ, మనసులోనైనా దూరంగా ఉంచడం జరుగుతుంది. దీనికంతా ఫలితమొక్కటే. విద్యావంతులు, ఉద్యోగినులైన స్త్రీలు; ఇటు సాటి స్త్రీలకూ, అటు పురుషులకూ, సన్నిహితులు కాలేక, మానసికంగా ఒంటరితనంతో బాధ పడతారు.

ఇలా చిన్నవీ, పెద్దవీ, మనసుని బాధపెట్టేవీ, చూచీ చూడనట్లు తుడుచుకు పోగలిగేవీ, నిదానంగా ఆలోచిస్తే నవ్వించేవీ— ఎన్నో రకాల బాధలు లేకపోలేదు. వీటన్నింటినీ సహిస్తామేగాని, పూర్వపరిస్థితి కావాలని కోరం. విద్యతో కలిగే మనో వికాసమూ, విశాల దృక్పథమూ, భావ చైతన్యమూ, ఆర్థిక స్వాతంత్ర్యంతో మారే వ్యక్తిత్వపు విలువలూ—ఇవన్నీ కూడా జీవితంలో పరిపూర్ణత్వాన్నీ, పరమార్థాన్నీ అభిలషిస్తాయే గాని, అంశలను అలించవుగదా!





తల్లి    చిత్రకారుడు : ఎస్. వి. రామారావు

చలసాని ప్రసాదరావు



సద్దికి    చిత్రకారుడు : జయంత్

# ఆధునిక ఆంధ్ర చిత్రకళ

ఆధునిక చిత్రకళ అనగానే సామాన్యులే గాక చిత్రకళ పట్ల ప్రత్యేకాభిరుచి ఉన్నవారు సైతం ఏవగించుకుంటున్న పరిస్థితిని మన మీనాడు గమనిస్తూనే ఉన్నాం. అందుకు కారణం ఏమిటి? ఆలోపం ఆధునిక చిత్రకళదా? చిత్రకారులదా? లేక ప్రేక్షకులదా? ఈ దశలో మన ఆధునిక ఆంధ్ర చిత్రకళా రంగ పరిస్థితి, స్థాయి, స్థానం ఏమిటి? అనే ప్రశ్నలకు జవాబులు ఏమంత సులభం గాదు.

ఇటీవల లండన్‌లో జరిగిన కామన్వెల్త్ చిత్రకళా ప్రదర్శనంలో అత్యున్నత బహుమతిని మన ఆంధ్ర యువకుడు ఎస్. వి. రామారావు సాధించి ఆంధ్ర చిత్రకళా రంగానికే గాక యావద్భారతానికీ గర్వ కారణం గావటాన్ని మనం గమనించాం.

ఆ మిత్రుడు భారత దేశాన్నుండి లండన్‌కు వెళ్ళిన క్రొత్తలో నాకు వ్రాసిన ఒక జాబులో "నేనిప్పుడిక్కడ ఏంచేస్తున్నదీ చెపితే మీరు ఆశ్చర్య పడతారు. నవ్వుకుంటారు. నేనిప్పుడు చేస్తున్నది మోడల్సు ముందు కూర్చుని స్కెచ్‌లు వేయటం లైన్ డ్రాయింగ్స్ తయారు చేయటం. ఇది వింతగా అనిపించటం లేదూ?" అని.

చిత్రకళాభ్యాసం ఆరంభించిన ప్రాథమిక దశలో ప్రతి విద్యార్థీ చేసేది మోడల్సు ముందు కూర్చుని స్కెచ్‌లూ, డ్రాయింగులూ వేయగలగటాన్ని అభ్యాసం చేయటం. అలాంటిది అయిదేళ్ళ చిత్రకళాభ్యాసం చేసి, తర్వాత మరో రెండేళ్ళ కేంద్ర ప్రభుత్వ రీసర్చ్ స్కాలర్‌గా ప్రత్యేక శిక్షణ పొంది ఆతరువాత విదేశాలకు పయనమైన ఈ ఆంధ్ర యువకుడు అక్కడ తన కృషికి ఈ విధంగా శ్రీకారం చుట్టాడూ అంటే వింతగానే అనిపిస్తుంది.

కాని, అందులోనే ఉంది అంతర్జాతీయ ఖ్యాతినందుకున్న ఆ ఆంధ్ర యువకుని విజయ రహస్యమే గాక ఆధునిక చిత్రకళా మర్మంకూడా.



మాలి                    చిత్రకారుడు : ప్రేమానంద్

భావనను, వస్తువులో, చిత్రణా విధానంలో, సాంకేతిక విలువలలో నూతనత్వంతోపాటు అత్యున్నత స్థాయిని, పరిపూర్ణతను సంతరించుకో యత్నిస్తున్న ఫలితమే ఆధునిక చిత్రకళ. ఈ నాటి ఆధునిక చిత్రకళ వీటన్నింటినీ కలిగి ఉన్నదా? అంటే అది వేరే ప్రశ్న. కాని ఆధునిక చిత్రకళకు మూలం మాత్రం ఇది. క్లుప్తంగా, సాధారణ కళా రూపం యొక్క అత్యున్నత దశే ఆధునిక చిత్రకళ.

ఆధునిక కళకు ఆది పురుషుడైన పికాసో తన నూతన సృష్టికి ప్రేరణను ఆదిమ వాసులనబడే వారి కళా రూపాల నుండే పొందానని తానే స్వయంగా చెప్పుతున్నాడు. కనుపించే రూపాలను కనుపించే రూపాల్లోనే చెప్పటంలో చిత్రకారుని వ్యక్తిత్వం ఎక్కడ? అతని ప్రత్యేకత ఏమిటి? కనుపించని రూపాలను వెలికి తీసి క్రొత్త భావాలను క్రొత్త పద్ధతుల్లో చెపుదాం. ప్రేక్షకునిలో జిజ్ఞాసను రేకెత్తిద్దాం. అనే భావంతో ఆరంభమయిన ఈ ఆధునిక కళ అనేక కారణాల వల్ల ప్రపంచ వ్యాప్తంగా విశేష ప్రచారంలోకి వచ్చి అందర్నీ ఆకర్షించింది. అనుకరింప జేసింది. మన దేశంలోని పరిస్థితి ఇందుకు భిన్న మయినదేమీ కాదు. అలాగే ఆంధ్ర చిత్రకళా రంగమూనూ. "ఈ తరం" వారసదగిన ఆంధ్ర యువ చిత్రకారులలో అధిక సంఖ్యాకులు ఆధునిక ప్రక్రియలలో తమ కళా సృష్టిని కొనసాగిస్తున్న వారే।

మన ఆంధ్ర చిత్రకళా రంగాన్ని నిశితంగా పరిశీలిస్తే పదేండ్ల క్రితం వరకూ వర్ధిల్లిన చిత్రకళా ప్రక్రియలకూ ఈ నాటి వాటికీ హస్తిమశకాంతరం గోచరిస్తుంది. గతంలో మన చిత్రకారు లందరకీ వారి పరిసర జీవన దృశ్యాలూ, ప్రకృతీ, ఊహా జగత్తులోని అపురూపాలూ ప్రధానమైన చిత్రిత వస్తువులుగా విలసిల్లాయి. ఆ పరిధుల్లోనే వారు చిత్రకారులుగా తమ యావచ్ఛక్తిని వినియోగించి అపూర్వ మనదగిన కళాఖండా లెన్నింటినో సృష్టించారు. నాటి కళ ప్రజల కత్యంత సన్నిహితమైనట్టిది. వారికేలాంటి శ్రమా లేకుండా సులువుగా అర్థం కాగలది. వారి కొరకే ఉద్దేశించబడి నట్టిది. కనుకనే నాటి చిత్రకారులు సునాయాసంగా ప్రజాదరణకు పాత్రులు కాగలిగారు.

కాలం గడచి సామాజిక విధానంలో సంభవించిన మార్పులతో పాటే సహజంగానే చిత్రకళా రంగంలోనూ గణనీయమైన మార్పులు రాసాగినాయి. ఆరంభ దశలో అనుసరణీయంగానూ, ప్రామాణికంగానూ ఆదర్శంగానూ ఉంటూ వచ్చిన వంగ ప్రాంతపు చిత్రకళ స్థానాన్ని క్రమంగా ఆధునిక ప్రక్రియలు పొందసాగినాయి. ఇందుకు నూతనంగా నెలకొన్న లలిత కళా అకాడమీలూ, వాటి తరఫునా వాటి అనుబంధ సంస్థల తరఫునా ఏర్పాటవుతూన్న చిత్రకళా ప్రదర్శనలూ, ఆయా ప్రదర్శనల్లో గౌరవ పురస్కారాలకూ, బహుమతులకూ పాత్ర మవుతున్న ఆధునిక ధోరణులూ ప్రధాన కారణాలుగా చెప్పుకో వచ్చును.

ఆ విధంగా నేటి మన ఆంధ్ర చిత్రకారులలో అధిక సంఖ్యాకులు నేడు మనం దేనినైతే ఆధునిక చిత్రకళ అని అంటూన్నామో ఆ కళా పద్ధతులను అభిమానిస్తున్నవారే. అందు కనుగుణంగా చిత్రిస్తున్న వారే।

ఈ నాడు మనకూ లలిత కళా అకాడమీ ఉన్నది. చాలా జిల్లా కేంద్రాలలో చెప్పుకోదగిన కృషిచేస్తున్న స్థానిక ప్రాధాన్యత గల అకాడమీ అనుబంధ సంస్థలూ ఉన్నాయి. వీటన్నింటి తరఫునా అసంఖ్యాకంగా చిత్రకళా ప్రదర్శనాలు జరుగుతున్నాయ్. ఈ ప్రదర్శనలద్వారానే ఈ నాడు మన చిత్రకారులు తమ కృషి ఫలితాలను ప్రజలముందుంచగలుగు తున్నారు. గనుక ప్రస్తుత పరిస్థితుల్లో, పరిమిత పరిధుల్లోనే అయినా, నేటి మన చిత్రకళ రూపురేఖలను, స్థాయిని చూపగలవీ ప్రదర్శనలే.

ఈ నాడు నిర్విరామంగా చిత్రకళా కృషిని సాగిస్తూన్న, ఎన్న దగిన స్థాయిగల, ఏదో ఒక రూపంలో గుర్తింపబడిన చిత్ర



నిర్భాగ్యులు                    చిత్రకారుడు : వై. హనుమాన్ సూరి

చూరుతే కనీసం వంద మందికి తక్కువ గాకుండా ఉన్నారు తెలుగు దేశంలో. వీరిలో చాలామంది ప్రతిభావంతులుగా ఏదో ఒక రూపంలో గుర్తింపు పొందినవారే. ఆవిధంగా ఈ రంగంలో నిలదొక్కుకున్న వారే! కాని, శోచనీయమైన విషయమేమంటే ప్రముఖ ఆంధ్ర చిత్రకారులు పదిమంది పేర్లు పేర్కొన్నామంటే నిదానంగా ఆలోచించ వలసిన, పేర్లకోసం తడుముకో వలసిన స్థితిలోనే మనమున్నామీనాడు. ఆపేర్లుకూడా గత తరం వారివే కావటం మర్రో విశేషం.

సాంకేతిక నైపుణ్యంలో గాని, భావనాబలంలో గాని, చిత్రణా సామర్థ్యంలో గాని మన యువ చిత్రకారులు మరెవరికీ తీసి పోగల వారుకాదు కూడా. అయినప్పటికీ నేటి మన చిత్రకళా రంగ పరిస్థితి ఒక లలిత కళా అకాడమీ అనేక అనుబంధ సంస్థలు ఏర్పడి ఒక క్రమ పద్ధతిలో ఈ రంగానికే తమ కృషి సంకితం చేస్తూన్న దశలో కూడా గర్వించదగిన, ధీమాగా చూపుకోగల, చెప్పుకోగల స్థాయిని ఇంకా అందుకోలేదంటే అది ఆలోచించ వలసిన విషయమే.

ప్రధానంగా ఆధునిక శైలుల పట్ల సరియైన అవగాహన లేకపోవటం వలననే ఈ లోపం ఎదురవు తున్నది.

మార్పు నాశించకుండా ఏ రంగంలోనూకూడా అభివృద్ధిని ఆశించలేం. అనేక సంవత్సరాలుగా చూస్తూఉన్న దృశ్యాలనీ, భావాలనే తిరిగి చిత్రించినా, అవి ఎంత ఉన్నత ప్రమాణాలలో ఉన్నా ప్రారంభ దశలోని తృప్తిని, అనుభూతిని అవి ఇవ్వలేవు. అది సహజం. పైగా త్వరితంగా మార్పులకు లోనవుతూన్న సాంఘిక వాతావరణాన్ని, తద్భవమైన ఆలోచనా రీతులను పాత పద్ధతుల్లో నిరూపించి విజయవంతం కావటమూ కష్టతరమే ఈ కారణాల వలననే ఆధునిక కళ అనన్య ప్రచారంలోకి వచ్చింది. అంతేగాని అనేక మంది విసుగుతో వ్యాఖ్యానిస్తున్నట్లు



వారిద్దరూ చిత్రకారుడు : చరణ్‌సింగ్ గిల్



యువతి చిత్రకారుడు : పి. టి. రెడ్డి

అది అర్థం, పర్థం లేనిదీ గాదు. ఎస్కేపిజమూ గాదు.

కాని, దీనినొక ఎస్కేపిజంగా భావించటంలోనే నేటి పరిస్థితికి మూలం చాలా వరకూ ఉంది. యువచిత్రకారు లనేకులు తమ చిత్రాలను గురించి తామే సరియైన వివరణ నివ్వలేక పోవటమే ఇందుకు తార్కాణం. చిత్రకళా ప్రదర్శనాల్లో విభిన్న దృక్పథాలకూ సరియైన ప్రాతినిధ్యం లభించకపోవటం, ఎన్ని తక్కువ చిత్రాలను సెలక్టుచేస్తే అ ప్రదర్శన అంత ఉత్తమ శ్రేణికి చెందిన దవుతుందనే దురవగాహన, న్యాయ నిర్ణేతలకు ఒక ప్రాతి పదిక అనేది లేకుండా వారి ఇష్టా నిష్టాలకు వది లేయటం, చిత్రకారుడు చిత్రకారుడు గానే జీవించగల పరిస్థితులు సమీప భవిష్యత్తులో కనిపించక పోవటం, వీటన్నింటినీ మించి మారిపోతున్న నేటి సామాజిక వ్యవస్థలో చిత్రకారుని స్థానం, అతని కర్తవ్యం, మార్గం సరిగా స్పష్టం గాకపోవటం వంటి కారణాల వల్ల ప్రధానంగా ఈ నాడు మన చిత్రకళా రంగంలో ఒక అయోమయావస్థ నెలకొని ఉన్నది.

ఈ పరిస్థితి మారి ఆధునిక ఆంధ్ర చిత్రకళా రంగం సర్వతోముఖంగా వర్ధిల్లి అగ్రశ్రేణి నాక్రమించ గలగటం ఏమంత కష్ట సాధ్యంగాదు. ఇంతకు ముందే పేర్కొన్నట్లు మన చిత్రకారులంతాకూడా సర్వ విధాలా శక్తి మంతులు. కాని, వారి నందరినీ ఒకచోట చేర్చగల ఐక్య వేదిక, వారికి తమ కర్తవ్యాన్ని, స్థాయిని చెప్పగల చర్చావేదిక లోపించాయి. కనుకనే ఏ కళా రూపం ప్రాబల్యంలో వుంటే వాటినే అనుసరించే మనస్తత్వం కనిపిస్తున్నది.

అన్ని హంగులూ ఉన్న మన లలిత కళా అకాడమీ ఈ కర్తవ్యాన్ని నిర్వహించ గలదనీ, ఆధునిక ఆంధ్ర చిత్రకళకు గౌరవ పీఠాన్ని సాధించ గలదనీ ఆశిద్దాం. 

# "కృషిపండిత్" గంగన్న

1966 సంవత్సరం డిసెంబరు 18 వ తేది_తెనుగు వారందరూ గర్వించ వలసిన దినం.

ఆనాడు ఒక తెనుగు రైతును భారతదేశం గౌరవించింది.

ఆ తెనుగు రైతుపేరు శ్రీ ఎం. గంగన్న. 1965_66 సంవత్సరంలో యావద్భారత దేశంలోనూ అత్యధికమైన వరి దిగుబడిని సాధించి నందుకు గంగన్నకు ఢిల్లీలో జరిగిన పెద్ద సభలో నగదు బహుమతి రు 6000_లనూ, 'కృషి పండిత్' బిరుదాన్నీ ఇచ్చి సన్మానించారు. అంతేకాదు. 'సుబ్రమణ్యం' బహుమతి క్రింద ఒక ట్రాక్టరునూ బహూకరించారు.

ఇటువంటి సుదినం కోసం_తాను చేసిన కృషి గుర్తింపబడే మంచి దినం కోసం_ఎదురు చూడని వాడెవ్వడూ వుండడు. కాని ఇంత గౌరవమూ ఒక్కనాటి సంపాదన కాదు, ఇంత ఖ్యాతీ ఒక్క రోజులో రాదు. శ్రీ గంగన్న విషయంలోనూ ఇంతే.

కర్నూలు జిల్లా ఎమ్మిగనూరుకు చెందిన గంగన్న స్థితి మంతులైన వ్యాపారస్థుల కుటుంబంలోని వారు. ఆ కుటుంబంలో ఆయన ఒక్కరే వ్యవసాయాన్ని చేపట్టిన వారు.

1961_62 లో ఆయన, తాలూకు స్థాయి వరిపైరు పోటీలలో పాల్గొన్నారు. అదే మొదటిసారి అయినా, ప్రథమ బహుమతిని గెలుచుకున్నారు. ఇది, తర్వాత రోజులలో ఆయనను వరింపనున్న విజయ పరంపరలో మొదటిది మాత్రమే.

తాలూకా బహుమతి నందుకున్న మరుసంవత్సరం జిల్లా స్థాయి బహుమతి గంగన్నదయింది. ఆ మరు ఏడాది రాష్ట్రస్థాయి బహుమతిని గెలిచారు. 1965_66 లో గంగన్న ఎకరాకు 4308 కిలోల వరి ధాన్యం (ఎండినాక 3835 కిలోలు) పండించి_వరి సాగులో దేశమంతటిలోనూ_ అత్యున్నత బహుమతిని సాధించారు.

"ఈ పోటీలన్నిటిలోనూ_కేవలం అదృష్టం మీద నమ్మకం పెట్టుకుని దిగలేదునేను. కొంతవరకూ అదృష్టమూ వుండాలనుకోండి. కాని దీక్షతో కృషి చేయనిదే సత్ఫలితాలు ఎప్పుడూ రావు" అన్నారు శ్రీ గంగన్న.

ఏమిటా దీక్ష?

గంగన్నలాంటి రైతు దీక్ష అంటే తన భూమి మంచి చెడ్డలను క్షున్నంగా ఎరిగి వుండడం, పచ్చియాకు ఎరువు పైర్లను



పెంచడం, కావలసినంత కంపోస్టు, రసాయనిక ఎరువులు వేయడం, అదనులో తడి పెట్టడంలాంటివి అన్నమాట.

ఇవన్నీ ఒకఎత్తు: సాగు విషయాలలో నిపుణుల సలహాలను పొందడం మరొక ఎత్తు! గంగన్న తరచు విస్తరణాధికారులను కలుసుకుని, వారితో సంప్రదించి, ఆధునిక సాగు పద్ధతులలోని మెలకువలను తెలుసుకొని ఆచరణలో పెట్టేవారు.

పోటీ నిమిత్తం పెంచబోయే వరిపైరు ఏ రకందయి వుండాలని గంగన్న అడుగగా, స్థానిక విస్తరణాధికారి 'జిఇబి_24' రకాన్ని సూచించారు. గంగన్న ఆరకాన్నే ఎన్నుకున్నారు.

## ఇక తర్వాతది—ఎరువులు

గంగన్న పిల్లిపెసర, ఢెంఛా మొక్కలను పెంచారు. ఇవి ఏపుగా పెరగాలని హెక్టేరుకు 37 టన్నుల చొప్పున టౌన్ కంపోస్టు వేశారు. (66 వ పుట చూడుడు.)

# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 8

భర్త మాటవిని బ్రాహ్మణి పతితో నిట్లనెను: "పండితుడైన నీవిట్లు దుఃఖించగూడదు. అందరును ఎప్పుడైనను మరణించవలసినదే కదా! అవశ్యముగా జరుగు మరణమునకై యిట్లు చింతిల్ల కూడదు. భార్య, పుత్రుడు మొదలగు పరివారము గృహయజమానుని సుఖము కొరకే పాటుపడవలెను గదా! కనుక నేను మీకొరకై మరణించెదను. పతి హితము కొరకై పత్ని తన ప్రాణములనైనను త్యాగము చేయుటకన్న ఆమె కర్తవ్యము మరియొకటిలేదు. పతికొరకు మరణించు పత్నికి ఇహపరలోకములందు కీర్తి పుణ్యములు శాశ్వతముగా లభించగలవు. నన్ను పెండ్లియాడిన యుద్దేశము సిద్ధించెను. ఒక కూతురు, ఒక కుమారుడు కలిగిరి. కనుక నీ కన్నుల యెదుట, నేనే మరణించెదను. నీవు లేని యీ లోకములో బాధల ననుభవించుచు ఈ పిల్లలను పోషించలేను. పతిహీననైన నన్ను, భూమిపై పడిన మాంసఖండమును పక్షులు ఆశించినట్లు, ప్రతి పురుషుడు ఆశించి నా మానభంగమునకు పూనుకొనును. ఈ మన కూతురి శీలమును గూడ నేను కాపాడలేను. ఈ బాలురిరువురును నీవు లేకున్నచో జలములేని సరస్సులోని చేపలవలె నశింతురు. నీవు లేకున్న మేము ముగ్గురము నశింతుము. కనుక నన్ను త్యాగము చేయుము. పుత్రవతియైన సాధ్వి పతి యెదుట మరణించుటయే పరమ సౌభాగ్యమని పెద్దలు చెప్పుదురు. మాతా పితరులు, సుతులు మితముగానే యిత్తురు. పతి పత్నికి అమితమైన సంపద నిచ్చును కనుక ఎవతెగూడ పతి వియోగమును సహించజాలదు. సర్వధా పతి హితమునుగోరు పత్నికి యజ్ఞ, దాన, తపశ్చర్యల కన్న ఎక్కువ ఫలము లభించునని పెద్దలు చెప్పుదురు. ఆపదర్థం ధనం రక్షేత్, ధనైరపి, ఆత్మా సంరక్షయేత్. ఆపదను దాటుటకు ధనమును రక్షించుకొనవలెను. ధనముచేత భార్యను రక్షించవలెను. అట్టి ధనమును, భార్యనుగూడ త్యజించి తనను తాను రక్షించుకొనవలెను అని నీతికోవిదులు చెప్పుదురు. మనుజునకు లౌకిక సుఖసాధనము కొరకే కదా భార్యా-పుత్ర-ధన-గృహాదులు. కనుక తత్సాధనమునకై వారిని త్యాగము చేయుటయే నీతి. కులము-శరీరము-ఈ రెంటిని ప్రధానముగా రక్షించుకొనవలెను. ఈ రెంటిలో నొకదానిని విడుచుటవలన మరియొకదానికి రక్షణము కలుగునప్పుడు శరీరరక్షణమే ప్రధానము గనుక దానికొరకు కులమువారిని విడుచుటయే నీతి. కనుక, ఆర్యా! నీవు నన్ను రాక్షసునికడకు పంపి నీ యభీష్టమును నెరవేర్చుకొనుము. ఈ పిల్లలను రక్షించుకొనుము. స్త్రీవధ అధర్మ మని ధర్మజ్ఞులు చెప్పుదురు. రాక్షసులుగూడ ధర్మజ్ఞులే యగుదురు. కనుక ఆ రాక్షసు డొకవేళ ధర్మచింతతో స్త్రీవధ పాపకర మని తలచి నన్ను విడిచినను విడువవచ్చును. కనుక పురుషుడ వగునీవు వధింపబడుట తథ్యము. నన్ను అతడు వధించుట సంశయాస్పదము. నిశ్చితము కన్న సందిగ్ధకార్యము చేయుట మంచిది. కనుక నన్నే పోనిమ్ము. నేను మరణించినతరువాతకూడ నీవు వేరు వివాహము చేసికొని ధర్మాచరణము చేయ గలుగుదువు. బహుపత్నీత్వము పురుషులకు అధర్మము కాదు. స్త్రీ యెప్పుడుగూడ పూర్వపతిని ఉల్లంఘించి వేరొక వానిని చేపట్టగూడదు. కనుక నీ యనంతరము నావలన గృహస్థధర్మము నెరవేరదు. ఈయంశము లన్నియు బాగుగా విచారించి నీవు ఆత్మరక్షణము చేసికొని నన్ను విసర్జింపుము." అది విని బ్రాహ్మణుడు దీనుడై ఆమెను ఆలింగనము చేసికొనెను. ఇరువురు దుఃఖించు చుండిరి.

ఆ మాట లన్నియు వినుచు కూతు రిట్లనెను:-"తల్లిదండ్రులారా! మీరేల యిట్లు దుఃఖించెదరు? నా మాట వినుడు. ధర్మము ప్రకారము కూతురగునన్ను నా పతికొరకు విడువవలసియేయున్నది. కనుక ఇప్పుడే విసర్జించి కులమును రక్షించుకొనుడు. సంకటములనుండి తరించుటకేకదా సంతతిని కోరుదురు. కనుక ఇప్పుడు ప్రాప్తించినదుఃఖసాగరమును పుత్రికయను నా ద్వారా దాటుడు. పితరులను ఈ లోకములోను పరలోకములోను తరింపజేయుటయే కదా పుత్రులకర్తవ్యము. నా వలన కలిగిన దౌహిత్రులద్వారా కలుగుపుణ్యలోకములను పితరులు కాంక్షితురుగదా! నేను స్వయముగానే తండ్రిని రక్షించు చున్నపుడు నా కొడుకులకొరకు ఆశపడుట యేల? తండ్రీ! నీవు గతించినచో రక్షించువారు లేక బాలుడగు ఈ నాతమ్ముడు మరణించును. మీ యిరువురినాశనము వలన పితృదేవతలు పిండోదకములు లభించక తపింతురు. మీతో తల్లియు నశించును. మీయందరినాశనముతర్వాత 'నా' యనువారు లేక నేనును నశింతును. నీ వొక్కడవు ఆరోగ్యముతో జీవించి యున్నచో ఈ యందరిరక్షణము సిద్ధించును. తనయాత్మయే పుత్రుడు. భార్య తనకు మిత్ర మగును. కూతురు నిశ్చయముగా తలిదండ్రులకు సంకటకరురాలగును. కనుక నన్ను విడిచి యీ సంకటమునుండి విముక్తులు కండు. మీరు లేక నేను అనేకబాధలకు లోనుకావలసినదాన నగుదును. ఇట్లు మరణించినచో కులమునకు మేలు చేకూర్చినదాన నగుదును. నీవు పోయినచో మేము కుక్కలవలె ఇంటింటికి అన్నార్థులమై తిరుగుదురతికి లోనగుదుము. కనుక సర్వధా నీవు ఆత్మరక్షణము చేసికొనుము. నన్ను విడువుము, ఇదియే ధర్మము."

ఆ మాటలు విని బాలకుడు వారితో, 'మీకింత చింతయేల? భయపడకుడు.' అని నవ్వుచు చెప్పి ఒక తృణమును తీసికొని 'యీ గడ్డిపరకతో ఆ రాక్షసుని క్షణములో చంపి వచ్చెదను.' అనెను. చిలుకపలుకులవంటి అతని బాలభాషితము విని వారు దుఃఖమును కొంత మఱచి యుండిరి.

“ఇదియే అదను” అని కుంతి వారిని సమీపించి, మరణించిన వారిని అమృతము పోసి బ్రతికించినట్లుగా, “మీకేల యీ దుఃఖము సంప్రాప్తమైనది, సాధ్యమయినచో నేను దానిని నివారింప జేసెదను.” అని ఆ బ్రాహ్మణునితో ననెను. దానికతడు, “మీరు సజ్జనులు గనుక మాయందలి సానుభూతితో నమ్మడుగుట సహజము. మా దుఃఖమును పోగొట్టుటకు మానవులకు సాధ్యము కాదు. విన్నను చెప్పెదను. ఈ నగరసమీపమునందు “బకుడు” అను రాక్షసుడు నివసించు చున్నాడు. అతడీదేశమునకు రక్షకుడుగా నున్నాడు. మనుష్యమాంసమును తిని బలిసి యున్నాడు. అతడీదేశమును రక్షించుటచేత మాకు పరరాష్ట్రమునుండి యేలాటి భయము లేదు. కాని, అతనికి ప్రతిదినము ఆహారార్థమై ఈ జనపదమునందలి ఒక మనుష్యుడు, రెండు దున్నపోతులను ఒక బండెడు అన్నమును తీసికొని పోయి అతనికి బలి కావలెను. ఒక్కొక్క గృహస్థునకు ఒక్కొక్క దినము వంతు వచ్చును. ఈ వంతు అనేకసంవత్సరముల కొకసారి వచ్చును. కాని అది నెరవేర్చుట చాల దుష్కరము. ఎవడైనను తన వంతును తప్పించుకొనుటకు అతనిని వంచించినచో ఆ రాక్షసు డా యింటివారి నందరిని చంపి తినును. ఈ దేశము నేలురాజు, ఇచ్చటికి సమీపమున నున్న “వేత్రకీ గృహము” అను స్థానమునందు ఉన్నాడు. కాని అతడు న్యాయమార్గములో సంచరించడు. అతడు ప్రజలసంకటమును దూరము చేయుటకు ఎప్పుడుగూడ ప్రయత్నము చేయడు. దుర్బలుడు, దుష్టుడునైన రాజును ఆశ్రయించి యున్నందుచేత మాకు ఈ బాధ తప్పదు. మావంటి బ్రాహ్మణుల నాదేశించు వారెవరు? వా రెవరి వశములో నుండగలరు? వారు ఇచ్ఛానుసారముగా పక్షులవలె తిరుగుచు మంచిదేశములో మంచిరాజును చూచి యచ్చట నివసింతురు. తొలుత మంచిరాజును, తరువాత మంచిభార్యను, పిదప ధనమును సంపాదించ వలెను. ఈ మూడింటిని సంపాదించిన తరువాతనే తనబంధుకోటిని, పుత్రులను మానవుడు రక్షించ గలుగును. నేను ఈమూడింటిని సరిగా పొందలేదు. కనుక ఈ యాపద నాకు తప్పదు. నేడు ఆ రాక్షసునకు ఆహారము ఇవ్వ వలసినవంతు నా తలపైన బడినది. ఎవనినైనను వెలకు కొని అతనికి ఇచ్చుటకుగూడ నాకడ ధనము లేదు. మిత్రులను బాంధవులను అతని కీయ లేను. ఆ రాక్షసునిబారినుండి తప్పించుకొనుటకు మార్గాంతరము లేక మిక్కిలి దుఃఖించు చున్నాను. ఇప్పుడు నా కుటుంబజన మందరితోపాటు అతనికి ఆహారముగా పోవుచున్నాను. ఇంతకన్న గత్యంతరము నాకు లేదు.'' అని చెప్పెను. అది విని

కుంతి:—'బ్రాహ్మణా! నీవు చింతించకుము. నీయేకపుత్రుడు, ఏకపుత్రిక, భార్య యెవరును వానికి బలి కావద్దు. నాకు అయిదుగురు కొడుకులున్నారు ఒకనిని నీకై యిచ్చెదను. అతనిని బకుని వద్దకు పంపుము.'

బ్రాహ్మ:—అతిథిగా మాయింట నున్న బ్రాహ్మణుని బలియివ్వ లేను. ఎంత నీచుడైనను ఈ పనికి అంగీకరించడు. బ్రహ్మహత్యకన్న ఆత్మహత్యయే ఉచితము. కనుక నేనే బలి యయ్యెదను. బ్రహ్మహత్యకు నిష్కృతి లేదు. నేను స్వయముగా ఆత్మహత్యకు పాల్పడుట లేదు. ఇతరుని ఒత్తిడికి లోనై చేయుచున్నాను. కనుక కొంచెముగూడ పాపము నన్ను అంటదు. తెలిసి తెలిసి స్వార్థముకొరకు బ్రాహ్మణవధకు నేను పాల్పడినచో అంతకన్న నీచమైన పని మరియొకటి ఉండదు. తన యింటికి శరణార్థియై వచ్చిన వానిని విడుచుట, ప్రాణరక్షణకై యాచించువానిని వధించుట ఈ రెండును అతినీచకర్మలుగా బుధులు పరిగణించినారు. ఆ పద్ధర్మములో కూడ నిందితము, క్రూరమునైనపని చేయగూడదని ధర్మజ్ఞులు చెప్పుదురు. బ్రాహ్మణవధకన్న సపుత్రకళత్రముగ నేను మరణించుటయే శ్రేయము.''

కుంతి:—విప్రోత్తమా! పుత్రశత మున్నను తల్లికి ఏ యొక్క పుత్రునిపైనగూడ నిరాశ జనించునా? అయినను బ్రాహ్మణరక్షణముముఖ్యకర్తవ్య మని నే నిట్లు నిశ్చయించుకున్నాను. ఇదిగాక, నా పుత్రుని ఈ రాక్షసుడు ఏమియు చేయజాలడు. నాసుతుడు బలశౌర్య సంపన్నుడు. అతడు భోజనమును రాక్షసునికడకు కొనిపోగలడు, తనను విడిపించుకొనికూడ రాగలడు అని నాకు విశ్వాసము గలదు. ఇంతకుపూర్వము గూడ మహాకాయులైన రాక్షసు లనేకులు నా పుత్రునకు బలి యగుట నేను కన్నులార చూచినాను. బ్రాహ్మణా! ఈ రహస్యము నెవరికిని వెలిబుచ్చకుము. నా పుత్రుని కడకు వచ్చి రాక్షసమారణ మంత్రమును నేర్చుకొనజూచెదరు, దానివలన అతని కపకార మగును, గుర్వాజ్ఞలేక ఆ మంత్రము నితరులకు ఉపదేశించరాదు.

ఈ మాటలను విని యా బ్రాహ్మణుడు భార్యాపుత్రులతో మిగుల సంతుష్టుడై కుంతిని మిక్కిలి సంభావించెను. పిదప ఆ బ్రాహ్మణుడు, కుంతి భీమసేనునికడకు వచ్చి యాసంగతి తెలిపిరి. అతడు అంగీకరించెను.

భిక్షాటనమునకుగాను పోయిన సోదరులు తిరిగి వచ్చిరి. యుధిష్ఠిరుడు భీముని చూచి 'భీముడిట్లేల ఉత్సాహముతో నున్నాడు?' అని తల్లి నడిగెను. ఆమె జరిగినసంగతి చెప్పెను. యుధిష్ఠిరుడు మిక్కిలి విచారించి 'తల్లీ! యిట్లేల చేసితివి?' ఎవనిబలసంపదచేత మన మనేకవిపత్తులను గడచితిమో, యెవనియాశ్రయముచేత మనము ధార్తరాష్ట్రాదులను సంహరించి తిరిగి రాజ్యమును సంపాదించుకొన దలచుచున్నామో యట్టి భీమసేనుని రాక్షసునకు బలిగా బంపుటకు నీ వెట్లు అంగీకరించితివి? అని యనెను. ఆ మాటకు కుంతి, “నాయినా! భీముని బలము నే నెరుగనా? అతని జన్మ

కాలములోనే అతని తాకిడిచేత పాషాణములు పొడి యయ్యెను. మహాబలపరాక్రమములతో మనను కాపాడి హిడింబుని చంపలేదా? కనుక అతడు తప్పక బకాసురుని సంహారించి బ్రాహ్మణునకు ఉపకారము చేసి ఈ దేశమునకు క్షేమము చేకూర్చ గలడు. ఇదిగాక, మనకు ఆశ్రయ మిచ్చి యుపకారము చేసినవారికి అంతకన్న అధిక మైనమేలుచేసి కృతజ్ఞత చూపవలెను. ఈ విధముగా మనము బ్రాహ్మణ ఋణమును నిస్తరింప గలము. క్షత్రియుడు చాతుర్వర్ణముల వారికి ఉపకారము చేయుట క్షాత్రధర్మము. దానివలన క్షత్రియునకు ఐహికాముష్మిక ఫలప్రాప్తి కలుగును. నేను తెలియక చేయ లేదు. నీవు నిశ్చింతగ నుండుము. భీముడు బకుని చంపి దేశమునకు క్షేమము చేకూర్చును." అని కొడుకుతోననెను. యుధిష్ఠిరుడు సంతసించి అంగీకరించెను.

ఆరాత్రి, భీమసేనుడు అన్నశకటముతోపాటు బకాసురుని వద్దకు పోయెను. అచ్చట ఆయన్నమును తాను తినుచు రాక్షసుని పిలిచెను అతడు కన్నుల నిప్పులు గ్రక్కుచు వచ్చి తనకొరకు నియమిత మైన అన్నమును తినుచున్న భీముని చూచి క్రోధోద్రిక్తుడయ్యెను. భీముడునవ్వుచు అన్నము తినుచునే యుండెను. రాక్షసుడు కోపముచేత భీముని వీపుపైన ఒక గ్రుద్దు గట్టిగా గ్రుద్దెను. భీముడు లక్ష్యముచేయక నవ్వుచునే అన్నము తినుచుండెను. బకుడు మిక్కిలి కోపించి సమీపవృక్షమును పెరికి భీముని కొట్టబోవునంతలో భీము డన్నమంతయు తిని, నీరు త్రాగి, త్రేన్చి, ఆచమనము చేసి, రాక్షసుడు తనపైకి విసరిన వృక్షమును చేతబట్టుకొనెను. అతడు మరియొక వృక్షముతో కొట్టెను. ఇరువురకు నిట్లు వృక్షయుద్ధము జరిగినతరువాత ఇరువురును బాహుయుద్ధమునకు తలపడి పోరాడిరి. చివరకు భీముడు బకునిమెడను నడుమును తన రెండుచేతులతో పట్టుకొని రెండుగా విరిచెను. రాక్షసుడు హాహాకారము చేయుచు నెత్తురు గ్రక్కుచు చచ్చి పడెను. ఆ దృశ్యము చూచి యితర రాక్షసగణము భయముచేత పలాయితులైరి. భీముడు రాక్షసశవమును నగరద్వారమువద్ద వైచి సోదరులకు, తల్లికి, బ్రాహ్మణునకు ఆ సంగతి తెలిపి, యెవరికి తెలియకుండ అచ్చటనే యుండెను. ఆ యుదయమే నగరవాసులు రాక్షసశవమును చూచి సంతుష్టులైరి. ఆ నాటివంతుగల బ్రాహ్మణగృహమునకు వచ్చి సమాచార మడిగిరి. ఆ విప్రుడు రహస్యమును బయటపెట్టక, 'ఒక మంత్రసిద్ధు డగువిప్రుడు తనకు బదులుగా బకునివద్దకు పోయి మంత్రబలముచేత రాక్షసుని చంపి వెడలిపోయెను.' అని చెప్పెను. ఆ పౌరులందరు ఉత్సవము చేసికొనిరి, పాండవులు ఏమియు తెలియనట్లు ఆ యుత్సవములో పాల్గొనిరి.

పాండవులు ఆ తరువాతగూడ కొంతకాల మచటనే యుండిరి. ఒకనా డొకబ్రాహ్మణుడు అచటికి వచ్చి తనకు నివాస మిమ్మని ఆ యింటిబ్రాహ్మణుని కోరెను. సర్వదా అతిథిసత్కారము చేయుచున్నయతడు ఆగంతుకుడగు బ్రాహ్మణునకు ఆశ్రయ మిచ్చెను. అతడు చిత్రవిచిత్రము లగులౌకికకథలను చెప్పుచుండెను. వాటిని వినోదముగా పాండవులు వినుచుండిరి. ఒకనాడు ఆ విప్రుడు పాంచాలదేశ చరిత్ర, ద్రౌపదీ దృష్టద్యుమ్నుల ఉత్పత్తి మొదలయిన కథలు చెప్పుచుండెను. ఆ కథను విస్తారముగా చెప్పుమని పాండవులు కోరిరి.

## ద్రౌపదీ-దృష్టద్యుమ్నుల జననము

పూర్వము ద్రోణాచార్యుల వలన భంగపాటు చెంది అవమానపడిన ద్రుపద మహారాజు కోపాసూయలచేత ద్రోణుని నిర్జించగల కొడుకును ఏలాగునైనను బొందదలచెను. అందుకుగాను యజ్ఞము చేయతలపెట్టి వేదవిదులైన ఋత్విక్కులకొరకు వెతకుచుండెను. లోగడ పుట్టిన పుత్రులెవరుగూడ ద్రోణుని జయించజాలరని యీ ప్రయత్నమునకు పూనుకొనెను. గంగా యమునా సంగమతీరమునందు ఋత్విక్కులను వెదకుచు తిరిగెను. ఒక యాశ్రమమునందు బ్రహ్మవిదులు, నియమవ్రతులునగు 'యాజుడు, ఉపయాజుడు' నను నిరువురు బ్రహ్మర్షి సత్తములను చూచి నమస్కరించెను. వారు సోదరులు. అందు కనిష్ఠుడగు ఉపయాజుడు అధిక తేజోవంతుడుగా కనపడెను. అతని కోరికలన్ని తీర్చెదనని ప్రతిజ్ఞచేసి। ద్రోణుని మృత్యువునకు కారణభూతుడగు పుత్రుని యజ్ఞ కర్మ ద్వారా ప్రసాదింపుమని యతనిని కోరెను. పుత్రుడు లభించినపిదప అతనికి అర్బుదము (పదికోట్లు) గోవులను ఇచ్చెదనని మాట యిచ్చెను. ఇది అతనికి ఇష్టము కాకున్నచో అతడుకోరిన మరి యే పదార్థములనైనను ఇచ్చుటకు ప్రతిజ్ఞ చేసెను. ఉపయాజ మహాముని ఆ కర్మకు అంగీకరించ లేదు. తిరిగి ద్రుపదుడతని పాదములపైనబడి వేడుకొనెను. ఒక సంవత్సర మా మహర్షికి పరిచర్యలు చేసెను.

అతడు సంతుష్టుడై ద్రుపదునితో 'రాజా। నేను ధనాశ చేత ఈ కార్యమునకు పూనుకొనను, మాఅన్న యాజుని వేడుము : అతడు ఫలాశకలవాడు. అతడు చదువుకొనుచున్నప్పుడే అశుద్ధమైన ఉచ్ఛిష్టాన్నమును ఆశచేత తినుచుండెడివాడు. అతనికి ధనమన్నను, ఫలమన్నను అధిక ప్రీతి. కనుక అతనిని నీ యజ్ఞకర్మ చేయించుటకు యాచించుము.' అని చెప్పెను. ద్రుపదుడు యాజుని దురాశావృత్తికి అసహ్యపడికూడ చేయునదిలేక అతనినే యాచించెను. ద్రుపదుడిచ్చు అర్బుదము (పదికోట్లు) గోధనమునకు ఆశపడి అతడంగీకరించెను. అది మహాకార్యము గనుక తానొక్కడే నెరవేర్చలేక నిరాశగల ఉపయాజునిగూడ సహాయము చేయుమనికోరెను. ఉపయాజుడు ఆయజ్ఞ విధానమును ద్రుపదునకు ఉపదేశించెను. నీవెట్టి పుత్రుని కోరినచో అట్టి పుత్రుడు జనించును అని కూడ ఉపయాజుడు చెప్పెను. ద్రోణ వధకు కారణమగు పుత్రుని ద్రుపదుడు కోరెను

యాజుడు ఉపయాజుని సహాయముతో యజ్ఞమును యథావిధిగా చేయ నారంభించెను. యజ్ఞాంతమునందు అగ్నికుండము నుండి పుత్రుడు, కన్యక కలుగ బోవుచుండిరి. ద్రుపదుని భార్యను యాజుడు పిలిచి ఆ పిల్లలను స్వీకరించుమనెను. ఆమె' నేను తాంబూలసేవనము చేసినాను. శరీరమంతయు పరిమళయుక్తమై అశుచిగ నున్నాను. స్నానము చేసి యజ్ఞకుండము కడకు వచ్చెదను అంతదాక ఆగుడు!' అనిచెప్పెను. 'నీవు వచ్చినను, రాకున్నను



మంత్ర బలముచేత యజ్ఞమునుండి ష్టుపుత్రులు ఆగరు.' అని యాజుడు ద్రుపదుని భార్యకు చెప్పెను. యజ్ఞకుండము నుండి అధిక తేజోయుతుడగు బాలుడు పుట్టెను. అతడు అగ్నిజ్వాల వలె వెలుగు చుండెను. కవచ కిరీటములతో ఖడ్గహస్తుడై బయటికి వచ్చి ధనుర్బాణములతో రథము నెక్కెను. 'ద్రోణసంహారకుడు పుట్టెను' అని పాంచాల పౌరులు హర్షధ్వానము చేసిరి. 'ద్రోణవధకు ఇతడు పుట్టెను. రాజు యొక్క శోకము నితడు హరించగలడు అని ఆకాశవాణి పలికెను. తోడనే బాలికగూడ పుట్టెను. ఆమె అతిలోక సౌందర్యవతిగ నుండెను. నీలవర్ణాంగియై నీలకేశములను ధరించి మెరయు చుండెను. ఆమె శరీరమునుండి వెడలిన నల్ల కలువల సుగంధము ఒక క్రోసు దూరము వరకు వ్యాపించుచుండెను. ఈ బాలిక భూమండలములో స్త్రీరత్నమై ప్రకాశించును. క్షత్రియ నాశమునకు, కౌరవ నాశనమునకు హేతుభూతురాలగును.' అని అశరీరవాణి వినబడెను. అదివిని పౌరులు హర్షధ్వనులు చేసిరి.

అప్పుడు ద్రుపదునిభార్య వచ్చి ఆయిరువురు పిల్లలను చూచి హర్షించెను. 'వీరు నన్నుదప్ప ఇతరస్త్రీలను తమ తల్లిగా భావించ కుండునట్లు వరమిమ్ము.' అని యాజుని కోరెను. యాజు డామెకోర్కెను నెరవేర్చెను. అకుమారుడు 'ధృష్టుడు (కోపము గలవాడు), ద్యుమ్నుడు (తేజోమయుడు). నగుట వలన 'ధృష్టద్యుమ్నుడు' అను పేరు గల వాడయ్యెను. కృష్ణ (నీల) వర్ణము గలదగుటచేత ఆకన్యక పేరు 'కృష్ణ'యని ప్రసిద్ధ మయ్యెను. ఆమెయే ద్రౌపది. ఈ విధముగా ద్రుపదునకు యజ్ఞమునందొక కొడుకు, ఒక కూతురు గలిగిరి.

ద్రోణాచార్యులు ధృష్టద్యుమ్నుని తనయాశ్రమమునకు తోడుకొని పోయి సకల శస్త్రాస్త్రవిద్యలను యథావిధిగా నేర్పి యతనిని అసమాన వీరునిగా చేసెను. ఈ విధముగా ద్రోణుడు తన వినాశమునకు హేతుభూతు డని తెలిసినప్పటికిని ధృష్టద్యుమ్నునకు ఉదారభావముతో విద్యలు నేర్పి ప్రపంచములో గొప్ప కీర్తిని పొందెను."

బ్రాహ్మణుడు చెప్పిన యీ విచిత్ర కథను విని పాండవులు మిక్కిలి ఆశ్చర్యమును చెందిరి. అప్పుడు కుంతీదేవి యుధిష్ఠిరునితో, 'నాయనా' మన మీయేకచక్రా పురమునకు వచ్చి చాల కాల మైనది. భిక్షాటనము చేయువారు ఒక చోటనే యింతకాల ముండగూడదు. ఇక్కడ మనకు భిక్షముకూడ సరిగా లభించుట లేదు. కనుక సుభిక్ష మగు పాంచాల దేశమునకు పోయి అచటనే భిక్షాచరణము చేయుచు కాలము గడపుదము.' అని చెప్పెను. దానికి పాండవు లంగీకరించిరి

అప్పుడు పాండవుల కడ కొకనాడు వ్యాసభగవానుడు వచ్చెను. ఆయనకు పాండవులు ప్రత్యుత్థానము చేసి నమస్కరించి యెదుట కూర్చొని యుండిరి. వ్యాసుడపుడు, "మీరు ధర్మాచరణమును, శాస్త్రాధ్యయనమును చేయుచున్నారా? విప్రులయెడ, పెద్దల యెడ గౌరవాదరములు కలిగి వర్తించుచున్నారా?" అని ప్రశ్నించి, విచిత్రము లగు ననేక కథలు వారికి చెప్పి యిట్లనెను:— "పూర్వమొక తపోవనములో సుందరాంగియగు నొక ముని కన్య యుండెను. అమె పూర్వ కర్మ దౌర్భాగ్యవశముచేత, రూపవతి యైనను తగిన పతిని పొందలేక పోయెను. పతికొరకై శంకరుని గూర్చి తపస్సు చేసెను. ఆ మహాదేవుడు సంతుష్టుడై యామెను వరము కోరుకొను మనెను. 'సర్వ సద్గుణసముపేతుడైన పతి నాకు కావలెను' అను మాటను పలు సార్లు ఆమె పలికెను. భగవంతు డగుశంకరుడామెతో 'నీకు అయిదుగురు భరతవంశీయులు పతు లయ్యెదరు.' అని చెప్పెను. 'నాకొక్కడే పతి కావలెను.' అని ఆమె కోరెను. 'నీవు అయిదుమార్లు 'పతి యని యంటివి కనుక నీకు ఉత్తర జన్మలో అయిదుగురు పతు లుండెదరు.' అని భగవంతు డనెను. ఆమెయే యిప్పుడు ద్రుపదకన్యగా జన్మించెను. ఆమె మీ యైదుగురికి పత్ని కాగలదు. కనుక మీ రిప్పుడు పాంచాల నగరమునకు పోయి అచ్చట నివసించు చుండుడు. తప్పక ఆకన్యను భార్యగా బడసెదరు." అని వ్యాస భగవానుడు చెప్పి పాండవులను వీడ్కొని వెడలి పోయెను.

## అంగారపర్ణుని కథ

పాండవులు తల్లితో పాటు, తమకు ఆతిథ్య మిచ్చిన బ్రాహ్మణునినుండి, యేకచక్రపురవాసులనుండి సెలవు గైకొని ఉత్తరదిశగా పాంచాలనగరమునకు ప్రయాణమై వెడలిరి. రాత్రివేళలో అర్జునుడు, వెలుగుకుగాను, రక్షణమునకుగాను మండుచున్న కొరవిని చేత పట్టుకొని పోవుచుండెను. ఇట్లొక రాత్రి, ఒక పగలు వారు ప్రయాణము చేసి సాయంకాలమువరకు గంగా తీరమును చేరిరి. అప్పు డక్కడ నొక గంధర్వరాజు తన

స్త్రీలతో జలక్రీడలు చేయుచుండెను. మనుజుల అడుగుల సవ్వడిని వినెను. పాండవులు వచ్చుచుండుటను చూచి క్రోధోద్దీపితుడై ధనుష్టంకారము చేయుచు నిట్లనెను;— "రాత్రి ప్రారంభమగుటకు పూర్వము పశ్చిమదిశలో భయంకర మగు సంధ్యారాగము కలుగును. ఆ ముహూర్తములో ఎనుబది లిప్తలు (ఒకనిమేషము లిప్తయనబడును.) విడిచి మిగిలిన ముహూర్తకాలము యక్ష, రాక్షస, గంధర్వాదులు సంచరించు సమయము. మిగిలిన కాలమంతయు మానవులు సంచరించుకాలముగా పరిగణింపడినది. మేము సంచరించువేళలో తిరుగుమానవులను మేము చెరబెట్టి బంధింతుము అందుచేతనే రాత్రులలో జలములో దిగ గూడదందురు. ఎంతబలవంతుడైన రాజుగూడ ఈ సమయములో జల ప్రవేశము చేయ గూడదు. మూర్ఖులారా! దూరమునందే నిలువుడు, నేను కుబేరుని ప్రియమిత్రుడను. 'అంగారపర్ణుడు అను గంధర్వుడను. ఈ వనము 'అంగార పర్ణము' అని నా పేరనే పరగుచున్నది. తెలియక మీరు, నేను జల క్రీడ చేయునప్పు డేల వచ్చితిరి. ఇచ్చట నాస్త్రీలతో రమించుచున్నాను నే నిక్కడ నున్నప్పుడు రాక్షసులుగాని, యక్షులుగాని, దేవతలుగాని. మనుష్యులుగాని రాలేరు. మీ రెట్లువచ్చితిరి?"

ఆ గర్వపు మాటలు విని అర్జును డతనితో నిట్లనెను:—

"సముద్రమునందు, హిమాలయ పార్శ్వమునందు. గంగానదియందును రాత్రి. పగలు, సంధ్యలయందుగాని సంచారమును ఆపుటకు ఎవనికిని అధికారము లేదు. గంగను చేరుటకు కాల నియమము లేదు. ఎప్పుడైనను రావచ్చును. మేము బలశాలురము. నీకు బెదరువారము కాము. దుర్బలులు నీకు భయపడి యిక్కడికి రాక పోవచ్చును. మాకేమి భయము? పూర్వము గంగానది హిమాలయముయొక్క స్వర్ణశిఖరమునుండి బయలు వెడలి యేడు పాయలుగా చీలి సముద్రములో కలిసినది. ఆ యేడును. 'గంగ, యమున. ప్లక్షము (జువ్విచెట్టు లేక ప్లక్ష ద్వీపము) నుండి పుట్టిన సరస్వతి, రథస్థ, సరయూ, గోమతి, గండకి' అను పేర్లతో బరగియున్నవి. ఈ సప్త నదులలో స్నానపానాదులు చేసిన మానవులపాపములు వెంటనే నశించును. ఆకాశములో ప్రవహించు గంగకు 'అలకనంద' యని, పితృలోకములో 'వైతరణి' యని, మనుష్యలోకములో 'గంగ' యనియు ప్రసిద్ధ నామములు కలవు. ఈ విషయము వ్యాస భగవానుడు చెప్పెను. సర్వపాపములను, విఘ్నములను హరించు ఈ నదిని చేరకుండ అడ్డుపెట్టుటకు దుర్మతీ! నీకేమి యధికారము గలదు? కనుక మేమీ నదిని అవశ్యముగా చేరెదము.'

ఆ మాటలు విని అంగారపర్ణుడు క్రుద్ధుడై ధనుస్సును ఎక్కుపెట్టి అర్జునునిపైన బాణప్రయోగము చేసెను. అర్జునుడు బాణముల నన్నింటిని తనచేతిలోనికొరవిని త్రిప్పుచు వారించుచు నిట్లనెను:—గంధర్వా! నీ బెదరింపు లన్నియు అస్త్రవిద్యాకోవిదులమైనమాయెడ పనికిరావు. నాదెబ్బకు నీ బాణములు నురుగులవలె గాలిలో ఎగిరి పోవును. అని చెప్పి అర్జునుడు వానిపైన ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. దానితో వాని రథము దగ్ధమయ్యెను. వాడును తాపముచేత పడిపోయెను. వానిని జుట్టుపట్టుకొని అర్జునుడు యుధిష్ఠిరుని పాదములపైన వైచెను. ఆ గంధర్వునిభార్య 'కుంభీనసి' యను నామె వచ్చి యుధిష్ఠిరుని పతిభిక్ష వేడెను. 'యుద్ధములో ఓడిపోయి యశోహీనుడై, విశేషించి, స్త్రీ రక్షకురాలుగాగల శత్రుని చంప గూడదు. విడిచిపెట్టుము' అని యుధిష్ఠిరుడు అర్జునునకు చెప్పెను. ఈ విధముగా విముక్తుడైన గంధర్వుడు పాండవులకు నమస్కరించి, "నాకు పూర్వ మున్న 'అంగారపర్ణ' నామమును విసర్జించితిని. చిత్రమగు రథము గలవాడ నగుటచేత నాకు చిత్రరథుడు అని పేరు ఉండెను. ఆ పేరుతోనే యిప్పుడు మెలగెదను. నా రథము ఆగ్నేయాస్త్రముచేత దగ్ధమైనది గనుక దగ్ధరథుడనైతిని. ప్రాణదాత యగు వీరుడు అర్జునునకు గంధర్వమాయావిద్యను ఇచ్చెదను. అని చెప్పి అర్జునునితో నిట్లనెను;—'ఈ మాయావిద్యకు 'చాక్షుషి' యని పేరు పూర్వము మనువు దీనిని సోమునకు, అతడు విశ్వావసువునకు, అతడు నాకును ఇచ్చెను. దీనిప్రభావముచేత మూడు లోకములలోను ఏవస్తువు నేవిధముగా చూడ దలచినను చూడవచ్చును. ఆరు మాసములు ఒంటికాలిపై నిలబడి తపస్సు చేసినగాని లభించని యీ విద్యను నీకు ఆతపఃక్లేశము లేకుండనే యిచ్చుచున్నాను. ఈ విద్యచేతనే మేము మనుష్యులకన్న అధికులమై దేవతలతో సమానుల మైతిమి. గంధర్వలోకములో పుట్టిన ఉత్తమాశ్వములను మీకు ఒక్కొక్కరికి ఒక్కొక్క నూరు ఇచ్చెదను. ఇవి గంధర్వులకు దేవతలకు మాత్రమే వాహనయోగ్యములు. ఇవి దివ్యకాంతి గలవి. మనోవేగము గలవి. అవసరమును బట్టి చిన్నవిగను, పెద్దవిగను మారుచుండును. అయినను, వేగము మాత్రము తగ్గదు. పూర్వము వృత్రాసురసంహారార్థమై వజ్రాయుధము నిర్మింప బడెను. ఇంద్రుడు దానితో వృత్రుని తలపైన కొట్టెను. అది విరిగి పది పెద్ద ముక్కలుగాను, నూరు చిన్న ముక్కలుగాను విభక్తమయ్యెను దాని ప్రతిముక్కను దేవతలు ఉపాసింతురు. లోకములో ధనము, యశస్సు మొదలగు శ్రేష్ఠవస్తువులన్నియు వజ్రస్వరూపములుగనే భావింప బడును. అగ్నిలో హోమము చేయుటచేత బ్రాహ్మణునికుడిచేయి వజ్ర మనబడును, క్షత్రియుని రథము వజ్రము. వైశ్యుని దానకర్మ వజ్రము, శూద్రుని సేవాకర్మ వజ్ర మనబడును అశ్వము క్షత్రియునిరథ వజ్రముయొక్క ప్రధానాంగము గనుక అది అవధ్య మగును, గంధర్వలోకములోని అశ్వి (ఆడుగుఱ్ఱము), రథంగరూప (వజ్రస్వరూప)ము లైన అశ్వములను కనెను. ఆ గుఱ్ఱములే అన్నింటిలోను శ్రేష్ఠము లగును. ఈ గాంధర్వాశ్వములకు ఇచ్ఛానుసారముగా రంగులు మారుచుండును. రథికునియిచ్ఛానుసారముగా వేగములో హెచ్చుతగ్గులు గలుగు చుండును. రథికునకు అవసర మైనప్పుడు తలచిన వెంటనే యెదుట వచ్చి నిలుచును. ఇట్టి ఉత్తమాశ్వములను మీకు ఇచ్చుచున్నాను. ఇవి మీ యిచ్ఛాపూర్తిని చేయగలవు"

(సశేషము)

మము నాకు భాగ్యవశాత్తు కలిగినది. నేను ధన్యుడను. కనుక, మన సుభాషిత గోష్ఠిలో నేనేమైన అనుచితముగా చనవుచేత మాట్లాడి యుండినచో నన్ను క్షమింపుము. హిరణ్యక, మంథర కులతో గూడ [illegible] చేయుము." అని చెప్పెను. ఆ మాటవిని లఘుపతనకుడు, "మిత్రమా! మేముండగా నీకు భయమెందుకు? నేను ఇప్పుడే పోయి మన హిరణ్యకుని తోడుకొని వచ్చెదను. కాక, నీవంటి సజ్జను లెప్పుడు గూడ వ్యసనములందు వ్యాకులపడగూడదు" అని చెప్పి లఘుపతనకుడు చిత్రాంగుని ఊరడించి, హిరణ్యక మంథరకులున్న చోటికిపోయి చిత్రాంగున కేర్పడిన పాశబంధమును గూర్చి వారికి వివరించెను. ఆ మాటవిని హిరణ్యకుడు చిత్రాంగుని ఉరిత్రాళ్లు త్రెంచుటకు అంగీకరించెను. లఘుపతనకు డప్పుడు హిరణ్యకుని తనవీపుపైన ఎక్కించుకొని వేగముగా మరల చిత్రాంగుడున్న చోటికి పోయెను. చిత్రాంగుడు ఎలుకను చూచి కొంచెము జీవితాశగలవాడై" ఆపదగలిగినప్పుడు దానిని పోగొట్టుకొనుటకు సన్మిత్రులు ఉండవలెను. మిత్రులు లేనివారు ఆపద గడపజాలరు అని తలచి సంతసించెను.

హిర:—మిత్రమా! నీవు నీతి శాస్త్రమును బాగుగా ఎరిగిన సమర్థుడవు గదా! ఈ గుప్త పాశములలో ఎట్లు తగులుకొంటివి?

చిత్రాం:—ఓయీ! వాద వివాదముల కిది సమయముకాదు. కనుక దురాత్ముడైన వ్యాధుడు వచ్చులోపల నా పాదముల కట్లు కొరికివేయుము.

హిర:—(నవ్వి) నేను వచ్చిన తరువాతగూడ నీకు ఇంకను వ్యాధ భయమా? నీవంటి నీతి శాస్త్రజ్ఞులు గూడ ఇట్టి ఆపదకు లోనగుట చూచి నాకు శాస్త్రముపైన విశ్వాసము తగ్గుచున్నది.

చిత్రాం:—మిత్రమా! కర్మ యనునది బుద్ధినిగూడ నష్టము చేయును.

ఈ విధముగా వారిరువురు మాట్లాడుకొనుచుండగా మిత్రున కేర్పడిన దుఃఖముచేత పరితపించిన మనస్సు గలవాడై మంథరకుడు మెల్ల మెల్లగా నచటికి వచ్చెను. అతనిని చూచి హిరణ్యకునితో—

లఘు:—అయ్యో! ఎంత కష్టమైనది?

హిర:—వ్యాధుడు వచ్చెనా యేమి?

లఘు:—వ్యాధుని మాట అటుంచుము. ఇదుగో మన మంథరకుడు వచ్చుచున్నాడు. ఇతడెంత బుద్ధితక్కువపని చేసెను? ఈ మంథరకుని కారణముగా మన మందరము గూడ వినాశము చెందవలసి వచ్చినది. ఒక వేళ పాపాత్ముడైన ఆ వ్యాధుడు వచ్చినచో, నేను ఆకాశములో ఎగిరిపోయెదను. నీవు బిలములో దూరి ఆత్మ రక్షణము చేసికొనగలవు. చిత్రాంగుడు గూడ వేగముగా దిక్కులు పట్టి పరుగెత్తగలడు. కాని, యీ జలచరుడైన మంథరకునకు నేలపై నెట్టి దుర్గతి సంభవించునో గదా? ఇతడెక్కడకు గూడ పరుగెత్తజాలడు గదా! అని వ్యాకుల పడుచున్నాను. ఇంతలో మంథరకుడు వచ్చెను. అతనిని చూచి,

హిర:—మిత్రమా! ఎంత అకార్యము చేసితివి? ఇక్కడి కెందుకు వచ్చితివి? వెంటనే తిరిగి పొమ్ము. ఇంతలో వ్యాధుడు ఇక్కడికి రానున్నాడు. నీవు అప్పుడు తప్పించుకొనజాలవు.

మంథ:—మిత్రమా! ఏమిచేయుదును? అక్కడ దూరమున నేనుండి మిత్ర దుఃఖాగ్నిదాహమును సహించలేక వచ్చితిని.

ఇట్లు మంథరకుడు చెప్పుచుండగనే ధనుస్సును ఎక్కుపెట్టుకొని కిరాతుడు అక్కడికి రానేవచ్చెను. అతనిని చూచి యెలుక వెంటనే చిత్రాంగుని బంధములను తెగ గొరికెను. చిత్రాంగుడు వెనుదిరిగి చూచుచు పరుగెత్తిపోయెను. లఘుపతనకుడు వృక్షమునెక్కెను. హిరణ్యకుడుగూడ సమీపమున నున్న బిలములో దూరెను. అప్పుడు వ్యాధుడు, తప్పించుకొని పారిపోవుచున్న చిత్రాంగుని చూచి తన శ్రమ వ్యర్థమైనందుకు వ్యసనపడి చేయునదలేక అక్కడ సమీపమునందే మెల్ల మెల్లగా పారాడుచున్న మంథరకుని చూచెను. చూచి యిట్లు చింతించెను:—"దైవ మొకవేళ మృగమును అపహరించుకొని పోయినను ఈ తాబేలును నాకు ఆహారార్థమై సంపాదించి యిచ్చెను. కనుక నేడు ఈ తాబేలు మాంసముచేత నా కుటుంబ పోషణము చేసికొనెదనుగాక." అని చింతించి ఆ తాబేలును గడ్డితో కప్పి ధనుస్సు కొనకు కట్టుకొని భుజముపైన పెట్టుకొని యింటికి పోవుటకు బయలుదేరెను.

ఇంతలోపల, ఆ విధముగా తీసికొని పోబడుచున్న మంథరకుని చూచి హిరణ్యకుడు దుఃఖము చేత బిగ్గరగా ఏడ్చెను. "అయ్యో! ఎంతకష్టము సంప్రాప్తమయ్యెను? ఒకవేళ దైవము నాకు ధన నాశము కలిగించినను లక్ష్యము చేయకుంటిని. మార్గ పరిశ్రమచేత అలసిన నాకు విశ్రాంతిని, సౌఖ్యమును కలిగించు మిత్రు నేల దైవ మపహరించెను? ఎందరినో మిత్రులను సంపాదించుకొనవచ్చును గాని మంథరకుని వంటి మిత్రుడు లభించుట కష్టము. ఇతని యనంతరము ఇట్టి మిత్రుడింక నాకు లభించడు. కనుక దైవము నాపైన ఎడతెగకుండ ఈ లాగు వ్యసన పరంపరలను ఎందుకు కురియుచున్నాడు. తొలుత ధన నాశము, తరువాత కుటుంబ నాశము, పిదప దేశత్యాగము, ఆ తరువాత మిత్రుని యెడబాటు. ఇన్ని అనర్థ పరంపరలు నాకు దైవము వరుసగా చేకూర్చెను. జంతువు లందరికిని ఈలాగు జరుగుట సహజమే యగును. ఇదియే జీవిత ధర్మ స్వభావము."

అని పరి పరి విధముల హిరణ్యకుడు దుఃఖించుచుండెను. ఇంతలో చిత్రాంగ, లఘుపతనకులు గూడ ఏడ్చుచు హిరణ్యకుడున్న చోటికే వచ్చి యిట్లనిరి:—

హిర:—ఓయీ! వ్యర్థముగా దుఃఖించుటవలన ఉపయోగ మేమున్నది? ఈ మంథరకుడు మన దృష్టికి కనపడకుండ పోవులోపల అతని విముక్తికి ఉపాయమును చింతించెదము గాక.

లఘు:— ఓయీ! అట్లైనచో, నేను చెప్పినట్లు చేయుము. ఈ చిత్రాంగుడు ఆవ్యాధుడు పోవు మార్గములోనే పోయి ఒక చిన్న నీటి గుంటను ఆశ్రయించి దాని తీరమునందు నిశ్చేతనుడై చచ్చినట్లు పడియుండుగాక. నేను అతని తలపైన ఎక్కి మెల్లమెల్లగా నాముక్కుతో అతనినితన్ని తలను గీరుచుండెదను దానిని చూచి, దురాత్ముడైన లుబ్ధకుడు నేను ముక్కుతో గీరుటను గూచి చిత్రాంగుడు చచ్చి పడియున్నాడని విశ్వాసపూర్వకముగా తలచి, మంథరకుని నేలపైన ఉంచి, మృగముకొరకు పరుగెత్తగలడు. ఇంతలో నీవు మంథరకుని గడ్డి త్రాళ్ళను పండ్లతో కొరకివేయుము కట్లు వీడిన మంథరకుడు వెంటనే ఆ నీటి గుంటలో దూరిపోవును. నీటిలో అతనికి బలమెక్కువ. అతని నెవరుగూడ నీటిలో పట్టజాలరు.

చిత్రాం:— ఓయీ! నీ ఆలోచన చాల బాగుగా నున్నదిసుమా! ఈ యుపాయముచేత మంథరకుడు విముక్తుడైనట్లుగానే మనము భావించవచ్చును. కనుక అట్లే చేయుదముగాక

ఆవిధముగానే పన్నాగముచేయగా, ఆ లుబ్ధకుడు, తలపైన కాకి కూర్చున్న చిత్రాంగుని చూచి, మిక్కిలి హర్షించి యిట్లు చింతించెను:— నిక్కముగా, ఈ మృగము ఉరికట్లబాధచేత వ్యసనపడి యేలాగోతప్పించుకొని యిచటికి పరుగెత్తివచ్చి అశక్తితో ఇక్కడ పడిచచ్చెను. గట్టిగా కట్టబడిన యీ తాబేలు ఏలాగైనను నాకు వశ్యమే. ఇది తప్పించుకొని పోవజాలదు. కనుక ఈ మృగమునుగూడ తీసికొనెదనుగాక." అని నిశ్చయించుకొని, తాబేటిని నేలపైన ఉంచి మృగముకొరకు ఉరికెను. ఇంతలోనే హిరణ్యకుడు వజ్రములవంటి తన చిన్న కోరలచేత తాబేటికి కట్టిన గడ్డిత్రాళ్లను కొరికెను మంథరకుడు తప్పించుకొని నీటిలో దూరెను. చిత్రాంగుడు గూడ, వ్యాధుడు తనవద్దకు వచ్చులోపలనే పారిపోయెను. కాకిగూడ ఆకాశములో పారిపోయెను ఇంతలో, నిరాశచెంది, దుఃఖితుడై వ్యాధుడు తిరిగివచ్చి చూచుసరికి మంథరకుడు గూడ తప్పించుకొనిపోయి యుండెను. అతడు మిక్కిలి దుఃఖించి వట్టి చేతులతో నింటికి తిరిగిపోయెను.

ఆవ్యాధుడు పోయిన తరువాత కాక—కూర్మ—మృగ—మూషికములు ఒకచోటచేరి, మిక్కిలి ఆనందమును అనుభవించినవై, పరస్పరము ఆలింగనము చేసుకొని, తిరిగి తమకు పునర్జన్మ లభించినట్లుగా తలచుచు, తమ తొలుతటి కొలనికే పోయి మహా సుఖముగా, సుభాషిత కథలతోను, ఇష్టాగోష్ఠులతోను వినోదముగా కాలము గడపుచుండెను.

ఈ కథను తెలిసికొని, వివేకము గల మానవులు తప్పక మిత్ర సంగ్రహము చేసికొనవలెననియు, మిత్రులతో కపటముగా వ్యవహరించకూడదనియు గ్రహించవలెను.

(స శే ష ము)

47 వ పుట తరువాయి

పచ్చియాకు పైర్లను పొలంలోకి వడదున్ని మళ్ళీ హెక్టేరుకు 37 టన్నుల చొప్పున టౌన్ కంపోస్టు వేశారు. తర్వాత హెక్టేరుకు 600 కిలోల సూపర్ ఫాస్పేట్ చొప్పున వేశారు. హెక్టేరుకు 750 కిలోల వేరుశెనగ పిండిని 150 కిలోల మ్యూరియేట్ ఆఫ్ పొటాష్‌తో కలిపి వేశారు.

అటు నారుమడిపట్ల తగినంత శ్రద్ధ వహించారు గంగన్న. బాగా ఎరువులు వేసివున్న వాటిలో నారుమొక్కలు బలంగా పెరిగాయి. ఎందుకయినా మంచిదని వాటి మీద ఎండ్రిన్ కూడా చల్లారు.

వీటిలో ఆరోగ్యమైనవాటిని ఊడ్చే నిమిత్తమై ఎన్నుకున్నారు. పాదుకు మూడు లేక నాలుగు మొక్కల చొప్పున వరుసలలో నారు నాటారు. పాదుల మధ్య దూరం 12 సెంటిమీటర్లూ, వరుసల మధ్య దూరం 20 సెంటిమీటర్లూ వుంచారు.

గంగన్న మూడుసార్లు అంతర కృషి చేశారు. ఊడ్చిన 25 రోజులకు హెక్టేరుకు 250 కిలోల చొప్పున అమోనియం ఫాస్ఫేటు వేశారు.

"ప్రతి మూడవ రోజూ పాత నీటిని తీసి వేసి, కొత్తగా నీరుపెట్టే వాడిని" అని వివరించారు గంగన్న.

కాడం తొలిచే పురుగు బెడద అరికట్టడానికై ఎండ్రిన్ చల్లారు. చివరి సారిగా గంగన్న యూరియాను హెక్టరకు 125 కిలోల చొప్పున చల్లారు.

ఇంతటి కృషికి ఫలితంగా ఆపైరు అద్భుతంగా పెరిగింది. వరి మొక్కలు ఏపుగా ఎదిగాయి. అవి వాలి పడిపోకుండా గంగన్న పొలంనిండా మీటరు కొకటి చొప్పున వెదురు కర్రలు పాతి, మొక్కలను దారాలతో ఆ కర్రలకు కట్టారు!

పోటీ న్యాయ నిర్ణేతల సమక్షంలో పైరును కోయగా ఎకరాకు 4308 కిలోల పచ్చి ధాన్యం వచ్చింది (ఎండిన తర్వాత ఇది 3834.87 కిలోలు అయింది. 1965—66 సంవత్సరంలో ఇంతకన్న ఎక్కువ వరి ధాన్యం పండించిన వారు దేశంలో ఎవరూ లేరు! కనుక గంగన్న 'కృషి పండిత్' అయ్యారు.

తెనుగు వారికి వ్యవసాయం ఉగ్గు పాలతో పోసిన విద్య. మన రైతులలో ఇంకా ఎందరో 'గంగన్న' లున్నారనీ వారందరూ రాబోయే సంవత్సరాలలో 'కృషి పండిత్'లు కాగలరనీ ఆశిద్దాము.

టి. ఆర్. ఆర్.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD-24
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.

